# వేకువ వెలుగులు

## ఆంధ్రప్రదేశ్‌లో ఆర్.ఎస్.ఎస్.




డా. ఓగేటి అచ్యుతరామ శాస్త్రి



**నవయుగభారతి**

హైదరాబాద్

VEKUVA VELUGULU

*Andhrapradeshlo RSS*

*Andhrapradeslo RS*

*By*

Dr. Ogeti Achyuta Rama Sastry

ప్రచురణ:

నవయుగభారతి

3-4-852, కేశవనిలయం, బరకత్‌పురా, హైదరాబాద్ - 500 029.

ఫోన్ : 756 3236



అక్షరముల కూర్పు :

మహతి క్రియేషన్స్, హైదరాబాద్, ఫోన్ : 760 7177

Printed at : Charitha Graphics,
Chikkadapally-Hyd-20
Phone : 7607361

ప్రతులకు:

సాహిత్యనికేతన్, 3-4-852, కేశవనిలయం, హైదరాబాద్, ఫోన్ : 756 3236

సాహిత్యనికేతన్, ఏలూర్ రోడ్, విజయవాడ.

వెల : రూ. 35/-

# ప్రకాశకుల మనవి

1925లో నాగపూర్‌లో రాష్ట్రీయ స్వయంసేవక సంఘ్ అనే వటవృక్షం యొక్క బీజం నాటారు డాక్టర్ హెడ్గేవార్. అది మొక్కగా పెరిగి, వృక్షమై శాఖోపశాఖలుగా దేశమంతా విస్తరిల్లింది. అయితే ఆ వటవృక్షం పెర్గటానికి తోడ్పడిన వారెందరో. రాబోయే తరానికి ఆ వృక్షం నీడ నివ్వాలనీ, తమకు లాభమున్నా లేకపోయినా, చెట్టుకు పాదు చేసి నీళ్ళు పోసారు వారందరూ.

1940 ప్రాంతంలో మహారాష్ట్రకు చెందిన కొందరు యువకులు ఆర్.ఎస్.ఎస్. ను ఆంధ్ర ప్రాంతంలో కూడ విస్తరింపజేయాలనే తలంపుతో, తమ స్వార్థాన్ని వదలుకుని, జాతీయ భావ ప్రేరణతో, ఇక్కడకు వచ్చి, కష్టనష్టాలకు ఓర్చి, సంఘాన్ని ఇక్కడ ప్రారంబించారు. పెంచారు. వారందరి జీవిత చరిత్రలను ఈనాటి వారికి తెలియజెప్పాలనీ, వారి త్యాగభావ సుగంధ పరిమళాన్ని పలువురికి అంద జేయాలనీ రచయిత ఈ పుస్తకంలో ప్రయత్నించారు.

రాష్ట్రకవి డాక్టర్ ఓగేటి అచ్యుతరామశాస్త్రి, కవిగా, సాహిత్య విమర్శకుడుగా, వక్తగా అందరికీ పరిచయస్తులే. ఈ పుస్తక రచనకు కావలసిన విషయ సేకరణకు మహారాష్ట్ర పర్యటించి , ఆయా వ్యక్తులను స్వయంగా కలిసి, ఎంతో ప్రయాసతో రూపొందించిన పుస్తకమిది. ఇది ఒకరకంగా సంఘ చరిత్ర పరిశోధనా గ్రంథం. వారికి కృతజ్ఞతాపూర్వక వందనాలు.

ఈ పుస్తక ప్రచురణలో సహాయ సహకారాలందించిన వారందరికీ మా నమోవాకాలు.

శ్రీ ఈశ్వర, కార్తీక పౌర్ణమి
14, నవంబరు, 1997
భాగ్యనగరం

ప్రకాశకులు



मुंबई
आश्विन व. ६ युगाब्द ५०९९
दि. २२ अक्तू.९७

राष्ट्रीय स्वयंसेवक संघ भारत देश का एक अजोड हिंदू संगठन है। पंथ, प्रांत भाषा, जात-पात आदिकी मर्यादाओंको लांघकर यह संगठन आज एक देशव्यापी संगठन के रूपमें खड़ा हुआ है। इतनाही नहीं तो दुनिया भरमें सबसे बड़ा स्वयंसेवी संगठन है ऐसा अब लोग मानने लगे हैं।

एक जन्मजात देशभक्त डॉ. केशव बलिराम हेडगेवार की देशको यह एक अपूर्व देन है। और उन्हीकी प्रेरणासे लाखों युवकोंने अपना पसीना बहाकर वर्तमान के गौरव और भविष्यकी आशा के रूपमें इस कार्य को बढाया है।

संघ कार्यकी सफलता का एक कारण है उसके कार्यपध्दतीमें समाहित रोमांचकता। वह अपने मे ही अनूठी और बेजोड है। जिसके कारण हजारो युवकोंने देशसेवा का असिधारा व्रत हँसते हँसते स्वीकार किया।

सफलताका दूसरा कारण है समाजका अनुपम सहयोग। किसी कार्य की प्रगति के लिये यह अनमोल चीज होती है। सात्विक प्रेरणा और अथक परिश्रम के बिना यह सहयोग प्राप्त होना एक असंभवसी बात है।

यह सारा होते हुअे भी अपनी जीवनयात्रा चलाते समय रा. स्व. संघको अनेक कठिनाइयाँ और समस्याओं का सामना करना पडा है। संघ के विकासयात्रा की कहानी दर्दभरी होते हुअे भी रोमांचकारी है। रोमांचकतामे से ही जीवन के बहुविध स्वप्न, बंधुप्रेम और स्वदेश प्रेम की भावना प्रस्फुटित होती है। उसीमें से ही समाजहित का पवित्र गंगाप्रवाह बहने लगता है। संघ गंगा की यही एक मनमोही कथा है।

ऐसे अनुपम संघटन की विकासयात्रा का इतिहास आगे आनेवाली पीढी को ज्ञात होना यह समयकी एक माँग है। उस दृष्टी से सात आठ साल पहले अनेक लोगों के मनमें यह विचार आया। उस दिशा में कुछ प्रांतों में प्रयासभी आरंभ हुआ। आनंद की बात है कि पहला सफल प्रयोग आंध्र प्रांत में हुआ।

तीन साल पहले श्री. डॉ. ओंगटि अच्युतराम शास्त्रीजीकी मुंबई में भेंट हुई। उन्होने उस दिशा में प्रयत्न भी प्रारंभ किये। उनकी लगन और परिश्रम के फलस्वरूप यह पुस्तक आपके सामने आया है। पुंस्तक लेखन के लिये एक सजग, सचेतन साहित्य द्रष्टा की आवश्यकता होती है। सौभाग्य से यह सारे गुण उनमें होने के कारण आंध्र प्रदेशकी संघविकास की यात्रा का यह सत्य चित्रण आपके सामने प्रस्तुत हुआ है।

संघकार्य के लिये आंध्रप्रदेश में आये हुअे जिन व्यक्तियों के बारे में यह पुस्तक लिखी गयी है, उनके बारे में श्रध्दा, इतिहास लेखन की दृष्टी, सामाजिक बोध तथा परिस्थिति का विश्लेषण करने का विवेक होने के कारण श्री. अच्युतराम शास्त्रीजी अपने प्रयत्नोंमे सफल हुए है। वे साधुवाद के पात्र है। अन्यान्य प्रांतों को इससे दिशा, स्फूर्ति और प्रेरणा मिलेगी। और सारे प्रांतो में ऐसे प्रयास प्रारंभ होंगे ऐसी मैं आशा करता हूँ। इस दृष्टीसे इस पुस्तक का हिन्दी अनुवाद होना जरुरी है। श्री. अच्युतराम शास्त्रीजी इस दिशामें प्रयत्न करेंगे ऐसा मुझे विश्वास है।

भवदीय

हो. वे.

# ముందుమాట

రాష్ట్రీయ స్వయంసేవక సంఘం దేశంలోని ఒక అద్వితీయ హిందూసంఘటన! భాషా, ప్రాంత, పంథ, జాతి భేదాలను అతిక్రమించి ఎదిగిన ఆర్.ఎస్.ఎస్ నేడు ఒక దేశవ్యాప్తమైన సంస్థగా నిలుచుంది. అంతేకాదు, దీనిని ప్రపంచంలోనే అతిపెద్ద స్వచ్ఛంద సంస్థగా ప్రజలు గుర్తిస్తున్నారు.

జన్మజాత దేశభక్తులైన డా॥హెడ్గేవార్ దేశానికి ఇచ్చిన అపూర్వ సంపద ఆర్.ఎస్.ఎస్. ఆయన ద్వారా ప్రేరితులైన లక్షలాది యువకులు చెమటోడ్చి కష్టించి ఈ సంస్థకు ప్రస్తుతమున్న గౌరవపూర్ణమైన స్థాయికి తెచ్చారు. దీనిని భవిష్యత్తులో ఆశాకారకమైన సంస్థగా తీర్చిదిద్దారు.

సంఘకార్యపద్ధతిలో ఉన్న ఉత్సాహోద్దీపనలే సంఘ కార్యసాఫల్యానికి కారణం. ఇది చాలా విశిష్టమైనది. అద్వితీయమైనది. దీని కారణంగానే వేలాది యువకులు దేశసేవకోసం అసిధారా వ్రతాన్ని చిరునవ్వుతో స్వీకరించారు.

సాఫల్యానికి మరో కారణం సమాజం నుంచి లభించిన సహకారం! ఏ పని ప్రగతికైనా సమాజసహకారం అత్యంత విలువైనది. సాత్విక ప్రేరణ, కఠోరపరిశ్రమ చేయనిదే ఈ సహకారం లభించడం అసంభవం.

ఇవన్నీ ఉన్నప్పటికీ, ఆరెస్సెస్ తన జీవన యాత్రలో అనేక ఇక్కట్లను, ఇడుములను ఎదుర్కోవలసి వచ్చింది. వేదనామయమైన సంఘటనలెన్నున్నా, సంఘం వికాసయాత్ర ఉత్సాహోద్దీపనాలను కలిగిస్తుంది. దీనివల్లే జీవితంలోని అనేక స్వప్నాలు, మిత్రప్రేమ, స్వదేశప్రేమ వంటి భావనలు ప్రస్ఫుటితమవుతాయి. దీని నుంచే సమాజహితమనే గంగాప్రవాహం మొదలవుతుంది. సంఘగంగ యొక్క మనోమోహికమైన గాథ ఇది.

ఈ నిరుపమానమైన సంస్థ వికాసయాత్రాచరిత్ర. రాబోయే తరాలకు తెలియాల్సిన అవసరం ఉంది. ఈ దృష్ట్యా ఏడెనిమిదేళ్ళ క్రితం పలువురు వ్యక్తులు ఆలోచించనారంభించారు. కొన్ని ప్రాంతాల్లో కొంతమేరకు ప్రయత్నాలు కూడా మొదలయ్యాయి. ఆంధ్ర ప్రాంతంలో ఈ ప్రయత్నం విజయవంతంగా నెరవేరడం ఆనందదాయకమైన విషయం.

శ్రీ ఓగేటి అచ్యుతరామశాస్త్రిని మూడేళ్ళక్రితం ముంబాయిలో కలుసుకోవడం జరిగింది. ఆయన అప్పట్లోనే ఈ దిశలో ప్రయత్నాలు ప్రారంభించారు కూడా! ఆయన నిష్ఠ, పరిశ్రమలవల్లే ఈ పుస్తకం వెలుగుచూసింది. పుస్తకరచనకు జాగరూకుడు, సచేతనుడు అయిన సాహిత్య ద్రష్ట అవసరం. ఈ గుణాలన్నీ వారిలో ఉండటంవల్లే ఆంధ్రప్రదేశ్ సంఘ వికాసయాత్ర సత్యచిత్రణను మీముందుంచగలిగారు.

ఆంధ్రప్రదేశ్లో సంఘకార్య విస్తరణ కోసం వచ్చినవారిపట్ల శ్రద్ధ, సామాజిక కర్తవ్యబోధ, చరిత్రరచనా దృక్పథం, పరిస్థితుల విశ్లేషణా వివేకం ఉన్నందున శ్రీ అచ్యుతరామశాస్త్రి తమ ప్రయత్నాల్లో విజయం సాధించారు. వారు ప్రశంసాపాత్రులు. అన్యాన్య ప్రాంతాలకు దీనిద్వారా స్ఫూర్తి, ప్రేరణ లభిస్తుంది. మిగతా ప్రాంతాల్లోనూ ఇలాంటి ప్రయత్నాలు ప్రారంభమవుతాయని ఆశిస్తున్నాను. ఈ దృష్ట్యా ఈ పుస్తకాన్ని హిందీభాషలోకి అనువదించడం అవసరం. శ్రీ అచ్యుతరామశాస్త్రి ఈ ప్రయత్నం చేస్తారనే నా విశ్వాసం.

ముంబాయి
అశ్విని వ.6, యుగాబ్ది 5099
తేది : 22, అక్టోబర్ 1997

భవదీయ
మోరోపంత్ నీలకంఠ్ పింగ్లే

# విషయ సూచిక

# పూర్వరంగము

" వేకువ వెలుగులు ( ఆంధ్రప్రదేశ్‌లో ఆర్.యస్.యస్ )" అన్న పేరుతో వ్రాయబడిన ఈ గ్రంథమును పాఠకుల కరకమలములందుంచుచున్నందుకు మహదానందంగా ఉన్నది. ఈ గ్రంథ రచనకు లభించిన ప్రేరణ, అందుకు చేసిన ప్రయత్నములను గూర్చి దిఙ్మాత్రంగా ప్రస్తావించుట సమంజసంగా భావిస్తున్నాను.

విజయవాడలో 1940 సెప్టెంబరులో మొట్టమొదటి సంఘశాఖ ప్రారంభింపబడింది. ఇది ఆంధ్రప్రదేశ్‌లోనే మొదటి శాఖ. నాగపూర్‌నుండి మాననీయ శ్రీ దత్తాత్రేయ నారాయణ్ యాద్వడ్కర్‌జీ అనునొక మహనీయుడు మా. శ్రీ దత్తాత్రేయ దండోపంత్ బందిష్టే అనువారిని వెంటబెట్టుకొని ఒక జట్టుగా వచ్చి యీ మొదటి శాఖను ప్రారంభించిరి. దరిమిలా రెండు మూడునెలలకు మా. శ్రీ వినాయకరావ్ లక్ష్మణ్ దేశముఖ్, మా. శ్రీ గోపాలరావ్ ఠాకూర్ అను మరొక యిద్దరు మహనీయులు రెండవ జట్టుగ వచ్చి మొదటి జట్టుతో కలిసి సంఘకార్య విస్తరణకు కృషి చేసిరి. ఇట్లు కాలక్రమంలో విడతలు విడతలుగా జట్లు జట్లుగా మరెందరో మహితాత్ములు వచ్చి యీ విస్తరణ కార్యంలో తమవంతు సేవను చెల్లించడం జరిగింది. అట్లా వచ్చిన మహనీయుల సంఖ్య రమారమి నలభై వరకు గలదు. వీరందరి కృషివల్ల యేర్పడిన సంఘ చరిత్రను గూర్చి రాబోవు పుటల్లో వివరంగా పేర్కొనడం జరుగుతుంది.

గుంటూరు జిల్లా పొన్నూరు పట్టణంలో 1943 అక్టోబరులో సంఘశాఖ ప్రారంభింపబడింది. ప్రారంభించినవారు మా. శ్రీ దత్తాజీ బందిష్టే. అది ప్రారంభింపబడిన తొలిరోజునుండి నేను స్వయంసేవకుణ్ని కావడం నా అదృష్టం. అప్పుడు నాకు పదేళ్ల వయస్సు. నేను ఎఱిగిన మొదటి ప్రచారక్ శ్రీ బందిష్టేజీ. ఆ వరుసలో కాలక్రమంలో వచ్చిన ఎందరో ప్రచారకులను చూసే అవకాశం నాకు లభించిందని చెబితే అతిశయోక్తి కాదు. మిక్కిలి చిన్న వయస్సులో తల్లిదండ్రుల్ని, స్వగ్రామాన్ని విడిచి సుదూరంలో ఉన్న 'కాని ప్రాంతాలకు' వచ్చి, ఎన్నో కష్టాలుపడి, మొక్కవోని కార్యనిష్ఠతో పనిచేసి, సంఘశాఖల విస్తరణకై కృషిచేసిన ఈ మహానుభావుల్ని చూసినవారిలో నేను

కూడా ఒకణ్ణే అని మళ్లీ చెబితే పునరుక్తి కాబోదని మనవి. ఈ సుదీర్ఘకాలఖండంలో ఈ కార్యకర్తలందరూ తరుచుగా స్మృతిపథంలో మెదల్తూ, వారు పడిన కష్టాలు జ్ఞప్తికి వస్తూ ఒకవైపు గుండెలు పులకరిస్తున్నట్లున్నా, మరొకవైపుపిండినట్లుండి యెంతో తపనపడుతూ ఉండేవాణ్ణి. వారికోసం ఏదైనా చెయ్యాలనే తహతహలుపోతూ ఉండేవాణ్ణి. దాని ఫలితమే యీ గ్రంథావిష్కారం!

1940-1997 - ఈ మధ్య రమారమి యాభైఆరు సంవత్సరాలు గడచినవి. ఆ ప్రచారకుల్లో మన దురదృష్టం కొలది కొందరు కీర్తిశేషులైనారు. మన అదృష్టం కొలది కొందరు ఇంకనూ జీవించే ఉన్నారని చెప్పడానికి మహదానందంగా ఉన్నది. అందులోను, తొలిజట్టుగా వచ్చిన శ్రీ యాద్వడ్కర్‌జీ, శ్రీ బందిష్టేలు ఇంకనూ దీర్ఘాయుష్మంతులై యుండుట మరింత మహదానందకరం! వీరందరూ జీవించి ఉండగానే యదార్థ ప్రారంభ చరిత్రను సంగ్రహించటానికి సాధ్యమౌతుంది. కానిచో మిక్కిలి కష్టం. ఇది మాతరం వారికే సులభ సాధ్యం. ఇప్పటి తరంవారికికాని, ఇంకనూ రాబోవుతరం వారికిగాని చాలా కష్టమనటంలో సందేహం లేదు. భగవత్కృపవల్ల యీ ఆలోచన నా మనస్సులో మెదిలిందేతడవు, యీ ప్రయత్నానికి పూనుకొన్నాను.

ప్రస్తుతం శ్రీ యాద్వడ్కర్‌జీ మహారాష్ట్ర ప్రాంతమునందలి బుల్డానా జిల్లాలోని "ఖామ్‌గావ్" పట్టణంలోను, శ్రీ బందిష్టేజీ మధ్యప్రదేశ్‌లోని ఇందోర్ నగరంలోను నివసిస్తున్నారు. ఆ రోజుల్లో శ్రీ యాద్వడ్కర్‌జీని నేను చూడలేదు. వారిని గూర్చి నాకు అంతగా తెలియదు. నేను చూసినవారు, నాకు తెలిసినవారు శ్రీ బందిష్టే మాత్రమే. శ్రీ కోటంరాజు దత్తాత్రేయులు, శ్రీ మేకా రామకోటీశ్వరరావుగార్లద్వారా తొలుత వారి ఇందోర్ అడ్రసును సంపాదించాను. వారికొక జాబు వ్రాశాను. వారినుండి వెంటనే తిరుగు జవాబు వచ్చింది. శ్రీ కోటంరాజు గారిద్వారా ఒక పరిచయపత్రం తీసుకుని ఇందోరుకు పయనమైపోయాను.

## మొదటి విడత ప్రయత్నము

1996 జూన్ 22 వతేదీన కాచిగూడ-అజ్మీరు ఎక్స్‌ప్రెస్‌లో ప్రయాణించి ఇందోరుకు చేరుకున్నాను. 24,25 తేదీల్లో వారి యింట్లో ఆతిథ్యం పొందే అదృష్టం లభించింది. వారి వయస్సు 74 సంవత్సరాలు. అంతకు రెండు రోజులక్రిందటే వారి వెన్నెముకకు శస్త్ర చికిత్స జరిగింది. ఆసుపత్రినుండి యింటికి వచ్చి విశ్రాంతి తీసుకుంటున్నారు. అట్టి

పరిస్థితిలోగూడ ఆ రెండురోజులలో వారు నాకు కావాల్సిన యథార్థ చరిత్రను వివరంగా చెప్పారు. అవన్నీ నేను టేపురికార్డరులో క్యాసెట్టుగా రూపొందించాను. వారు వ్రాయలేని స్థితిలో ఉన్నందువల్ల కొన్ని విషయాలు నోట్సు వ్రాసుకున్నాను. వారి పాత ఫోటోలు మూడునాలుగు సంపాదించాను. వారితో కలిసి ఫోటోలో దిగాను. ఆశీస్సులు పొంది సెలవు తీసుకున్నాను.

25 వతేదీ సాయంత్రమే ఇందోరులో నివసిస్తున్న శ్రీ మోరేశ్వర్ వామన్ మోఘేజీని దర్శించాను. వారు బాపూరావ్‌జీ మోఘేగా ప్రసిద్ధి చెందిన స్వర్గీయ శ్రీ మధుసూదన్ వామన్ మోఘేజీ యొక్క జ్యేష్ఠసోదరులు. 90యేళ్ళ వృద్ధులు. శ్రీ బాపూరావ్‌జీ మోఘే 1947-1959 మధ్య ఆంధ్రప్రదేశ్ ప్రాంత ప్రచారకులుగా పనిచేసిన మహనీయులు. కొంతకాలము క్రిందటనే దివంగతులైనారు. వారి అన్నగారివలన క్లుప్తంగా శ్రీ బాపూరావ్‌జీ మోఘే యొక్క బయోడేటాను నోట్స్ వ్రాసుకున్నాను. వారి ఆశీస్సులు పొంది సెలవు తీసుకున్నాను.

మన అదృష్టంకొద్దీ శ్రీ యాద్వడ్కర్‌జీ ఇంకనూ జీవించియే ఉన్నారన్న సంగతి శ్రీ బందిష్టేజీ వల్ల తెలుసుకున్నాను. వారి దగ్గర పరిచయపత్రం తీసుకుని 26వతేదీ ఉదయం ఇందోరుకు మూడువందల కిలోమీటర్ల దూరంలో ఉన్న 'ఖామ్‌గావ్'కు బస్సులో బయలుదేరి ఆ సాయంత్రం అక్కడికి చేరుకుని వారి దర్శనం చేసుకుని ఉప్పొంగి పోయాను. 85 సంవత్సరాల వృద్ధు. వారు నన్ను గుండెలకు హత్తుకుని విలవిల్లాడుతూ ఆనందబాష్పాలు రాల్చారు. కొంతసేపు విశ్రాంతి తీసుకున్న పిమ్మట ఒక టేపు రికార్డర్‌ను తెప్పించి 90 నిమిషాలపాటు వారి స్టేటుమెంటును క్యాసెట్ నింపాను. వారి దస్తూరితో చిన్న దస్తావేజును తీసుకున్నాను. ఆ రాత్రి వారి యింట్లోనే భోజనము, విశ్రాంతి. 27 వతేదీనాడు ఉదయం వారి పాత ఫోటోలు రెండుమూడింటిని సేకరించాను. ఒక ఫోటోగ్రాఫర్‌ని పిలిపించి వారితో కలిసి ఫోటోలో దిగాను. పరస్పరం ఒకరినొకరు విడువలేని స్థితిలో తెంచుకొని ఆశీస్సులుపొంది పయనమైనాను. ఈ విధంగా శ్రీ బందిష్టేజీ, యాద్వడ్కర్‌జీల వలన ఆంధ్రప్రదేశ్ ఆర్. యస్. యస్ చరిత్రకు సంబంధించిన తొలి ఉషస్సులను దర్శించి అదృష్టం పండినట్లు ఆనందించాను.

జూన్ 27వతేదీనాటి మధ్యాహ్నం ఖామ్‌గావ్‌నుండి బస్సులో బయలుదేరి సాయంత్రం 6 గంటలకు నాగపూర్ మహల్ సంఘ కార్యాలయానికి చేరుకొన్నాను. 28 వతేదీ ఉదయం, ప్రచారక్ బాధ్యతలనుండి ముక్తులై వృద్ధాప్యంలో సంఘకార్యాలయంలోనే ఉంటున్న ఆంధ్రప్రదేశ్‌లో పనిచేసిన పాత ప్రచారకులు శ్రీ దినకర్‌రావు బుచేజీని, శ్రీ విశ్వనాధ్

బోండాలే ప్రభృతులను కలుసుకొనడం జరిగింది. పిమ్మట నాగపూర్ సిటీలో నివసిస్తున్న శ్రీ శ్రీపాద గజానన్ సహస్ర భోజిని, శ్రీ నారాయణరావ్ భట్వాడేకర్‌జీల ఇళ్లకు వెళ్లి వారిని 29 ఉదయం 10 గంటలకు కార్యాలయానికి రమ్మని ఆహ్వానించాను. బెజవాడలో కొన్నాళ్లు ప్రచారక్‌గా ఉండి ప్రస్తుతం నాసిక్‌లో నివసిస్తున్న శ్రీ వినాయక్ శంకర్ ఆత్రే అనుకోకుండా కార్యాలయానికి వచ్చారు. వారిని కూడా ఆహ్వానించాను.

ఈ విధంగా వినా ఆత్రే, సహస్ర భోజిని, భట్వాడేకర్, దినకర్ బుచే, విశ్వనాథ్ బొండాలే గారలు 29 అపరాహ్ణం 11 గంటలకు కార్యాలయానికి చేరుకున్నారు. ఒక టేప్ రికార్డింగ్ స్టూడియో యజమానిని పిలిపించి వీరందరి యొక్క వక్తవ్యాలను క్యాసెట్లుగా నింపడం జరిగింది. అందరి దగ్గర లిఖిత దస్తావేజులు తీసుకున్నాను. ఒకటి, రెండు, మూడు చొప్పున అందరి ఫోటోలు సేకరించాను. శ్రీ దినకర్ బుచే యొక్క ఫోటో ఒక్కటిగూడ లభించలేదు. అప్పటికప్పుడు రిక్షామీద స్టూడియోకి తీసుకువెళ్లి వారి ఫోటో తీయించాను. అందరికీ మధ్యాహ్న భోజనాలు కార్యాలయంలోనే యేర్పాటు చేయబడినాయి. మొత్తం కార్యక్రమం పూర్తి అయ్యేటప్పటికి సాయంత్రం 5 గంటలు దాటింది. ఇదంతా యింత విజయవంతంగా నిర్వహించడానికి నాగపూర్ కార్యాలయ ప్రముఖ్ శ్రీ రాజాభావు దేశపాండే, రికార్డింగ్ స్టూడియో యజమాని శ్రీ తుషార్ దేవళేల సహాయసహకారాలే కారణం. వీరిద్దరికీ, ఈ పేర్కొనబడిన ఐదుగురు ప్రచారకులకు ధన్యవాదాలు.

30 వతేదీనాటి ఉదయం బయలుదేరి రాత్రి 10 గంటలవరకు సిటీ అంతా కలయజుట్టి మరి కొందరు పాత ప్రచారకుల చిరునామాలు సంపాదించి, కొందరిని కలుసుకొనడం జరిగింది. ముఖ్యంగా శ్రీ దేశముఖ్‌జీ అన్నగారి కొడుకును కలిసికొని వారి బయోడేటాను దిఙ్మాత్రంగా పొందాను. పిమ్మట ఆంధ్ర ప్రాంత ప్రచారక్‌గా పనిచేసిన కీ.శే. శ్రీ నరహరి బాలాజీ పార్థీజీ యింటికి వెళ్లి వారి ధర్మపత్ని శ్రీమతి హేమలతా పార్థీని, వారి కుమారులు భరత్ పార్థీ ప్రభృతులను దర్శించి, వారి బయోడేటాను ఫోటోలను కూడా సంపాదించగలిగితిని.

ఇట్లు దాదాపు పదిరోజుల పర్యటనలో మూడు పట్టణాలకు వెళ్లి, ఏడుగురు సజీవుల యొక్కయు, ముగ్గురు కీర్తిశేషుల యొక్కయు సంఘ జీవిత చరిత్రాంశాలను సేకరించి 30 వతేదీనాటి సాయంత్రం నాగపూరువదిలి బస్సులో ప్రయాణించి జూలై 1వతేదీ ఉదయం హైదరాబాదుకు చేరుకున్నాను.

# రెండవ విడత ప్రయత్నము

ఇది మొదటి దానికంటే కొంత భిన్నంగా జరిగింది. మొదటి విడతలో పర్యటనల కారణంగా ఎంతో డబ్బు ఖర్చు, ప్రయాణ ప్రయాసవల్ల అనారోగ్యమూ సంభవించాయి. అందువల్ల యీ రెండవ ప్రయత్నంలో ఉత్తర ప్రత్యుత్తరాల ద్వారా కార్యసాధనకు పూనుకొన్నాను. కావలసిన వివిధాంశాలను పొందుపరచి ఒక 'ప్రొఫార్మా'ను తయారుచేసి ''ఆవశ్యక్ సామగ్రీ'' అన్న శీర్షికతో హిందీలో భిన్న భిన్న వ్యక్తులకు భిన్న భిన్న పద్ధతులలో ఒక కవరింగ్ లెటర్ తగిలించి పంపాను. రికార్డు చేయబడిన క్యాసెట్టు, లిఖిత దస్తావేజు, మూడు విధాల పాత, కొత్త ఫోటోలు పంపవలసిందిగా అర్థించాను. ఇవన్నీ హైదరాబాదు సంఘకార్యాలయంలో ఒక గదిలో భద్రపరచి అందుకొక డిపార్టుమెంటును ఏర్పరచి, భావితరాలకు స్ఫూర్తిదాయకంగా చేయాలనే సంకల్పం గూడా తెలియజేశాను. ఈ ప్రొఫార్మాను 1996 ఆగస్టు నెలలో పంపడం జరిగింది. దానికి అసలే సమాధానం పంపని వారు కొందరు, కొంత ఆలస్యంగా పంపిన వారు కొందరు, చాలాచాలా ఆలస్యంగా పంపిన వారు కొందరు, యిలా నెలల తరబడి కార్యహాని జరిగింది. చాలా ఆలస్యంగానైనా పంపిన వారు నల్గురు మాత్రమే! వారిలో ఒకరు పూనా వాస్తవ్యులైన శ్రీ గోవిందబస్త హట్వేగారు. వారుకూడ లిఖిత పత్రాన్ని, ఫోటోలను మాత్రమే పంపారుగాని రికార్డు చేసిన టేపును పంపలేదు. అలాగే పూనాకే చెందిన స్వర్గీయ అప్పాపేంట్సే అనువారి ఛాయాచిత్రములతో కూడిన ముద్రించిన జీవిత చరిత్ర పంపబడింది. ఏనాడో మరాఠీ భాషలో ఇచ్చిన వారి ఉపన్యాసం క్యాసెట్టు వచ్చింది. వారు చిరకాలము క్రిందటే స్వర్గస్థులైరి. అయినను వారు స్థాపించిన ''జ్ఞాన ప్రబోధినీ'' కార్యకర్తలు ఈ మాత్రం శ్రద్ధ తీసుకుని పంపడం ముదావహం. ఔరంగాబాదుకు చెందిన శ్రీ మాధవ గజానన్ రాంగ్ణేకర్‌గారు బయోడేటాను, ఫోటోలను మాత్రమే పంపారు గాని క్యాసెట్టు పంపలేదు. చంద్రపూర్‌కి చెందిన శ్రీ దాదా దేశ్‌కర్‌జీ లిఖిత ప్రకటనను, ఫోటోలను పంపారుగాని, క్యాసెట్టు పంపలేదు. విచారించగా ఈ లోటుపాట్లకు కారణమేమని తేలిందంటే, ఆనాడు కీర్తి ప్రతిష్ఠల్ని ఆశించకుండా కర్తవ్యనిష్ఠతో చేసిన దైవీ కార్యానికి ఇన్నాళ్ళకి, ఇప్పుడు, మళ్ళీ కీర్తి ప్రతిష్ఠలకోసం ప్రాకులాడటం దేనికి? అన్నది. దానికి ఆర్ద్రహృదయంతో నేనిచ్చిన సమాధానమేమంటే అయ్యా! మీరు అంతటి ఉదాత్తంగా ఆలోచించే మహనీయులు కాబట్టే మీ జీవితాలు భావితరాలవారికి ఆదర్శం కావాలి అన్నది! దీనితో బాటు పరిశోధకులకు విషయ సేకరణలో ఎదురయ్యే చిక్కుల్ని గూర్చి తెలియజేయటానికి గూడ ఇదంతా వ్రాయవలసి వచ్చిందని మనవి.

# మూడవ విడత ప్రయత్నము

ఈసారి మళ్లీ పర్యటన పద్ధతికే పూనుకొన్నాను. మొదటి రెండు ప్రయత్నాలు ఆంధ్రా, కోస్తా జిల్లాల్లో పనిచేసిన వారిని గూర్చి మాత్రమే చేయబడినవి. ఇప్పుడు హైదరాబాద్, తెలంగాణా ప్రాంతాల్లో పనిచేసిన వారిని గూర్చి పరిశోధించడం జరిగింది. వీరిలో మొట్టమొదటి ప్రచారకులుగా ప్రఖ్యాతి వహించిన ఇద్దరు ముగ్గుర్ని గూర్చిన విషయ సేకరణ చాలా కష్టమైంది. ఆరు నెలలు ప్రయత్నించిన మీదటగాని వారి అడ్రసులు లభించినవి కావని చెప్పినచో అతిశయోక్తి లేదు. వారిలో తొలి ప్రచారక్ శ్రీ శ్రీధర్ కామత్‌గారు ఏనాడో స్వర్గస్థులైనారు. శ్రీ బాలా సాహెబ్ కాళే గారు అమెరికాలో ఉన్నారు. శ్రీ ఫాటక్‌జీ గాని, శ్రీ సద్భావూ కులకర్ణిగారు కాని యెక్కడున్నారో బొత్తిగా తెలియదు. వీరిని గూర్చి తెలిసికొనటానికి తొలుత శ్రీ హరిభావ్‌జీ వఝే గారిని ఆశ్రయించాను. వారు బెల్గాంలో ఉన్న శ్రీ పాండురంగనిఖార్గేను కలిసికొమ్మని చెప్పగా బెల్గాం వెళ్లి వారిని కలుసుకున్నాను. వారి ద్వారా శ్రీ గజానన్ శంకర్ సాఠేజీని దర్శించాను. వీరిద్దరి ద్వారా శ్రీధర్ కామత్ గారి కుటుంబాన్ని గురించిన అడ్రసు సంపాదించాను. ఆ కుటుంబం ప్రస్తుతం గోవా రాష్ట్రంలోని ''మాపుసా'' అనే పట్టణంలో ఉన్నది. అప్పుడు 1997 జూన్ 31 వతేదీనాడు మాపుసాకు వెళ్లాను. జులై 1 వతేదీన శ్రీ కామత్ గారి ధర్మపత్నిని, వారి పెద్ద కుమారుణ్ణి, చిన్న కూతుర్ని కలుసుకుని శ్రీ కామత్ గారి బయోడేటాను, ఫోటోలను, వారు మరణించటానికి కొద్ది నెలలు ముందుగా బొంబాయిలోని కాలేజీ విద్యార్థుల్ని గూర్చి సంబోధించుచూ చేసిన మరాఠీ భాషా ప్రసంగం క్యాసెట్టును సాధించగలిగాను. వారి యింట్లో ఆతిథ్యాన్ని స్వీకరించే అదృష్టం గూడా లభించింది.

పిమ్మట ''మాపుసా'' నుండి జూలై 1 వతేదీనాడు సాయంత్రం బస్సులో ప్రయాణించి 2 వతేదీనాటి ఉదయం పూనాకు చేరుకున్నాను. శ్రీ హరిభావ్‌జీ వఝే గారి సూచనను అనుసరించి శ్రీ వాసుదేవ దివేకర్‌జీ, శ్రీ ప్రభాకర్‌జీ నర్లేకర్ల ద్వారా శ్రీ బాలాసాహెబ్ కాళేజీని గూర్చి చాలా క్లుప్తంగా మాత్రమే కొన్ని విషయాలు సేకరింపగలిగాను. వారి ఫోటో ఒకటి, అమెరికా అడ్రసు కూడా సేకరించాను. తదుపరి 2 వతేదీన బస్సులో బయలుదేరి 3 వతేదీనాటి ఉదయం హైదరాబాదుకు చేరుకున్నాను.

# నాల్గవ విడత ప్రయత్నము

ఈ ప్రయత్నం 1997 ఆగస్టు 1 వతేదీనాడు ప్రారంభమైనది. భోపాలు, ఇందోరు పట్టణాలగుండా మళ్లీ ఖామ్‌గావ్ వెళ్లవలసి వచ్చినది. మొదటిసారి వెళ్లినప్పుడు శ్రీ యాద్వడ్కర్‌జీని దర్శించినట్లు ఉక్తపూర్వం. అక్కడే శ్రీ కమలాకర్ వ్యంకటేశ్ ఫైజుపూర్‌కర్ అను మరొక పాత ప్రచారక్ ఉన్నారు. వారు సంఘంపై మొదటి నిషేధానికి పూర్వం కాకినాడలో ప్రచారక్. అయితే వారు ఖామ్‌గావ్‌లో ఉంటారన్న సంగతి అప్పటికి నాకు తెలియదు. హైదరాబాద్‌కు తిరిగి వచ్చిన కొద్ది రోజులకు తెలిసింది. వెంటనే 1996 ఆగస్టులో ''ఆవశ్యక సామగ్రి'' పంపవలసిందిగా ప్రొఫార్మా పంపించాను. వారు వెంటనే తిరుగు జాబులో సెప్టెంబరు 30, 1996లోపల అందేటట్లు పంపుతానని వ్రాశారు. కాని 1997 జూలై చివరివరకు పంపలేదు. కారణం కీర్తి ప్రతిష్ఠల మీద అనాసక్తత. ఈ కారణంగా రెండవసారి వెళ్లవలసి వచ్చింది. వారి లిఖిత దస్తావేజు, ఫోటోలు తీసికొన్నాను. వారి గొంతు బొత్తిగా పూడుకునిపోయి మాట్లాడలేని స్థితిలో స్టేట్‌మెంట్ టేప్ చేయలేదు. రెండు రోజులు వారియింట ఆతిథ్యం పొంది సెలవు తీసికొన్నాను.

ఆగస్టు 4 వతేదీన అపరాహ్ణం బస్సులో పయనించి అక్కడికి దరిదాపు నూరు కిలోమీటర్లదూరంలో ఉన్న మూర్తజాపూర్ వెళ్లాను. అది శ్రీ యాద్వడ్కర్‌జీ, బందిష్టేల జన్మస్థానం. అక్కడ ఆర్.యమ్. ఛౌధురీ అనే పేరుగల ఒక పాత కార్యకర్త ఒకప్పుడున్నారు. 1941,42 సంవత్సరాల్లో విశాఖపట్టణంలో శాఖల ప్రారంభం కోసం శ్రీ యాద్వడ్కర్‌జీ మూర్తజాపూర్‌నుండి వారిని పిలిపించడం జరిగింది. ఆయన మూడు, నాల్గు నెలలుండి శాఖ పెట్టజాలక తిరిగి వెళ్ళిపోయాడు. విశాఖపట్టణంలో 1940 తరువాత అటువంటి ప్రయత్నాలు రెండుమూడు జరిగినయి. అయినా 1943 తరువాత గాని అక్కడ సరియైన శాఖ అంటూ ఏర్పడలేదు. ఆ ఛౌధురిని కలుసుకోవడానికి మూర్తజాపూర్ వెళ్ళాను. ఆయన్ని గూర్చి తెలిసిన యీ తరం వారెవ్వరూ అక్కడ లేకపోవడం వల్ల వృథా ప్రయాసే అయింది మరి!

ఆనాటి సాయంత్రం అక్కడినుండి సుమారు నూరు కిలోమీటర్ల దూరంలో ఉన్న విదర్భ ప్రాంతంలోని అమరావతీ పట్టణానికి వెళ్ళాను. నెల్లూరు జిల్లాలో ప్రచారక్‌గా పనిచేసిన శ్రీ నీలకంఠ మోరేశ్వర్ దేశపాండేజీని గూర్చి సమాచారం సేకరించటానికి వెళ్ళడం జరిగింది. వారి కుటుంబ సభ్యుల్ని, వారి ధర్మపత్ని శ్రీమతి సులోచనా బాయిగారిని, కుమారుల్లో పెద్దవాడైన శ్రీ సంజయ్ దేశపాండేను, ఏకైక పుత్రిక కుమారి

వసుంధరను పరామర్శించి, వారి యింట ఆతిథ్యాన్ని పొంది, శ్రీ దేశపాండే గారి సరియైన బయోడేటాను సంపాదించగల్గితిని. వారు ఏనాడో కీర్తి శేషులు.

ఆగస్టు 6 వతేదీనాడు మధ్యాహ్నం అమరావతి నుండి బస్సులో ప్రయాణించి సుమారు 150 కిలోమీటర్ల దూరంలో ఉన్న నాగపూర్‌కి చేరుకొంటిని. ఆగస్టు 7 వతేదీనాడు పట్టణమంతా తిరిగి ఏనాడో విజయనగరం విశాఖపట్టణాల్లో పనిచేసిన శ్రీ నాగనాధ్ కాళేను, 1954 బందరు శిక్షావర్గలో ముఖ్య శిక్షక్‌గా వ్యవహరించిన, ప్రస్తుతం విదర్భ సహసంఘ చాలక్‌గా పనిచేయుచున్న శ్రీ వినాయక్‌జీ ఫాటక్‌ను దర్శించి వారి బయోడేటాను ఫోటోలను సేకరించాను. ఒకప్పుడు విజయవాడలో కొద్దికాలం పనిచేసి కాలాంతరంలో ఏనాడో స్వర్గస్థులైన శ్రీ అనంతశీర్షికర్‌జీ యొక్క ఇర్వురు కొడుకులను కలిసికొని దిజ్మాత్రంగా వారి బయోడేటాను, ఫోటోలను సమకూర్చుకొనడం జరిగింది. బెంగాలులో ప్రచారక్‌గా పనిచేసిన శ్రీ భాస్కర్‌జీ కేదార్‌ను దర్శించి బెజవాడలో స్టూడెంటు ప్రచారక్‌గా పనిచేసిన వారి తమ్ముడు శ్రీ దినకర్ రావ్‌జీ కేదార్ యొక్క అడ్రసు తెలిసికొనడం జరిగింది. శ్రీ సహస్రభోజిని, శ్రీనారాయణరావ్ భట్వాడేకర్, శ్రీ నరహరి బాలాజీ పార్థీ కుటుంబ సభ్యుల్ని మళ్లీ ఒకసారి చూసి వారితో కాలక్షేపం చేసిన ఆనందం పొందగలిగితిని. విదర్భనుండి, తత్రాపి నాగపూర్‌నుండి ఎందరెందరో మహనీయులు ప్రచారకులుగా వెళ్లి దేశంలో పలుతావుల్లో పనిచేసి వృద్ధాప్యంలో ఇంటికి తిరిగివచ్చినవారు - ప్రతి యింటికీ ఒకరన్నట్లు కోకొల్లలుగా నున్నారు. ఆంధ్రలో పనిచేసిన అజ్ఞాతులు అనుక్తులు ఇంకెందరున్నారో గదా అని యనిపించి ఉత్సాహంతో ఎద పొంగిపోతుందనడంలో సందేహం లేదు.

ఆగస్టు8 వతేదీనాటి ఉదయం 10 గంటలకు నాగపూర్ నుండి బస్సులో బయలుదేరి సుమారు 1 గంట ప్రాంతాన యవత్‌మాల్ జిల్లాలోని 'వణీ' పట్టణానికి చేరుకున్నాను. అది స్వర్గీయ శ్రీ గోపాల్‌రావ్ ఠాకూర్‌జీ జన్మస్థానం. వారి బయోడేటాను సంపాదించడం ఇక్కడి రాకకు ప్రధానోద్దేశ్యం. దానితోపాటు బెజవాడలో స్టూడెంట్ ప్రచారక్‌గా వ్యవహరించిన శ్రీ దినకర్ రావుజీ కేదార్‌ను దర్శించడం కూడా ప్రధానోద్దేశ్యమే. ఇప్పుడు వారు అడ్వకేటు. పూర్తిగా ఒకరోజు వారియింట మకాం వేసి, ఆతిథ్యాన్ని ఆస్వాదించి వారి ఫోటోలను, టేపు చేసిన స్టేటుమెంటును తీసుకొనడం జరిగింది. వారు వ్రాయలేని స్థితిలో నున్నందువల్ల లిఖిత ప్రకటనను పొందలేక పోతిని. శ్రీ ఠాకూర్జీ యొక్క జననాభిజన విద్యాభ్యాసాదిక విషయాల్ని గూర్చి పై పరామరికగా కొంత రాబట్టగలిగితిని. ఆ మేరకు 'వణీ' పర్యటన సఫలమైనట్లు చెప్పవచ్చు.

9 వతేదీ ఉదయం 8 గంటలకు బస్సులో వణీ నుండి ప్రయాణించి మధ్యాహ్నం 12 గంటలకు చంద్రపూర్ చేరుకున్నాను. ''అక్కడ ఆంధ్రలో పనిచేసిన 'ఫలానా' ప్రచారక్ ఉన్నారు, వారిని కలుసుకొనండి'' అని నాగపూర్‌లో ఒకరు చెప్పగా, మరొక పేరు మన లిస్టులోకి ఎక్కిందిగదా అన్న ఉత్సాహం కొద్దీ అక్కడకు వెళ్లడం జరిగింది. ఆ 'ఫలానా' ప్రచారకుని కలుసుకున్నాను. (వారి పేరు తరువాత మరచిపోయాను) వారు ప్రచారకుగా పనిచేసినమాట వాస్తవమే గాని అది ఆంధ్రలో కాదు, బెంగాల్లో పనిచేయడం జరిగింది. చప్పున నిరుత్సాహపడ్డాను. వెళ్ళినవాణ్ణి అక్కడి వాస్తవ్యుడే అయిన శ్రీ దాదాజీ దేశ్‌కర్‌ని కలుసుకొనవచ్చుగదా అని భావించాను. కాని ఆ క్రితంరోజే ఆయన వార్ధాకు వెళ్లడం జరిగింది. రెండురోజులకుగాని తిరిగి రారు అని తెలిసింది. నిరుత్సాహపడ్డాను. ఇంతలో ఒక కబురు వచ్చింది. చంద్రపూర్ పట్టణంలోని వివిధ పరివార క్షేత్రాల కార్యకర్తల సమావేశం ఒకటి అక్కడ జరుగుతున్నది. దాదాపు 25 మంది కార్యకర్తల సమావేశమది. స్థానిక కార్యకర్తలు నన్ను అక్కడికి తీసుకుని వెళ్ళారు. వారికి నన్ను పరిచయం చేశారు. ఆ కార్యకర్తల కోరికపై ప్రస్తుతం నేను తలపెట్టిన ఈ పుస్తకరచనా ప్రయత్నాన్ని గూర్చి ఇరవై నిమిషాలపాటు హిందీలో చిన్న ప్రసంగం చేశాను. ఈ జరుగుతున్న పని విషయమై అందరూ ప్రశంసల వర్షం కురిపించారు. దేశంలో ప్రతి ప్రాంతంలోను ఇది జరుగవలసిన పని అని ముక్తకంఠంతో వ్యక్తం చేశారు. ఎవరికైనా ప్రశంస ఉత్సాహజనకం కదా! అక్కడినుండి ఆ సాయంత్రం బస్సులో బయలుదేరి అంచెలంచెలుగా బస్సులు మారి ఆగస్టు 10 వతేదీ ఉదయం హైదరాబాద్‌కు చేరుకున్నాను.

## అయిదవ విడత ప్రయత్నము

ఈ ప్రయత్నము ఎంత సులభమో అంత కష్టము. లేదా ఎంత కష్టమో అంత సులభము. ఇందు తొలుత పేర్కొనవలసిన మహితాత్ములు సంఘటనా శాస్త్రవేత్తలు, కర్మయోగులు, బహుగ్రంథ కర్తలు, శ్రీ బాబాసాహెబ్ ఆప్టే స్మారక సమితి, ఇతిహాస సంకలన యోజనకు దక్షిణ భారతావనిలో మూలస్తంభమైన వారూ పూజ్యులు శ్రీ శ్రీరామ్ శ్రీపాద సాఠేజీ అనువారలు. వీరు ప్రస్తుతము హైదరాబాద్ బర్కత్‌పురా కార్యాలయంలో వృద్ధాప్యంలో కూడ నిత్యకర్మశీలిగా నివసిస్తున్న విషయం జగద్విదితం. 1997 జూలై 10 వ తేదీనాడు వారి వక్తవ్యాన్ని క్యాసెట్టుగా రూపొందించడం జరిగింది. వారి ఫోటోలు సులభ సాధ్యములే. పిమ్మట పేర్కొనవలసిన మహనీయులు మాననీయ శ్రీ గణపతిరావ్‌జీ బ్రహ్మపూర్‌కర్. వీరు హైదరాబాద్ నగర వాస్తవ్యులు. ''నగర స్వయంసేవకులందరికి తలలోని నాల్క'' అని

వర్ణింపదగినవారు. వారి వక్తవ్యాన్ని ఫోటోలను సంపాదించుట జరిగింది. ఆ వరుసలో శ్రీ సాప్రేకర్‌జీ, శ్రీ అశోక్ బోధన్‌కర్, శ్రీ శ్యాంపరాండే ప్రభృతులను గూర్చిన సమాచారాన్ని మరికొంత ప్రోది చేయవలసి ఉన్నది. ఒకప్పుడు హైదరాబాద్ నగరంలో సంఘ కార్యవిస్తరణకు కృషి చేసి మన యదృష్టముకొలది దీర్ఘాయుష్మంతులై ప్రస్తుతం ఔరంగాబాదులో నివసిస్తున్న శ్రీ అభ్యంకర్‌జీని గూర్చియు, అట్లే ఒకనాటి హైదరాబాదు నగర కార్యకర్తగా ప్రఖ్యాతి వహించి మరాత్వాడాలోని ఔరంగాబాద్, నాందేడ్, పర్భిణీ జిల్లాలతో కూడిన సంఘ విభాగ్‌కు ప్రచారక్‌గా పనిచేసి నిండు యౌవనంలో అకాల మరణానికి గురియైన శ్రీ దత్తాజీ ఫాలేను గూర్చియు మరికొన్ని వివరములు సేకరింపవలసియున్నది.

శ్రీ నానాజీ భాగవత్ మరొక మహనీయుడు. ప్రారంభ ధశలో 1945, 46 ప్రాంతంలో బెజవాడలో కొన్ని నెలలు మాత్రం విస్తారక్‌గా పనిచేసిన పిమ్మట చిరకాలం ప్రచారక్‌గా పనిచేసి దరిమిలా విశ్వహిందూపరిషత్తుకు బదిలీయై ఇప్పుడు పెద్ద బాధ్యతను నిర్వహిస్తూ ఢిల్లీలో ఉన్నారు. మిక్కిలి వయోవృద్ధులు. శ్రీ వసంత్ పురోహిత్ (పురాణిక్) మరొకరు. పూనావైపునుండి వచ్చి ఆంధ్రా యూనివర్సిటీలో చదువుకుంటూ యూనివర్శిటీ శాఖను పర్యవేక్షిస్తూ స్టూడెంటు ప్రచారక్‌గా పేరుపొందారు. శ్రీ కాకోడ్కర్ గారు ఇంకొకరు. పూనా, బొంబాయి ప్రాంతం నుండి వచ్చి కొన్ని నెలలు నెల్లూరు జిల్లా గూడూరులో పని చేశారు. హైదరాబాదులో శ్రీధర కామత్, బాలాసాహెబ్ కాళేల కార్య కాలంలో వారి కనుసన్నల్లో మెలగుతూ పనిచేసిన శ్రీ గజానన్ శంకర్ సాఠే, శ్రీ సద్భావూ కులకర్ణి, హైదరాబాదులోను గుల్బర్గాలోను పనిచేసిన విష్ణు ఫాటక్‌జీ, ఆంధ్రలో విస్తారక్‌గా పనిచేసి ప్రస్తుతం బొంబాయిలో ఎక్కడో నివసిస్తున్న శ్రీ సానేజీ ప్రభృతుల సేవలు చిరస్మరణీయాలు.

మాననీయ శ్రీ దాదారావ్‌జీ పరమార్థే, మాననీయ శ్రీ యాదవరావ్‌జీ జోషీల విషయం గూడ ఇక్కడ ప్రసక్తం కాగలదు. ఆంధ్ర ప్రాంతంలోను, హైదరాబాద్, తెలంగాణా ప్రాంతంలోను, సంఘశాఖలు ప్రారంభమై విస్తరణ దశలోనున్నప్పుడు మార్గదర్శకత్వం వహించిన మహనీయులు వారు. 1938 నుండి అవిభక్త మద్రాసు రాష్ట్రానికి ప్రాంత ప్రచారకులుగా నుండిన శ్రీ పరమార్థేజీ 1940లో ఆంధ్రలో సంఘకార్యాన్ని ప్రారంభించిన తర్వాత 1942 వరకూ గూడ మార్గదర్శకులుగా నున్నారు. అట్లాగే శ్రీ యాదవరావ్ జోషీ, బెల్గాం కేంద్రంగా కర్ణాటక, అవిభక్త హైదరాబాదు

రాష్ట్రాలకు ప్రాంతప్రచారక్‌గా నుండి శ్రీ శ్రీధర్ కామత్, శ్రీ బాలాసాహెబ్ కాళేల కాలంలో అక్కడి సంఘకార్య విస్తరణలో మార్గదర్శత్వం నెరపిన మహనీయులు. దరిమిలా వీరిర్వురూ అఖిల భారత నాయకులై స్ఫూర్తిని ప్రసాదించినారనుట జగద్విదితం.

''ఆంధ్ర ప్రదేశ్ లోఆర్.యస్.యస్ '' అన్న యీ గ్రంథం సర్వసమగ్రమైనది కాదు. ఇందులో సంఘకార్య ప్రారంభానికి, విస్తరణ కార్యానికీ, అన్యప్రాంతాలనుండి వచ్చిన ప్రచారకులకు, విస్తారకులకు సంబంధించిన విషయాలు మాత్రమే పొందుపరచుచ బడినవిగాని, స్థానికులైన వ్యక్తులను గూర్చి కాదు. సదరు ప్రచారకులు తమతమ రికార్డు చేయబడిన క్యాసెట్టులలోగాని, లిఖిత దస్తావేజులలోగాని యెవరెవరి పేర్లను పేర్కొనిరో అవి మాత్రమే యిందు చేర్చబడినవిగాని ఉన్నవి తీసివేయుటగాని, లేనివి చేర్చుట గాని జరుగలేదు. ఒకవేళ ఏ ఒకటి రెండు పేర్లను పేర్కొన్నట్లయినచో అక్కడ ఆ పేర్ల యొక్క ఆవశ్యకతను పాఠకులు గుర్తించగలరు. వారు విస్తృతంగా ఎన్నో విషయాలు సెలవిచ్చారు. మన రచనా ప్రణాలికననుసరించి అవసరమైనంత వరకే యిందు చేర్చబడినవిగాని అవన్నీ కాదు. కొందర్ని గూర్చి విస్తారంగాను, కొందర్ని గూర్చి సుమారుగాను, మరికొందర్ని గూర్చి కొంచెంగాను, ఇంకా కొందర్ని గూర్చి నామమాత్రంగాను వ్రాయడం జరిగింది. అది ఆయా వ్యక్తుల స్థాయీ భేదాన్ని బట్టి, వారు ఇక్కడ పనిచేసిన కాలపరిధిని బట్టి లభించిన సమాచారం యొక్క హెచ్చుతగ్గులను బట్టి, మన రచనా ప్రణాళికయొక్క ఆనుకూల్యతనుబట్టి అట్లా వ్రాయడం జరిగింది. కాలక్రమంలో అంచెలంచెలుగా సాధ్యమైనంత సమగ్ర చరిత్రను తీసుకుని రావాలన్న సంకల్పం ఉన్నది. సంఘ చరిత్ర నిత్య ప్రవాహిని. అందువల్ల ఆ ప్రయత్నాలు తప్పక జరగాలి. ఇది ఒక విధంగా ఆంధ్రప్రదేశ్‌కి సంబంధించినంతవరకు 20 వశతాబ్దపు సంఘ చరిత్ర అని భావించవచ్చు. అది కూడా మరికొన్ని భాగాలు వస్తేనే సమగ్రమవుతుంది.

విషయ సరణి, హేతు సరణి, కాలసరణి, దేశసరణి - అన్నవి చరిత్ర గ్రంథరచనలో అసలు ఏగ్రంథ రచనలోనైనా పాటించవలసిన ప్రధానాంశాలు. ఒక రచయిత స్వీకరించిన వస్తువునుబట్టి, రచనా ప్రణాళికనుబట్టి, వాటిలో తరతమ భేదాలుండడం సహజం. ఈ పుస్తకంలో ఈ నాల్గింటినీ సాధ్యమైనంతవరకు సమన్వయాత్మకముగా పొందికపరచే ప్రయత్నం జరిగింది. పాఠకులు సూక్ష్మేక్షికతో పరిశీలించగలరని మనవి. ఇందలి భాష సరళ వ్యావహారికం. మిత్రుల సూచనమేరకు, కోరికమేరకు ఈ మార్గం త్రొక్కడం జరిగింది. ''శ్రీ బాబాసాహెబ్ ఆప్టే స్మారక సమితి - ఇతిహాస సంకలన యోజన'' కు

ఒక ప్రత్యేకమైన రచనా పద్ధతి ఉన్నది. ఆ పద్ధతిలో లోగడ నేను రెండు గ్రంథాలు వ్రాశాను. ఈ గ్రంథములో గూడా స్థూలంగా అదే పద్ధతి పాటింపబడినది.

ఈ చరిత్రను సంతరించి ఒక పుస్తకం వ్రాయాలనే సంకల్పం కలిగినప్పుడు మాననీయ శ్రీ మోరోపంతు పింగళేజీని బొంబాయిలో సందర్శించిన సందర్భంలో సూచన ప్రాయంగా మనవి చేశాను. వారు విని ఊరుకొన్నారు. ఆ మౌనమే పూర్ణాంగీకారంగా నాకు స్ఫూర్తిని ప్రసాదించింది. ఇప్పుడీ పుస్తకానికి పీఠిక రూపంలో తమ ఆశీస్సులనం దించినందుకు వారికి కృతజ్ఞతలు సమర్పించుకుంటున్నాను. వ్రాతప్రతిని పరిశీలించిన మాననీయ శ్రీ చిలుకూరి సుబ్రహ్మణ్య శాస్త్రిగారికి, ప్రచురణ కార్యాన్ని చేపట్టిన జాగృతి సంపాదకులు శ్రీ వడ్లమూడి రామమోహనరావుగారికి, సహకరించిన యితర రసహృదయులకు ధన్యవాదములు తెలియజేస్తున్నాను. పుస్తకం మీ చేతుల్లో ఉంది.

సెలవు.

-డా. ఓగేటి అచ్యుతరామ శాస్త్రి

# దక్షిణ భారతంలో సంఘకార్య ప్రారంభం
## శ్రీ దాదారావ్ పరమార్థే



పరమపూజనీయ శ్రీ డాక్టర్ కేశవరావ్‌జీ బలిరామ్ హెడ్గేవార్ నాగపూర్‌లో 1925 లో విజయదశమినాడు రాష్ట్రీయ స్వయం సేవక సంఘాన్ని స్థాపించారు. హిందూ సంఘటన ద్వారా మన మాతృవర్షం మళ్లీ తన పురాగౌరవాన్ని, పరమ వైభవాన్ని సంతరించుకొని, జగద్గురు స్థానాన్ని ఆక్రమించుకొని సర్వోత్కర్షలతో వర్థిల్లేటట్లు చేయడమే యీ సంస్థయొక్క పరమ లక్ష్యం. అందుకొరకు దైనందిన శాఖా పద్ధతిని కనిపెట్టి, దానికనుగుణమగు కార్యపద్ధతిని సూచించి ఒక అపూర్వమైన అద్భుతాన్ని సృష్టించారు డాక్టర్‌జీ. 1940 జూన్‌లో వారు మరణించేనాటికి ఈ పదిహేను సంవత్సరాలకాలఖండంలో అహోరాత్రాలు పరిశ్రమించి, దాదాపు దేశమంతటా సంఘశాఖల్ని సాక్షాత్కారింపజేశారు. శ్రీ బాబాసాహెబ్‌జీ ఆప్టే, శ్రీ భయ్యాజీ దాణే, శ్రీ మాధవరావ్‌జీ మూలే, శ్రీ ఏకనాథ్‌జీ రానడే, శ్రీ గురూజీ గోల్వల్కర్, శ్రీ అప్పాజీ జోషి, శ్రీ బాలాసాహెబ్‌జీ దేవరస్, శ్రీ యాదవరావ్‌జీ జోషి, శ్రీ దాదారావ్‌జీ పరమార్థ్ మొదలైన దేవ పురుషులవంటి కార్యకర్తల్ని సృష్టించి హిందూ పునరుజ్జీవన స్వర్ణయుగానికి ఒక ఘంటాపథాన్ని నిర్మించారు.

దక్షిణ హిందూ దేశంలో ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో సంఘకార్యాన్ని ప్రారంభించటానికి విచ్చేసిన మహానుభావుడు శ్రీ దాదారావ్‌జీ పరమార్థ్, ఆనాటి మద్రాసు ప్రాంతమంటే యిప్పటి తమిళనాడు కేరళలు, కర్ణాటక, ఆంధ్రప్రదేశ్‌లోని కొన్ని జిల్లాలు కలిసి ఉండిన ప్రాంతం. దానికి మద్రాసు (చెన్నై) రాజధానీ నగరం. అది పలుభాషల కూడలి. అక్కడ తొలుత సంఘశాఖ ప్రారంభింపబడి క్రమక్రమంగా తమిళనాడులో విస్తరించింది. దేశంలో ఏ ప్రాంతంలోనైనా సంఘకార్యం ప్రారంభించాలన్న ఆలోచన వచ్చినప్పుడు డాక్టర్‌జీ మనస్సులో ఇద్దరు మహనీయులు మెదిలేవారు. ఒకరు ఆప్టేజీ,

మరొకరు దాదారావ్‌జీ పరమార్ధ్. శ్రీ దాదారావ్‌జీ తొలి ప్రచారకుల బృందంలో ఒకరు. 'ప్రచారక్' అన్న మాటకి పరమార్ధాన్ని, ప్రసిద్ధిని సంతరించిపెట్టిన మహనీయుడు. 1925లో సంఘం స్థాపించబడింది. దాదాపు అప్పటినుండి 1932 వరకు శ్రీ డ్యాక్టర్‌జీకి సన్నిహితులుగా మెలుగుతూ, చురుకైన సాధారణ స్వయంసేవకుగా మసలిన వ్యక్తి. 1932నుండి యిల్లు వదలి సంఘకార్య విస్తరణకు బయలుదేరి మహారాష్ట్ర, గుజరాత్, పంజాబ్, ఢిల్లీ, ఉత్తరప్రదేశ్ మొదలైన చోట్ల పర్యటించి కొంత సంఘవాతావరణాన్ని ప్రోదిచేసిన కార్యకర్త. దరిమిలా డ్యాక్టర్జీ నిర్దేశం మేరకు 1938లో మద్రాసు చేరుకొని సంఘకార్యానికి శ్రీకారం చుట్టిన ఘనులు

శ్రీ దాదారావ్‌జీ అసలుపేరు గోవింద సీతారాం పరమార్ధ్. వారు 1904లో నాగపూర్‌లోని 'ఇత్వారీవాడ'లో జన్మించారు. తండ్రిగారి పేరు సీతారాం రఘుపతి పరమార్ధ్. తల్లి పేరు శ్రీమతి జానకీబాయ్ పరమార్ధ్. తండ్రి పోస్ట్ అండ్ టెలిగ్రాఫ్ ఆఫీసులో పనిచేసి ఉద్యోగ విరమణ చేశారు. వారూ శ్రీ డ్యాక్టర్‌జీ చిరకాలంగా పరస్పరం పరిచితులు. ఆ పరిచయం వల్ల లభించిన చనువుతోనే డ్యాక్టర్జీ శ్రీ పరమార్ధ్‌ను సంఘం వైపుకు ఆకర్షించారు. శ్రీ దాదారావ్‌జీ మెట్రిక్‌వరకు చదివారే గాని ఉత్తీర్ణులు కాలేదు. కారణం హృదయం హిందూ జాతీయ విప్లవ భావాలతో నిండి చదువుపై అంతగా ఆసక్తి లేకపోవడమే. అయితే ఆంగ్ల భాషలో అనర్గళంగా ఉపన్యసించగల దిట్ట. ఆ ప్రతిభతోనే మద్రాస్, తమిళనాడు ప్రజల్ని మంత్ర ముగ్ధుల్ని చేసి, సంఘంవైపు ఆకర్షించి, కార్యవిస్తరణకు కృషి చేయగలిగారు.

శ్రీ పరమార్ధ్‌జీ సంఘకార్యాన్ని గూర్చి, సిద్ధాంతాన్ని గూర్చి సూత్రప్రాయంగా చెప్పిన విషయాలు చాలా స్ఫూర్తిదాయకంగా ఉంటాయి. ''నాగపూర్‌నుండి సంఘ మొక్కను తీసుకుని వెళ్లి దేశంలోని వివిధ ప్రాంతాలలో నాటడమే నా ధ్యేయం'' '' సంఘస్థాన్ అంటేనే హిందుస్థాన్. సంపూర్ణ హిందుస్థాన్ సంఘస్థాన్'' ''సంఘటన అనేది సంఘటన కొరకే, ఎవరినీ తిరస్కరించటం గానీ, చిన్న చూపు చూడడం కానీ కాదు'' ''స్వామిభక్తిగల కుక్కవలె నేను డ్యాక్టర్జీని అనుసరించాను'' ''ఇది గతంలో హిందూ రాష్ట్రం, ఇప్పుడు హిందూ రాష్ట్రం, భవిష్యత్తులో కూడా హిందూరాష్ట్రమే'' ''ఈ దేశంలో ఒక్క హిందువు మిగిలినప్పటికీ యిది హిందూరాష్ట్రంగానే ఉంటుంది.'' ''నీకు ఏమిచేయాలి అనేద్రి తెలిస్తే ఎలా చేయాలి అనేది నీకే తెలుస్తుంది''''పనిచెయ్యాలని కోరిక ఉంటే పని

చేయగలుగుతావు. పని చెయ్యగలిగితే చేసి తీరాలి'' '' సంఘంలో ఎంతమంది ఉన్నారు అన్నది అసలు ప్రశ్నగాదు. సంఘం ఎంతమందిలో ఉన్నది అనేదే అసలు ప్రశ్న. ''సంఘం అనేది ఆరుబయట విశ్వవిద్యాలయం, ఇక్కడ జాతీయ విద్య నేర్పుతారు.'' ఇత్యాది.

శ్రీ పరమార్థ్ జీవించింది 60 సంవత్సరాలు మాత్రమే. 1963లో పంజాబ్ ప్రాంత స్వయంసేవకులకు సోనేపట్‌లో జరిగిన సంఘశిక్షావర్గలో పాల్గొని తిరిగివస్తూ అలసటవల్ల కలిగిన అనారోగ్య కారణంగా ఢిల్లీ కార్యాలయంలో ఉండిపోయారు. జ్వరం వచ్చి, తట్టుకోలేక 1963 జూన్ 27వ తేదీనాడు కీర్తిశేషులైనారు.

శ్రీ దాదారావ్‌జీ యే కారణంవల్లనోగాని తానుగా ఆంధ్రప్రాంతంలో సంఘకార్యాన్ని ప్రారంభించలేదు. మద్రాసు, తమిళనాడుల్లో 1938నుండే శాఖలు ప్రారంభమైనవి. ఆ పిమ్మట రెండేళ్ళకు 1940లో ఆంధ్రలో ప్రారంభమైనవి. బహుశా ఈ మధ్యగల రెండేళ్ళ వ్యవధిలో ఆంధ్రపై దృష్టి సారించుటకు వీలులేకపోయి ఉండవచ్చు. 1940లో ఆంధ్రలో ప్రారంభమైన తరువాత రెండుమూడు సార్లు ఆంధ్రకు రావటం, ఇక్కడివాళ్ళకు మార్గదర్శనం ఇవ్వడం జరిగింది. ఈ సంబంధంగా ఒక విశ్లేషణాత్మకమైన అవగాహనకొరకు శ్రీ దాదారావ్‌జీ పరమార్థ్‌ను గూర్చిగూడ ఇలా దిజ్మాత్రంగా ఉల్లేఖించడం జరిగింది.

## ఆంధ్రలో తొలి సంఘశాఖ

పరమపూజనీయ శ్రీ డాక్టర్జీ 1925లో విజయదశమినాడు నాగపూర్‌లో రా. స్వ. సేవక సంఘాన్ని స్థాపించినట్లు పూర్వోక్తం. అయితే ''రాష్ట్రీయ స్వయంసేవక సంఘ్'' అన్నపేరు మాత్రం 1926 ఏప్రిల్ 17నాడు అమలులోకి వచ్చింది. 1928లో మొట్టమొదటి గురుదక్షిణ నిర్వహించబడింది. మొట్టమొదటి సంఘ శిక్షావర్గ 1927లో జరుపబడింది. సంఘ కార్యకర్తల కోరకపై డాక్టర్ హెడ్గేవార్‌జీ ''సర్ సంఘచాలక్'' బాధ్యతను 1929లో స్వీకరించారు. 1930 జూలై 21 నాడు ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్న డాక్టర్జీకి 9 నెలల కారాగార శిక్ష విధింపబడింది. 1932లో ప్రచారక వ్యవస్థ రూపుదిద్దుకొన్నది. 1934లో ఇప్పటి రేషింబాగ్ కేంద్ర సంఘస్థాన్ మైదానాన్ని డాక్టర్జీ కొనుగోలు చేశారు. 1939 ఉత్తరార్థంలో సంస్కృతంలో నూతన ప్రార్థన రూపొందించబడినది. అప్పటి వరకు ఆంగ్ల భాషలో ఉన్న సంజ్ఞలకు, ఆజ్ఞలకు సంస్కృత పదాలు రూపొందింపబడినాయి. 1940 మే నెలలో డాక్టర్జీ ఆరోగ్యం శిథిలమై మరణశయ్యమీద ఉన్నారు. జూన్ 21వతేదీ ఉదయం

9-27 ని.లకు తుదిశ్వాస విడిచారు. శ్రీ గురూజీ గోల్వల్కర్ సర్ సంఘచాలక్ బాధ్యతన స్వీకరించారు.

డాక్టర్జీ జీవించి ఉండగానే 1940 నాటికి ఉత్తర భారతంలోనేగాక దక్షిణ భారతంలో తమిళనాడు, కేరళ, కర్ణాటక ప్రాంతాల్లోగూడ - సంఘ విస్తరణ కార్యక్రమం ప్రారంభమైనది. ఇక ఆంధ్రప్రాంతమే తరువాయి. 1940 మేలో సంఘశిక్షావర్గ పూర్తి అయింది. అప్పుడే తృతీయ వర్ష శిక్షావర్గను పూర్తిచేసిన శ్రీ దత్తాత్రేయ యాద్వడ్కర్‌జీపంతును పిలిపించి బెజవాడకు వెళ్ళి అక్కడ శాఖలు నెలకొల్పాలని ఆదేశించారు డాక్టర్జీ.

డాక్టర్‌జీయొక్క ఆజ్ఞను శిరసావహించి శ్రీ యాద్వడ్కర్‌జీ, వెంటనే శ్రీ దత్తాత్రేయ దండోపంతు బందిష్టే స్వగ్రామమైన హిర్‌పూర్‌కి వెళ్ళారు. హిర్‌పూర్ మూర్తజాపూర్‌కి దాపుననే ఉన్న ఒక కుగ్రామం. శ్రీ యాద్వడ్కర్‌జీ అక్కడికి వెళ్ళి బందిష్టేజీ తల్లిగారిత సంప్రదించి ఆతడు తనతోపాటు బెజవాడకు వచ్చి కాలేజీలో చదువుతూ తనక సంఘపనిలో సహాయపడుతూ ఉండే విధంగా ఒక పథకాన్ని ముందుంచారు. కాలేజీ ఫీజులు, పుస్తకాలు వగైరా ఖర్చులకు వారి తల్లిగారు డబ్బు పంపేటట్లు, తక్కిన ఖర్చుల యాద్వడ్కర్‌జీ చూసుకుండేటట్లు కూడా ఒక ఒప్పందం కుదిరింది. వాస్తవాని ఆంధ్రలో సంఘపని చేయడానికి యాద్వడ్కర్‌జీ ఒక్కరే పంపబడ్డారు. బందిష్టేజీ వారి సహాయకుడుగా అధికారికంగా పంపబడిన వ్యక్తికాదు. అందువల్ల నాగపూర్‌నుండి ఆర్థి సహాయం ఒక్క యాద్వడ్కర్‌జీకే వస్తుంది గాని బందిష్టేజీకి రాదు. ఈ దృష్టితో ఈ పథకం రూపొందించుకొనడం జరిగింది.

ఆ వెంటనే గురుశిష్యులిద్దరూ ముందుగా నాగపూర్ వెళ్ళి శ్రీ గురూజీని దర్శించారు అప్పుడు గురూజీ సర్ కార్యవాహ్‌గా ఉన్నారు. యాద్వడ్కర్‌జీ బందిష్టేజీని శ్రీ గురూజీ పరిచయం చేశారు. డాక్టర్జీ పరిస్థితి అప్పటికి ప్రమాదకరంగా ఉన్నది. ఆప ముంచుకొస్తున్న పరిస్థితి. అందువల్ల అప్పుడు డాక్టర్జీని దర్శించే భాగ్యం వారికి కలుగలేదు శ్రీ గురూజీని మాత్రమే దర్శించి వారియొద్ద సెలవు తీసుకుని యిద్దరూ బెజవాడక బయలుదేరారు. సరిగ్గా 1940 జూన్ 20 వతేదీన నాగపూర్‌నుండి గ్రాండ్ ట్రంక్ ఎక్స్‌ప్రెస్‌లో ప్రయాణం చేసి 21 నాడు బెజవాడకు చేరుకున్నారు. సరిగా వారు బెజవాడక చేరుకున్న సమయంలోనే నాగపూర్‌లో శ్రీ డాక్టర్జీ అంతిమ శ్వాస విడిచారు.

బెజవాడలో జి.వి.రాజారావు అనే ఒక అడ్వకేటు ఉండేవారు. వారు నాగపూర్‌లో

న్యాయశాస్త్రం చదివి పట్టభద్రుడైన వ్యక్తి. ఆయన నాగపూర్‌లో ఉండగా స్వయంసేవక్. నాగపూర్‌లోని సంఘ అధికారులు ఆయన పేరిట వారికొక పరిచయపత్రాన్ని ఇచ్చి పంపారు. ఇంతేగాక ఒకరిద్దరికి కూడా పరిచయపత్రాలు పంపారు. వారు తగినంత ప్రోత్సాహం ఇవ్వలేదు సరికదా నిరుత్సాహపరిచారు కూడా.

కాని ఆ రాజారావుగారు ఇంట్లోనేగాదు, ఊళ్లోనే లేరు. వీరిద్దరూ వారి తండ్రిగారిని కలిశారు. వారు తమ ఇంటిలో వారికొక గదిని కేటాయించారు. ఆ యిద్దరూ అందులో ఉంటూ భోజనం మాత్రం హోటల్లో చేస్తూ ఉండేవాళ్ళు. యాద్వడ్కర్‌జీ బందిష్టేను వెంటబెట్టుకొని యస్.ఆర్.ఆర్ కాలేజీకి వెళ్లి ప్రిన్సిపాల్ శ్రీ పుట్టపర్తి శ్రీనివాసాచారి గారిని కలిసి, మాట్లాడి కాలేజీలో చేర్పించారు. కాలేజీలో చదవడంతో పాటు సంఘపని చేయడం తమ ధ్యేయమని కూడా అప్పుడే వారికి చెప్పారు. అది మొదలుకొని శ్రీనివాసాచారిగారికి సంఘంతో ఆత్మీయతానుబంధాలు ఏర్పడ్డాయి.

పరమ పూజనీయ డాక్టర్జీ స్వర్గస్థులైనట్లు వార్త విజయవాడకు అందింది. యాద్వడ్కర్‌జీ నాగపూర్ వెళ్లడం జరిగింది. బందిష్టే మాత్రం ఒంటరిగా బెజవాడలోనే ఉండిపోయారు.

ఇంతలో రాజారావుగారు తిరిగివచ్చారు. బందిష్టేజీకి ఒక గదిని అద్దెకు వెతికి పెట్టి తన యింటినుండి ఖాళీ చేయించారు. ఆ గదిలో ఉంటూ వంట జేసుకుంటూ, అప్పుడప్పుడూ హోటల్లో భోజనం చేస్తూ కాలేజీకి వెళ్తూ కాలం గడుపుతున్నారు బందిష్టేజీ. సంఘపని యింకా ప్రారంభం కాలేదు. ప్రారంభించటానికి తొలుత కా: కష్టంగానే ఉండేది. తనకు తెలుగురాదు. ఇంగ్లీషు కూడా అంతంత మాత్రమే. హిందీకూడ అంత బాగా ప్రచారంలో లేదు. తనకెవ్వరూ ఇంకా పెద్ద దిక్కు లేదు. ఈ పరిస్థితిలో క్రమంగా ఏదోవిధంగా తోటి విద్యార్థులతో స్నేహసంబంధాలను ఏర్పరచుకొనడం జరిగింది. రోజుకొకర్ని,పోను పోను ఇద్దర్నీ, ముగ్గుర్నీ ఈ విధంగా వాళ్ళను తన గదికి పిలిపించుకొని సంఘం యొక్క ఆదర్శాన్ని గూర్చి వారికి చెప్పి శాఖా పద్ధతిని గూర్చి వివరించడం జరిగింది. ఇలా క్రమంగా వాతావరణం శాఖను ప్రారంభించడానికి అనుకూలంగా తయారైంది.

ఈ పరిస్థితుల్లో 1940 సెప్టెంబరు 11 వతేదీనాడు మొదటి శాఖను ప్రారంభించడం జరిగింది.

అక్కడొకచోట రామకృష్ణ సత్రమున్నది. ఆ ప్రాంగణంలో ప్రారంభింపబడింది. ఇది ఆంధ్రప్రదేశ్‌లోనే మొదటిశాఖ. ఈ విషయాలనన్నింటినీ ఎప్పటికప్పుడు నాగపూర్‌వైపునే తిరుగుతున్న శ్రీ యద్వాడ్కర్‌జీకి తెలియజేస్తూనే ఉండేవారు బందిష్టే.

ఇలా శాఖ ప్రారంభమైన కొద్దిరోజులకు శ్రీ యాద్వాడ్కర్‌జీ బెడవాడకు తిరిగివచ్చారు. వస్తూ వస్తూ తనతోబాటు శ్రీ వినాయకరావ్ దేశ్‌ముఖ్‌ని, శ్రీ గోపాల్‌రావ్ ఠాకూర్జీని వెంటబెట్టుకొని వచ్చినారు. శ్రీ దేశ్‌ముఖ్‌జీది ''యవత్‌మాల్'' శ్రీ గోపాల్‌రావుఠాకూర్జీది ''వణి'' శ్రీ యాద్వాడ్కర్‌జీ ఈ రెండు పట్టణాలకు వెళ్ళి అక్కడి సంఘపెద్దలను కలుసుకొని ఏరికోరియీ యిద్దరినీ తెచ్చి ఆంధ్రప్రదేశ్‌కి సమర్పించారన్నమాట. క్రమంగా విజయవాడలో ఒకటికి రెండు శాఖలైనాయి.

ఈ రెండవ శాఖ అక్కడొక గవర్నమెంటు డెప్యూటీ కమిషనర్ వారి ఆఫీసు ప్రాంగణంలో ప్రారంభమైనది. అక్కడ ఆటపాటలు మాత్రమే నిర్వహింపబడుతూ ఉండేవి. ప్రభుత్వం వారి అభ్యంతరం ఉంటుందనే ఉద్దేశ్యంతో ప్రార్థన మాత్రం వేరొకచోట జరుగుతూ ఉండేది. అక్కడ ధ్వజాన్ని ప్రతిష్ఠించి ప్రార్థన చేసి వెళ్ళిపోతూ ఉండేవారు.

శ్రీ దేశ్‌ముఖ్‌జీ, ఠాకూర్జీగారలు కొన్ని రోజులు విజయవాడలోనే ఉన్నారు. ఇలా ఉండగా గుంటూరులో శాఖ పెట్టటానికి శ్రీ వినాయకరావ్ దేశ్‌ముఖ్‌ను వెంటబెట్టుకొని అక్కడికి వెళ్ళారు శ్రీ యాద్వాడ్కర్‌జీ. అక్కడ శ్రీ గోవిందరాజుల దత్తాత్రేయులు అను ...మగల ఒక అడ్వకేటుగారి ప్రాపకం దొరికింది వారికి. వారు శ్రీ జి.వి.యల్. ...సింహారావు గారి పినతండ్రిగారు. ఆయన ద్వారా కొన్ని పరిచయాలు ఏర్పడినవి. ...క్కడ శాఖను ప్రారంభించినవారు శ్రీ దేశ్‌ముఖ్‌జీ. పిమ్మట మచిలీపట్టణంలో శాఖను ప్రారంభించటానికి శ్రీ ఠాకూర్జీని పంపించారు యాద్వాడ్కర్జీ. అక్కడ దాదాపు వెంటనే శాఖ ప్రారంభింపబడింది. ఆవరుసలో తెనాలిలో గూడ శాఖ ప్రారంభమైనది. ఎవరో గోపాల్ అనుపేరుగల ఒక బెడవాడ స్వయంసేవకు అక్కడ శాఖను ప్రారంభించాడు. అయితే అప్పుడది సరిగ్గా జరుగుతూ ఉండేదిగాదు. దరిమిలా శ్రీబందిష్టేజీ వెళ్ళి ప్రారంభించారు. ఆ వివరాలు శ్రీబందిష్టేజీని గూర్చిన ప్రత్యేక ప్రకరణంలో రాగలవు. క్రమంగా రాజమండ్రిలోగూడ శాఖ ప్రారంభమైనది. అక్కడ స్వయంగా శ్రీ యాద్వాడ్కర్‌జీయే శాఖను ప్రారంభించారు. కుంటి వెంకట్రావుగా ప్రసిద్ధి చెందిన శ్రీ చిలుకూరి వెంకట్రావుగారి సహాయంతో అక్కడ శాఖ ప్రారంభింపబడింది. ఆయన మల్ల విద్యా

ప్రవీణులు. గౌతమీ వ్యాయామశాల నడుపుతూ ఉండేవారు. చంక క్రింద కఱ్ఱసాహాయంతో నడుస్తూ ఉండేవారు. ఈ వేంకట్రావు 1941లో నాగపూర్‌లో జరిగిన ఒక సంఘకార్యక్రమంలో పాల్గొనటానికి శ్రీయాద్వడ్కర్‌జీతో కలిసి వెళ్ళటం జరిగింది. 1941లో నాగపూర్‌లో జరిగిన సంఘశిక్షావర్గకు మొదటిసారి ఆంధ్రప్రాంతం నుండి ఐదారుగురు వెళ్ళినట్లు చరిత్ర. వారు శ్రీయుతులు వెదురుపర్తి వేంకటరత్నం, అప్పల నరసయ్య పాత్రుడు, శఠకోపాచారి, బోడి రమణరావు, ప్రతాప్‌సింగ్ సోమయాజులు అనువారలు.

ఈ వరుసలో విశాఖపట్టణంలోగూడ శాఖను ప్రారంభించటానికి శ్రీయాద్వడ్కర్‌జీ బందిష్టేను వెంటబెట్టుకొని అక్కడికి వెళ్ళారు. కాని పరిస్థితులు కలిసిరాలేదు. అక్కడ పూనానుంచి వచ్చిన తృతీయ వర్ష సంఘశిక్షావర్గ పూర్తిచేసిన, సింధియానావిగేషన్‌లో ఉద్యోగం చేస్తున్న ఒక స్వయంసేవకుని కలిసి అక్కడ శాఖ ప్రారంభింపవలసిందిగా చెప్పారు. కానీ, అతనివల్ల కాలేదు. అంతటితో ఊరుకోక శ్రీ యాద్వడ్కర్‌జీ తమ స్వగ్రామమైన మూర్తజాపూర్ నుండి శ్రీమోరేశ్వర్ చౌధురీ అనే ఒక స్వయం సేవకుని విస్తారక్‌గా పిలిపించి విశాఖపట్టణంలో శాఖలు పెట్టే ప్రయత్నం చేశారు. ఆమోరేశ్వర్ స్థానికులతోను, యూనివర్శిటీలో చదువుతున్న విద్యార్థులతోను స్నేహసంబంధాలు పెంచుకొని కొంత వాతావరణాన్ని నిర్మించగలిగాడేగాని యెందుకనోశాఖ పెట్టలేకపోగా రెండు మూడు నెలల తరువాత మూర్తజాపూర్‌కి తిరిగివెళ్ళిపోయాడు. దీనికి కారణం అక్కడి యూనివర్శిటీ విద్యార్థుల్లో కమ్యూనిస్టులు ఎక్కువగా ఉండేవారని అందువల్ల తమ ప్రయత్నాలు ఎక్కిరాలేదని శ్రీయాద్వడ్కర్‌జీ అన్నారు. మొత్తంమీద అప్పటికక్కడ శాఖ ప్రారంభంకాకపోవుట విచారకరం అని శ్రీ బందిష్టేజీకూడ అభిప్రాయపడినారు. అయితే అక్కడ 1943 నుండి మంచి శాఖలు ప్రారంభమైనట్లు కచ్చితమైన చరిత్ర. శ్రీయాద్వడ్కర్జీ ఆంధ్రలో ఉన్న రెండేళ్ళకాలంలో ఐదారు పట్టణాలలో మాత్రమే శాఖలు ఏర్పడి అవిచ్ఛిన్నంగా సాగుతూ వస్తున్నాయి.

ఆ రోజులలో బెజవాడలో చుండూరు వెంకటరెడ్డిగారొక విశిష్టమైన వ్యక్తి. ధనవంతుడు, వ్యాపారి. పెద్ద కార్ఖానాకు యజమాని. వారు సంఘానికి మంచి అండగానిలిచారు. శ్రీ యాద్వడ్కర్‌జీ చెప్పినదాని ప్రకారం శ్రీగురూజీ మొదటిసారి విజయవాడకు 1942లో వచ్చారు. వారివెంట శ్రీజోషి అనేవారు అంగరక్షకులుగా వచ్చారు. శ్రీచుండూరు వెంకటరెడ్డిగారి యింట్లో మకాం. శ్రీ గురూజీ రెడ్డిగార్లకు

అదేమొదటి పరిచయం. అప్పుడు శ్రీరెడ్డిగారు గురూజీతో ''మీరు భగవంతు చూశారా'' అని ప్రశ్నించారు. వెంటనే గురూజీ ''ఔను చూశాను'' అని సమాధా చెప్పినారు. అంతేగాదు, మీకు గూడా చూపిస్తాను కాని ఒక షరతు: మీరు సంఘంద్వా హిందూసమాజకల్యాణానికి నిష్ఠతో పనిచేయాలి'' అంటూ అందమైన చిరునవ్వు చిందించారు శ్రీ గురూజీ. శ్రీరెడ్డిగారు మిక్కిలి సమ్మోహితులై సంఘానికి మరిం సన్నిహితులయ్యారు. ఇది శ్రీరామకృష్ణ వివేకానందుల ఘట్టాన్ని తలపింపజేస్తున్నదన మామూలుమాట! సమాజ పురుషసేవద్వారా భగవత్సాక్షాత్కారం పొందవచ్చు అ గురూజీ అభిప్రాయం వారి ఆత్మవిశ్వాసాన్ని ప్రకటిస్తున్నది. ఇది మనకు శిరోధార్య స్ఫూర్తిదాయకమన్నారు శ్రీయాద్వడ్కర్జీ! వారు చెప్పలేదుగాని ఈ సందర్భం శ్రీదాదారావ్‌జీ పరమార్ధ్‌గూడ అక్కడ ఉన్నట్లు మనం భావింపవచ్చును.

తమిళనాడులో 1938నాటికే సంఘశాఖలు ప్రారంభమైనవి. శ్రీదాదారావ్‌పరమా అవిభక్త మద్రాసురాష్ట్ర ప్రాంత ప్రచారక్‌గా పనిచేస్తూ ఉండేవారు. అందువల్ల వా శ్రీయాద్వడ్కర్జీ యిక్కడ ఉన్నరోజుల్లో రెండుసార్లు పర్యటనకు రావటం జరిగిం 1941లో బెజవాడలోను మచిలీపట్టణంలోను శిబిర కార్యక్రమాలు జరిగినాయి. వా శ్రీ పరమార్ధ్ వచ్చి బౌద్ధిక్‌వర్గ తీసికొన్నారు. శ్రీఠాకూర్జీ ఆధ్వర్యం మచిలీపట్టణంలో జరిగిన యీ రెండవ క్యాంపుకు ఐదుపట్టణాల నుండి సుమా వందమంది స్వయంసేవకులు పాల్గొన్నారు.

1941జూలైలో విజయవాడలో జరిగిన మొట్టమొదటి గురుదక్షిణకార్యక్రమం వందరూపాయలలోపుగా మాత్రమే సమర్పింపబడినవి. యాద్వడ్కర్జీ, బందిష్టే దేశ్‌ముఖ్‌జీ, ఠాకూర్జీ - ఈనల్గురకు వసతి భోజన సౌకర్యాదులు ఎట్లు సమకూ చుండెడివి అన్నదొక విచికిత్స. శ్రీయాద్వడ్కర్జీ ప్రచారకులుగా అధికారికమ పంపబడిన వ్యక్తిగావున వారికి నాగపూరు నుండి ఆర్థిక సదుపాయము లభిస్తూ ఉండే శ్రీబందిష్టేజీ ఆధికారికముగాక స్వంత బాధ్యతపై చదువులకై వచ్చిన వారు గావున వా ప్రతి నెలా వారి తల్లిగారు కొంత పైకము పంపుచుండెడివారు. మరికొం శ్రీయాద్వడ్కర్‌జీ సర్దుచుండెడివారు. ఇది వీరిద్దరి మధ్య పథకం ప్రకారం జరి ఏర్పాటు. శ్రీదేశ్‌ముఖ్‌జీ ఠాకూర్జీలు నాగపూర్ అధికారులచేత ఆధికారికంగా పంపబ ప్రచారకులుగారు. శ్రీయాద్వడ్కర్జీ వీరిద్దర్ని గూర్చి అక్కడి సంఘపెద్దలతో సంప్రతిం తన సొంత బాధ్యతపై తెచ్చిన సందర్భమిది. అందువల్ల వీరికి నాగపూర్‌నుండి డబ

రాలేదు. యాద్వడ్కర్జీకి, బందిష్టేజీకి ప్రతినెలా అందుతున్న డబ్బుతోనే నలుగురూ సర్దుకుంటూ కాలక్షేపం చేస్తూ ఉండేవారు. దీనివల్ల చాలక, నలుగురూ ఇబ్బంది పడ్డారు. ఇక్కడ శ్రీయాద్వడ్కర్‌గారు ఆలోచించిన విధమిది: తనను సంఘకార్యవిస్తరణకోసం అధికారులు పంపించారు. కార్యకర్తల నిర్మాణం, కార్యవృద్ధి తన బాధ్యత. మిగతా విషయాలు తరువాత చూసుకొందాంలే అన్నట్లు భావించారు. ఇందులో ఉన్న సాధక బాధకాలు అవ్యవస్థ త్వరలోనే అర్థమయ్యాయి. తరువాత దేశ్‌ముఖ్‌జీ ఠాకూర్జీల విషయం, పై వారితో ప్రస్తావించారు. ఈ విషయాన్ని నాగపూర్‌కు వెంటనే తెలుపలేదు. ఎక్కడో అవగాహన లోపం ఏర్పడింది (కమ్యూనికేషన్ గ్యాప్). తెలిసిన తరువాత అవ్యవస్థకు శ్రీ గురూజీకి కాస్త కోపం కూడ వచ్చింది. పరిస్థితులు చక్కగా సర్దుకొన్నవి. దీనివల్ల ఈ నలుగురూ ఇబ్బందిపడినా, ఎక్కువగా శ్రీదేశ్‌ముఖ్‌జీ ఠాకూర్జీలు ఇబ్బందిపడినారన్నది చరిత్ర. ఆశ్చర్యమేమంటే చివరివఱకూ ఇక్కడే ఉండి యీ మట్టిలో కలిసిపోయిన మహనీయులు వీరిద్దరే! వీరిని ఆంధ్రప్రదేశ్‌కి సమర్పించిన శ్రీ యాద్వడ్కర్జీని యెంతని ప్రశంసింపగలం! ధన్యవాదములు, కృతజ్ఞతలూ తప్ప!

ఆరోజుల్లో బెడవాడగా పిలువబడిన విజయవాడ పెద్ద కమ్యూనిష్టు కేంద్రము. స్వాతంత్ర్య సముపార్జనకు కాంగ్రేస్ ఆధ్వర్యంలో జాతీయోద్యమం ముమ్మరంగా సాగుతున్న రోజులవి. మళ్ళీ యీ ఆర్.యస్.యస్. ఏమిటి? అన్న కుతూహల భరితమైన ప్రశ్న ప్రజల్ని కొంత తబ్బిబ్బులు పెట్టిందని శ్రీయాద్వడ్కర్జీ అభిప్రాయం. కమ్యూనిస్టులు ఇది తమకొక దెబ్బగా భావించి కొంచెం కటకట పడ్డారని కూడ వారు అన్నారు. ఉత్సాహవంతులైన యువకుల్ని సంఘం బాగా ఆకర్షిస్తున్నదే అన్నది వారి బాధ. అయినా ఆమొట్టమొదటి రెండేళ్ళూ ఎవరితోనూ ఏవిధమైన సంఘర్షణ లేకుండా సంఘకార్యం ప్రశాంతంగా జరిగిపోయింది. ఈనల్గురు కూడా ఎవ్వరితోనూ ఎట్టి ఘర్షణ పడకుండ తమపని తమదిగా కార్యవిస్తరణకు ప్రయత్నించాలి అన్న ఒక నిర్ణయం తీసుకొని ముందుకు సాగటం జరిగింది. హిందూ సంఘటన, దైనందినశాఖ, కార్యపద్ధతి - ఈ పారిభాషికపదాలు, ఈ ప్రక్రియలు విద్యావంతులను, ఆలోచనాపరులను బాగా ముగ్ధుల్ని చేసినట్లు వారు చెప్పటం జరిగింది.

శ్రీయాద్వడ్కర్జీ బెజవాడ కేంద్రంగా ఆంధ్రలో 1940జూను నుండి 1942 జూన్ వఱకు పూర్తిగా రెండేళ్ళు ఉండి పనిచేశారు. ఐదు పట్టణాల్లో శాఖలకు గట్టిపునాదులు వేశారు. విజయవాడలో రెండు శాఖలు మూడైనాయి. విజయవాడలో కంటె గుంటూరులో శాఖల సంఖ్య, శాఖల్లో స్వయంసేవకుల సంఖ్య విజృంభణగా ఉండేవి.

బెజవాడలో సర్వశ్రీ పుట్టపర్తి శ్రీనివాసాచారి, చుండూరు వెంకటరెడ్డి, యస్.ఆర్.ఆర్. కాలేజీ ప్రొఫెసర్లు, వెదురుపర్తి వెంకటరత్నం, గుంటూరులో వకీలు దత్తాత్రేయులు, రాజమండ్రిలో వెంకటరావు వంటివారు లభించారు. శ్రీయాద్వాడ్కర్‌జీకి బందిష్టేజీ శిష్యులు. అందువల్ల వీరిద్దరికీ చిరకాల పరిచయం. కాని యవత్‌మాల్ వెళ్ళి శ్రీదేశ్‌ముఖ్‌జీని, వణీ వెళ్ళి శ్రీఠాకూర్జీని కలుసుకొని వాళ్ళని ఆంధ్రకు సమర్పించేదాకా వాళ్ళెవరో ఈయనకు తెలియదు. అటువంటిది అప్పటికప్పుడు వాళ్ళని యిక్కడికి తీసుకొని రావటమే ఆశ్చర్యకరమైన చరిత్ర. ప్రత్యేకంగా ఈ నలుగుర్నీ గూర్చి మఱికొన్ని విషయాలు తెలిసికొందముగాక!

## శ్రీ దత్తాత్రేయ నారాయణ్ యాద్వాడ్కర్ పంత్



ఋష్యశృంగుడు ఎక్కడికి వెళితే అక్కడికి తన వెంట వరుణదేవుణ్ణి తీసికొని వెళ్తాడన్నది పౌరాణిక గాథైతే నిష్ఠావంతుడైన సంఘకార్యకర్త ఎక్కడికి వెళితే అక్కడికి తన వెంట సంఘసిద్ధాంత అమృతవర్షాన్ని తీసికొని పోతాడన్నది ఆధునిక చారిత్రిక గాథ. సాధారణకార్యకర్తల విషయమే అంత, అలాంటప్పుడు పరమపూజనీయ డాక్టర్జీచేతనే పంపబడిన శ్రీయాద్వాడ్కర్‌జీ వంటి మహనీయుడైన కార్యకర్త తనవెంట సంఘకార్య పీయూషాన్ని బెజవాడకు తీసుకొనివచ్చారని చెబితే ఆశ్చర్యమేముంటుంది! ఒకవైపు కనకదుర్గమ్మతల్లి కరుణాకటాక్ష వీక్షణాలు, మఱొకవైపు కృష్ణవేణమ్మ తల్లికనుచూపులోని కరుణ, ఈ రెండింటితో మిళితమై ప్రవహించిన డాక్టర్జీ మేధాజనిత సంఘామృతధార! ఇదీ బెజవాడ యొక్క, ఆంధ్రప్రదేశము యొక్క అదృష్టం. ఈవిషయాలన్నీ వెనుకటి ప్రకరణంలో చర్చించాం. ఇప్పుడు కేవలం శ్రీయాద్వాడ్కర్జీని గూర్చి రేఖామాత్రంగా తెలుసుకొందాం.

శ్రీయాద్వాడ్కర్జీ 19-2-1914లో మూర్తజాపూర్‌లో జన్మించారు. ఇది విదర్భప్రాంతమునందలి బుల్డానా జిల్లాలోని ఒక చిన్నపట్టణం. తండ్రి చిన్నతనంలోనే మరణింపగా అకోలాలో మేనమామ దగ్గఱ ఉంటూ 1932లో మెట్రిక్ పరీక్షలో

ఉత్తీర్ణులైనారు. పై చదువులు చదవటానికి స్తోమతులేక మూర్తజాపూర్ హైస్కూల్లో ఉపాధ్యాయ వృత్తిలో ప్రవేశించారు. మూర్తజాపూర్‌లో 1934 ప్రాంతంలో సంఘశాఖ అవతరించింది. 1936లో డాక్టర్జీ అక్కడికి రావటం జరిగింది. ఆరోజు వారియొక్క బౌద్ధిక్ విని కదిలిన హృదయంతో స్వయంసేవకులైనారు. వెంటనే నిష్ఠావంతులైన కార్యకర్త అయినారు. 1938, 39, 40ల్లో వరుసగా మూడు శిక్షావర్గలు పూర్తిచేశారు. అక్కడి ఘోష్ ప్రముఖ్ ఐనారు. వారికి శ్రీ బాబాసాహెబ్ ఆప్టేజీతో సన్నిహిత పరిచయముండేది. వారితో కలిసి ఒక సందర్భంలో రాజస్థాన్ ఢిల్లీ ప్రాంతాలు పర్యటించారు. వారికి మరాఠీ, సంస్కృతం, హిందీ, కన్నడ భాషలు వచ్చు. తెలుగు మాట్లాడలేకపోయినా బాగా అర్థం చేసుకోగలరు. బాల్యం నుండి గొప్ప వక్త. ఉత్తమ ఉపాధ్యాయుడుగా మంచి పేరు తెచ్చుకొన్నవ్యక్తి. వీరు మొత్తం ఐదుగురు సోదరులు. వీరు రెండవ వారు. బెడవాడలో ప్రచారకులుగా నున్నప్పుడు ఆరోగ్యము దెబ్బతిన్నందువలన విరమించుకొని తిరిగి మూర్తజాపూర్‌కి వెళ్ళిపోయిరి. డాక్టర్జీ బెజవాడకు వెళ్ళి శాఖలు ప్రారంభింపుమని ఆదేశించినప్పుడు, చేయుచున్న మంచి ఉద్యోగమును విడిచిపెట్టి ప్రచారకుగా వెళ్ళిన కర్మఠ కార్యకర్త.

ప్రచారకుగా మానుకొని మూర్తజాపూరుకు వెళ్ళిపోయిన తరువాత మళ్ళీ అదే స్కూలులో ఉద్యోగమును సంపాదించుకొన్నదిట్ట. 1948లో సంఘంపై నిషేధం విధించినప్పుడు అరెస్టుకాబడి నాలుగునెలలు అకోలా జైలులో నుండిరి. ఆంధ్రనుండి వెళ్ళిన తరువాత గృహస్థాశ్రమాన్ని స్వీకరించారు. పిమ్మట, ఇంటర్, బిఏ, ఎంఏలు చదివి బొంబాయిలో ఒక కాలేజీలో సంస్కృత లెక్చరర్‌గా పనిచేశారు. వీరికి సంతానంలేదు. 1975 ప్రాంతంలో భార్య గతించినది. ప్రస్తుతం వారు ఖామ్‌గావ్‌లో తన చిన్నతమ్ముని కుమారునికడ నివసించుచున్నారు. ఇప్పుడు వయస్సు 85 సంవత్సరాలు. వృద్ధాప్యము వల్ల వచ్చిపడిన అనారోగ్య లక్షణాలు క్రుంగదీస్తున్నా మిక్కిలి చులుకుగా నడుస్తూ, గలగలా మాట్లాడుతూ మహా ఉత్సాహంగా ఉంటారు. ఎప్పుడూ ఎవరో ఒకరు వచ్చి సలహాలు తీసుకొనిపోతూ ఉంటారు. వారు ఏది మాట్లాడినా యెక్కువగా సంఘసిద్ధాంతాల్ని గూర్చే మాట్లాడుతూ ఉంటారు. ప్రతిరోజు తమ యింటికి దగ్గరలోనే ఉన్న ప్రభాత్‌శాఖకు వెళుతూ ఉంటారు. వచ్చేపోయే మిత్రులకు బంధువులకు అతిథిమర్యాదలు చేస్తూ చాలా ఉల్లాసంగా జీవితం గడుపుతున్నారు.

ఈతరం స్వయంసేవకులకు ఏదైనా సందేశమివ్వండి అని కోరినప్పుడు మంచి బలమైన

కంఠస్వరంతో, మహా ప్రవాహంగా, స్ఫూర్తిదాయకంగా, హిందీలో వారిచ్చిన సందేశ సారాంశమిది :

''రాష్ట్రీయ స్వయంసేవక సంఘకార్యం మిక్కిలి పునాది భూతమైన ప్రాథమిక కార్యం. మన హిందూ సంస్కృతి పరంపర కొన్నివేల సంవత్సరాల నాటిది. ప్రస్తుతకాలంలో దాని ప్రాముఖ్యాన్ని గూర్చి అంతగా పట్టించుకోకపోయినా సంఘకార్యం ద్వారా సమాజంలో జాగృతి తప్పక కలిగి తీరుతుంది. నేడుగాకపోతే రేపైనా కలుగక మానదు. ఇది కార్యకర్తల నిష్ఠయొక్క మోతాదుననుసరించి జరుగగలదు. ఒక కార్యకర్త యొక్క మనస్సు ఎంత తీవ్రంగా ఆలోచించి పనిచేస్తుందో దాన్ని బట్టి సమాజంలో జాగృతిత్వరితగతిని జరుగుతుంది. ఒక వ్యక్తి గొప్ప కార్యకర్త అని కొలిచి చెప్పటానికి ఆ కార్యఫలమే మానదండం. సంఘకార్యం ప్రాథమిక కార్యమని మనవిచేశాను. దానిని మఱికొంత వివరిస్తాను. మేము ఆంధ్రలో పనిచేయటానికివచ్చాం. అక్కడ హిందువులు లేరా? ఉన్నారు. వారిలో నేను హిందువును అన్న భావన లేదా? ఉన్నదనియే భావిద్దాం. కాని ఆభావనను ఎగసనజేసి, జ్వలింపజేయటానికి సంఘమొకటి కావాలి. లేకపోతే యీ ప్రజ్వలన జరగటం కష్టం. సంఘం ద్వారా కార్యకర్తలు చేసేది యీ ప్రాథమిక కార్యమే. సంఘకార్యం గంగా ప్రవాహం వంటిది. నిష్ఠావంతుడైన ఆ కార్యకర్తను ఆప్రవాహమే అతి సహజంగా ముందుకు తీసుకొని పోతుంది. కావలసింది ఆప్రవాహంలో దిగాలి అన్నకోరిక, నిష్ఠమాత్రమే. కార్యకర్తకు రెండు ముఖ్యలక్షణాలు కావాలి. ఘర్షణ పడే లక్షణం లేకుండా ఉండటం, నలుగురిని కలుపుకొని పోగల లక్షణం కలిగి ఉండటం. ఈ రెండూ చాలా ముఖ్యాలు. దీనికి తోడు స్వయం సిద్ధత ఉండాలి. హిందూ జాగృతిని కలిగించటం ప్రతివాని యొక్క కర్తవ్యం కావాలి. ఈ కర్తవ్య పాలనం చేసే వ్యక్తిని ''కార్యకర్త'' అన్న పేరుతో చాలా గొప్పగా ప్రశంసించాల్సిన పనిలేదు. మా ఖామ్‌గావ్ పట్టణమున్నది. దీనిజనాభా 70, 80వేలు ఉండవచ్చు. మఱి స్వయంసేవకులు ఎంత మంది ఉన్నారు? ఒక ఏభై మంది ఉండవచ్చు. ప్రతి రోజూ శాఖకు వచ్చే వారెంతమంది? 5, 10మంది ఉంచవచ్చు. మఱి యింతవ్యత్యాసం ఉన్నదిగదాయని భావించి తూష్ణీభావము వహింపరాదు. ఇది నా ప్రాథమిక కర్తవ్యము. నేను చేయాలి అన్న భావమున్నచో చాలును. పని చేస్తూ ఉంటే చాలును. హిందూజాగృతి వెలుగుచున్నదనియే భావింపవలెను. ఒక వ్యక్తి యొక్క శక్తిసామర్థ్యములు హెచ్చుతగ్గులుగా నుండవచ్చును. భిన్నభిన్న వ్యక్తుల్లో శక్తి సామర్థ్యాలను గూర్చిన తరతమ భేదాలు ఉండవచ్చును. కాని కార్యనిష్ఠ వారి యందుశక్తిని పెంచుతుంది. తీగెల సామర్థ్యమెంత? చాలా తక్కువ. కాని కరెంటు ప్రవహించినప్పుడే గదా

తీగెల సామర్థ్యాన్ని గూర్చి తెలిసేది. అట్లే సంఘధ్యేయనిష్ఠ, వ్యక్తుల క్షమతల సంబంధముగూడ ఉంటుంది. హిందువులో హిందూచైతన్యమున్నది. దానిని కదపగల ... ర్ద్ధి పాటిక్షమత కార్యకర్తకున్నది. అంతమాత్రం చాలు పని జరిగినట్లే. అగ్గిపెట్టె ఉన్నది. అగ్గిపుల్ల ఉన్నది. కలియనంతవఱకు నిప్పుపుట్టదు. రాపిడి జరిగిందే తడవు వెలుగుతుంది. ఒక సామాన్యహిందువుకు - సంఘకార్యకర్తకు ఉన్న సంబంధంకూడా ఇటువంటిదే. ఇరిద్దరి కలయికచేత వెలుగు జనించడం తథ్యం. సాధారణంగా ఇది కష్టతరమైన పని అని భావిస్తాం. కాని చేస్తే అత్యంత సులభం. ఇదొక చమత్కారం. వారిని ''ఖామ్‌గావ్''లో వారింట్లో దర్శించుకొనే అదృష్టం లభించింది. ఇప్పుడు వారి వయస్సు 85 సంవత్సరాలు. వారు శతంజీవులై పూర్ణ పురుషాయుష జీవితధన్యులగుదురుగాక!

# శ్రీదత్తాత్రేయ దండోపంత్ బందిష్టే



మేధావిలసనము, ధీరవిచారము, సృజనాత్మకశక్తి, ప్రసన్నవాక్ప్రసారము, లలిత హృదయ సౌందర్యము, చక్కని క్రమశిక్షణ మొదలైన విశిష్ట లక్షణాలన్నింటినీ సమన్వయించుకొని రూపొందిన అపురూపమైన వ్యక్తిత్వం శ్రీ దత్తాజీ బందిష్టేది! గురువుపేరు శ్రీ దత్తాత్రేయ నారాయణ్ యాద్వడ్కర్జీ పంత్ అయితే, శిష్యునిపేరు కూడా శ్రీ దత్తాత్రేయ దండోపంత్ బందిష్టేజీ. ఇద్దరి యందు స్వభావ సామ్యంతో పాటు నామసామ్యం కూడ స్పష్టం! ఇద్దరూ కలిసేవచ్చారు విజయవాడకు. పైగా ఒకే ఊరినుండి! శ్రీబందిష్టే తొలుత ఆంధ్రలోను, మలుత అస్సాంలోను స్టూడెంట్ ప్రచారక్‌గాను, పూర్తి ప్రచారక్‌గాను - ఇలా రెండు విధాల పనిచేసినవ్యక్తి. స్టూడెంట్సును ఆకర్షించటంలో దిట్ట. బెజవాడ యస్.ఆర్.ఆర్. కాలేజీలో ఇంటర్ చదివేరోజుల్లో యన్.టి.రామారావు చంద్రరాజేశ్వరరావు, మాకినేని బసవపున్నయ్య ప్రభృతులు వీరి సహాధ్యాయులు. ఒకసారి శ్రీసోమయ్యగారు యన్.టి.రామారావుని కలిసినప్పుడు బందిష్టే యెక్కడున్నారు? ఎలా ఉన్నారు అని అడిగినట్లు వినికిడి. ఆ బందిష్టేను గూర్చి

వెనుకటి ప్రకరణంలో కొంత చెప్పటం జరిగింది. ఇక్కడ మరికొన్ని విషయాలు తెలుసుకొందాం.

మూర్తజాపూర్ హైస్కూల్లో వారు విద్యార్థిగా ఉన్నరోజులు. అప్పుడు బోర్డు పరీక్షల్లో ఒక వ్యాసం కూడా వ్రాసే విధానం ఉండేది. ఆ ప్రశ్నలో ఐదారు శీర్షికలు ఇవ్వటం జరిగేది. ఏదో ఒక శీర్షిక మీద వ్యాసం వ్రాయాలి. అందులో ఒక శీర్షిక ఇది! ''నీకు మరపురాని మహామంచి రోజు ఏది?'' అన్నది. అప్పుడు వారు దాదాపు పదిపేజీలల్లో పూర్తి వివరాలతో సంఘసిద్ధాంతాన్ని గూర్చి పూసగుచ్చినట్లు వ్రాయటం జరిగింది. అందులో వారు వ్రాసిన ఆఖరి ముగింపు వాక్యమిది! ''నేను ఆర్.యస్.యస్‌లో చేరిన రోజునాకు మరపురాని మహామంచి రోజు'' అని వ్రాశారు.

శ్రీ బందిష్టే 1923జులై 23వ తేదీన నాగపూర్‌లో జన్మించారు. తండ్రిపేర-దండోపంత్ రామకృష్ణబందిష్టే. తల్లి పేరు రమాబాయి. మూర్తజాపూర్ హైస్కూల్లో మెట్రిక్ చదివి 1940లో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులైనారు. 1938లో 15 సంవత్సరాల వయస్సులో మూర్తజాపూర్‌లో సంఘంలో చేరారు. 1939, 40, 41 సం॥రాల్లో వరుసగా మూడు సంఘశిక్షా వర్గలు పూర్తి చేశారు. 1940జూన్‌లో శ్రీయాద్వడ్కర్‌జీతో కలిసి విజయవాడకు వెళ్ళి అక్కడి కాలేజీలో ఇంటరు చదివేటప్పుడు ఆంధ్రప్రదేశ్‌లో తొలి సంఘశాఖను పెట్టినట్లు పూర్వోక్తం. 1942 మార్చి, ఏప్రిల్ నెలల్లో ఇంటరు ఫైనల్ - పరీక్షలు వ్రాయాలి. కాని అంతకు పూర్వం వారికి టైఫాయిడ్ వచ్చింది. అది తగ్గీతగ్గకముందే మూర్తజాపూర్‌లో నున్న వారి తల్లిగారికి జబ్బుచేసింది. అక్కడికి వెళ్ళి - ఆమెకు ఉపచారం చేయవలసివచ్చింది. ఈ కారణాలవల్ల పరీక్షలు సరిగా వ్రాయలేదు. అనుకొన్న మార్కులు రాలేదు. ప్రథమ శ్రేణి వచ్చింది కాని డిస్టింక్షన్ రాలేదు. సంస్కృతంలో మాత్రం డిస్టింక్షన్ వచ్చింది. ఇట్లా ఇంటరు ముగిసింది. విజయవాడకాలేజీలో డిగ్రీ కోర్సులు లేవు. వేరొకచోటికి వెళ్ళి చదవాలన్న తహతహ లేదు. ప్రచారక్‌గా వెళ్ళాలనుకోవటం జరిగింది. ఇంతలో వారి తల్లిగారు మరణించారు. ఆమె అంత్యక్రియలకు వెళ్ళి అవిపూర్తియైన పిమ్మట నాగపూర్‌వెళ్ళి శ్రీగురూజీని దర్శించి తనకు ప్రచారకుగా వెళ్ళాలి అన్నకోరిక ఉన్నట్లు మనవిచేశారు. వారు ఆంధ్రలో పనిచేయవలసిందిగా ఆదేశించారు. ఆమేరకు తిరిగి బెజవాడకు వెళ్ళారు.

1942జూన్‌లో శ్రీయాద్వడ్కర్‌జీ విజయవాడనుండి వెళ్ళిపోయిన తరువాత ఆంధ్రకు ప్రత్యేక ప్రాంత ప్రచారక్‌గా శ్రీనరహరి బాలాజీ పార్థీగారు ఆంధ్రకు వచ్చా

గుంటూరు కేంద్రంగా మకాం పెట్టారు. శ్రీబందిష్టేజీ వారిని కలియటం జరిగింది. వారు బందిష్టేను తెనాలికి వెళ్ళి పనిప్రారంభించవలసిందిగా నిర్దేశించారు. వాస్తవానికి తెనాలిలో అంతకుముందు ఒకరు ప్రారంభించినట్లు వెనుక చెప్పబడింది. కాని అది సరిగా నడవక ఆగిపోయింది. ఇప్పుడు మళ్ళీ మొదలుపెట్టాలి. నవంబర్ 1942లో వారు తెనాలి వెళ్ళారు. గుంటూరు పట్టణం మినహాయించి మిగతా జిల్లా అంతా తెనాలి కేంద్రంగా చూడాలి ఇదే వారిపని. బెజవాడలో ఒక స్వయంసేవకు ఇచ్చిన పరిచయ పత్రాన్ని తీసుకొని తెనాలి వెళ్ళి శ్రీ కంభంపాటి వెంకటనారాయణగారిని కలిసి సంఘపనికి శ్రీకారం చుట్టినారు. అక్కడి చిన్నరావూరి చెఱువుగట్టునగల మైదానంలో మొట్టమొదటిశాఖ ప్రారంభమైనది. ఆమైదానంలో తరువాత సత్యనారాయణ పార్కు వెలిసింది. బెజవాడలో కంటె తెనాలిలో శాఖలు వేగంగా విజృంభణగా వృద్ధి పొందినవి. వెంట వెంటనే తెనాలిలో అనేక శాఖలు వెలిసినాయి. జిల్లాలోని అనేక పట్టణాలకు శాఖలు ప్రాకినయి. నరసరావుపేట, సత్తెనపల్లి, దుగ్గిరాల, రేపల్లె, కొల్లిపర, నిడుబ్రోలు, పొన్నూరు, బాపట్ల, చీరాల, ఒంగోలు మొదలైన పట్టణాల్లో విజృంభించినవి. ఎందరెందరో చదువులకు స్వస్తిచెప్పి సంఘకార్య నిమగ్నులైనారు. శ్రీయుతులు వేమూరి పూర్ణానందం, కోటంరాజు దత్తాత్రేయులు, మేకా రామకోటీశ్వరరావు, భేతపూడి శివరావు, కోటలక్ష్మి నారాయణశాస్త్రి, చల్లా సుబ్రహ్మణ్యం, శ్రీ వరదరాజులు, శ్రీ టి. రామాచార్యులు, సోమేపల్లి సోమయ్య మొదలగు వారు కార్యరంగంలో దూకటం జరిగింది. ఇట్లు 1946 జూన్ వరకు గుంటూరు జిల్లాలో సంఘవిస్తరణ కావించిన అనంతరం శ్రీ బందిష్టేని అనంతపూర్‌కు వెళ్ళి అక్కడ శాఖ ప్రారంభింపవలసిందిగా శ్రీ పార్ఖీజీ నిర్దేశించారు.

అప్పుడు బందిష్టేజీ శ్రీ పుట్టపర్తి శ్రీనివాసాచార్యుల వారి దగ్గర పరిచయ పత్రం తీసుకొని అనంతపూర్ వెళ్ళి వారి అన్నగారిని కలిసిరి. దాదాపు నవంబరు నెల వఱకు, నాలుగైదు నెలలు మాత్రమే అక్కడ పనిచేసిరి. అనంతపూర్‌లోను, హిందూపూర్‌లోనూ శాఖలు పెట్టినారు. అనంతపూర్ శాఖలో డి.సూర్యప్రకాశరెడ్డిగారు బాలస్వయంసేవకుగానుండిరి. అనంతపూర్‌నుండి నాగపూర్ కేంద్ర అధికారులు వారిని డిసెంబరు నెలలో అస్సాములో పనిచేయుటకు పంపిరి.

1947 జనవరి నాటికి అస్సాములో ప్రవేశించిరి. డిబ్రూగర్, గువాహటీ, జోర్హట్, శివసాగర్, నౌగావ్, మణిపూర్ మొదలైనచోట్ల పనిచేసిరి. మొత్తం మీద ఆంధ్రలో ఆరున్నర సంవత్సరాలు, అస్సాంలో ఐదున్నర సంవత్సరాలు పనిచేసిరి. 1948లో విధింపబడిన

మొదటి నిషేధం సమయంలో 3½ నెలలు దిబ్రూగర్ జైలులో ఉన్నారు. కాలక్రమంలో ప్రచారక్‌గా మానేసి జీవితంలో స్థిరపడాలనుకొన్నారు. బెనారస్ యూనివర్శిటీలో ఎం.ఏ. ఫిలాసఫీ, యల్.యల్.బి. ఎం.ఏ సైకాలజీచేసి అన్నింటిలో ప్రథమశ్రేణిలో ప్రథములుగా ఉత్తీర్ణులైనారు. ఉద్యోగాన్వేషణలో మహారాష్ట్ర ప్రభుత్వంలో లెక్చరర్‌గా ఉద్యోగం వచ్చింది. అందులో చేరారు.

ఉద్యోగంలో చేరిన తరువాత ఒక ఇందోరు కన్యను వివాహం చేసుకొన్నారు. ఆమెపేరు శ్రీమతి శాలినీబందిష్టే. ఇద్దరు కుమారులు, ఒక కుమార్తె. అందరూ సుఖంగా స్థిరపడ్డారు. క్రమంగా వారు పి.హెచ్.డి.గూడా చేసి రీడరై 1981లో ఉద్యోగ విరమణ చేసి ఇందోరులో స్థిరనివాసం ఏర్పరచుకొని సుఖజీవనం చేస్తున్నారు. వారి శ్రీమతి గారు ఉద్యోగం చేసి యిటీవలె విరమణచేశారు. సంఘపనిచేసినంతకాలం ఎంత దీక్షతో చేశారో యిప్పుడంత ప్రశాంతంగా స్వాస్థ్యవయోధర్మాల కారణంగా కాలంగడుపుతున్నారు. ఈ తరం కార్యకర్తలకు, స్వయంసేవకులకు మీసందేశం ఇవ్వండి అన్నప్పుడు వారు క్లుప్తంగా ఇలా సెలవిచ్చారు :

''సంఘకార్యం చాలా కష్టభూయిష్టమైన కార్యం. ఇందులో ప్రగతిని సాధించటానికి కార్యకర్తల్లో కొన్ని విశిష్టగుణాలుండటం అవసరం. సమ్యక్‌దర్శనం, హృదయవైశాల్యంగలిగి వర్గ వర్ణ భాషా భేదాలను పాటించకుండా వాటికి అతీతంగా వ్యవహరింపగలగాలి. చక్కని క్రమశిక్షణ, సమయపాలన, జ్ఞాన సముపార్జన ద్వారా బుద్ధివికాసం, ఆయా వ్యక్తులతో మసలుకొనవలసిన పద్ధతి, పుస్తక పఠనం, ఏవిషయాన్ని గూర్చిగాని నలుగురితో చర్చించి నిర్ణయాలు తీసికొనటం, బద్ధకం లేకుండా పర్యటనలు చేయగలగటం సైకిల్ త్రొక్కుట వంటి వానియందు ఆసక్తి (ఆరోజుల్లో సైకిలే ప్రధాన సాధనమని గ్రహింప ప్రార్థన) మొదలైనవి మిక్కిలి ఆవశ్యకం. మొరటుతనం పనికిరాదు. ఎంతో మెలకువ, చాకచక్యం ఉండాలి. వ్యక్తులను సంఘంవైపు ఆకర్షించటమేగాదు, వారిని కలిపి ఉంచుకొని కార్యకర్తలుగా రూపొందించే ప్రయత్నం కావాలి. లేకపోతే సంఘ కార్యం పెరగటం కష్టం. కార్యకర్తలకు తొందరపాటు పనికిరాదు. మనోనిబ్బరం అవసరం. వ్యక్తులలో ఎన్నో మనస్తత్వాలుంటాయి. స్థాయీ భేదాలు (చదువులో తరతమ భేదాలు)ఉంటాయి. వీళ్ళనందర్నీ నొప్పింపకుండా ఎంతో ఓర్పుతో, నేర్పుతో సమన్వయించుకుంటూ పోవాలి. హిందుత్వభావనను గాఢంగా నాటుకొనేటట్లుచేసి ఉత్తమ స్వయంసేవకుగా, కార్యకర్తగా రూపొందించుకోవాలి. అందరి యందు సమభావాన్ని ప్రదర్శింపగలిగిన గుణసంపదను

ప్రోది చేయాలి. ఉత్తమ శీల సంపదను నిర్మించాలి. మూఢనమ్మకాలను పోగొట్టాలి. ఇంతటి మెలకువలున్నచోగాని సంఘపద్ధతిలో హిందూ సమాజాన్ని సంఘటిత పరచటం సాధ్యంగాదు. నేను స్వయంసేవకుణ్ణి అయింది మొదలుకొని ముఖ్యకుగా పనిచేసినంతకాలం ఈవిధంగా ఆలోచిస్తూ నన్ను నేను తీర్చిదిద్దుకుంటూ, కార్యకర్తల్ని రూపొందించు కుంటూ విధి నిర్వహణచేస్తూ వచ్చాను. అప్పుడూ, యిప్పుడూ, యెప్పుడూ ఇలా ఆలోచిస్తూ సాగిపోతున్న వేలాది, లక్షలాది కార్యకర్తలుండటంవల్లనే సంఘకార్యం అవిచ్ఛిన్నంగా సాగిపోతూ విజయపథంలో పురోగమిస్తున్నది. నేను చాలా చిన్నవయస్సులో ఆంధ్రలో కాలుపెట్టి పనిచేసే అదృష్టం లభించింది. ఆ అనుభూతులు నా హృదయంలో పదిలంగా భద్రపరచుకొన్నాను. ఆంధ్రలో సంఘపని యింకా బాగా అభివృద్ధిచెందుతూ పోవాలని అభిలషిస్తున్నాను!! అన్నాను వారు ఆనందంతో తడిసిమెరుస్తున్న కళ్ళతో.

ఈసారి మళ్ళీ మీదర్శనం కోసం వచ్చినప్పుడు మీకేం బహుమతి తీసుకొని రమ్మంటారు? అని అడిగినుప్పుడు ''అరే, నాకు ఆంధ్రమట్టి అంటేనే చాలు. మహా యిష్టం. నేను బనారస్‌లో ఎం.ఏ. చదువుకునే రోజుల్లో ఎన్నో మెస్సులున్నా అక్కడి ''ఆంధ్రామెస్సు''లోనే భోజనం చేసేవాణ్ణి. నా కుమారుల్లో ఒకరికి ఆంధ్రకన్యతో వివాహం చేద్దామనుకొన్నాను. కుదరలేదు. నామనస్సులో గూడుకట్టుకొన్న యీ ఆంధ్రాభిమానానికి నాలోనేనే ఆశ్చర్యపోతూ ఉంటాను. నాకు మరొక బహుమతి యెందుకు? ఆమట్టిచాలు! అన్నారు ఉత్తాలమైన ఆనందంతో కంపిస్తూ....

ఇప్పుడు డెబ్బైయైదేళ్ళ వయస్సులో ఆధ్యాత్మిక చింతనలో ప్రశాంత రమణీయమైన జీవితం గడుపుతున్న శ్రీదత్తాజీబందిష్టే శతం జీవులై సర్వోత్కర్షలతో వర్ధిల్లుదురుగాక అని మంగళాశాసనం చేస్తూ....

# శ్రీ వినాయక్‌రావ్ లక్ష్మణ్ దేశ్‌ముఖ్

నాతమ్ముండు ఘనుండు మల్లరథినీ నాథుండు నిన్నాతత
శ్రీతోడన్ సముపేతుఁజేసి యెలమింజేపట్టి మాకిచ్చుటన్
చేతో మోదమెలర్పరామకథమున్ జెప్పించి యత్యుత్తమ
ఖ్యాతింబొందితి మింక నేను దనియన్‌గావ్యామృతాస్వాదనన్. (హరివంశం - ఆ. 1-40)



వేమారెడ్డి అర్దంకినేలిన ప్రభువు. ఆతని తమ్ముడు మల్లారెడ్డి. ఈ మల్లారెడ్డి ఎఱ్ఱన్న అనే ఒక మహాకవి ఫలానాచోట ఉన్నాడని తెలిసి వెతికి పట్టుకొని తీసుకొని వెళ్ళి తన అన్నకు సమర్పించి తను ఆస్థానంలో కవిగా నియమింపజేసినాడు. ఒక సందర్భంలో వేమారెడ్డి యెఱ్ఱనతో ''నా తమ్ముడు నిన్ను మాకు లభింపజేశాడు మేమెంత అదృష్టవంతులం'' అని తన తమ్ముడితోపాటు ఎఱ్ఱనార్యుణ్ణి ప్రశంసిస్తాడు.

శ్రీ దేశ్‌ముఖ్‌ని శ్రీ గోపాల్‌రావ్ ఠాకూర్‌ని తలుచుకొన్నప్పుడు ఈపద్యం జ్ఞాపకమొస్తుంది. అంతకుముందు తనకు పరిచయంలేని దేశ్‌ముఖ్‌జీని ''యవతమాల్''లోనూ శ్రీఠాకూర్జీని ''వణి''లోను వెతికి పట్టుకొని తీసికొని వచ్చి ఆంధ్ర ప్రదేశ్‌కి ప్రచారకులుగా సమర్పించిన మహానుభావుడు శ్రీయాదవ్‌రావ్‌జీ. మనం శ్రీయాదవ్‌రావ్జీ ఘనతను ప్రశంసిస్తూ ఈయిద్దర్నీ తలుచుకుని మురిసిపోతున్న అదృష్టవంతులం!

*''వ్రతపత్రమే నామ్‌ధపేగా, పహనూంగా స్వాగత్ సముహార్*
*ఛోడ్‌చలో అబ్ క్షుద్రభావనా హిందురాష్ట్ర కేతారణ్ హార్''*

ఈ సుప్రసిద్ధ గేయపంక్తులు తెలియని స్వయంసేవకులుండరు. దీనికి సరియైన ఉదాహరణ ప్రస్తుతం శ్రీదేశ్‌ముఖ్ శ్రీ ఠాకూర్ గారలే. వారు బ్రతికి ఉండగా ఎన్నోసార్లు కుతూహలంకొద్దీ వారి జననాభి జనవిద్యాభ్యాస ప్రాథమిక సంఘజీవితాల్ని గూర్చి అడగటం జరిగింది. కాని యెన్ని సార్లడిగినా నేర్పుగా దాటవేస్తూ వచ్చారేగాని స్తిమితంగా

ఫలానా అని చెప్పిన పాపానపోలేదు. మఱియిప్పుడు వారి ప్రాథమిక పరిచయాన్ని గూర్చియేం వ్రాయాలి ! ఎంతో ప్రయత్నించిన మీద శ్రీ దేశ్‌ముఖ్‌జీని గూర్చి రెండు మూడు విషయాలు మాత్రమే తెలియవచ్చినయి. వారు పుట్టిన సంవత్సరం 1918. జన్మస్థానం ''యనత్‌మాల్''ని ఆనుకొని ఉన్న ఒక కుగ్రామం. తండ్రి పేరు లక్ష్మణ్‌గంగారామ్ దేశ్‌ముఖ్. వృత్తి వ్యవసాయం. మెట్రిక్ ''యవత్ మాల్'' నందలి ఒక హైస్కూల్లో. ఇంటర్ ఆర్ట్స్. వర్ధాలోని వాసుదేవరావ్ కాలేజిలో వర్ధాలో అప్పాజీ జోషి ప్రభావం వల్ల 1936లో స్వయంసేవక్. యాద్వడ్కర్‌జీ ప్రేరణవల్ల 1940లో ప్రచారక్‌గా ఆంధ్రకు వచ్చారు. వారి పినతండ్రిగారి పేరు శ్రీ మోరేశ్వర్ రామచంద్రదేశ్‌ముఖ్, దానే కాలేజీరోడ్, తిలక్‌వాడీ, యవత్‌మాల్. దేశ్‌ముఖ్‌జీకి సోదరులు సోదరీమణులుగూడగలరు.

శ్రీ దేశ్‌ముఖ్ ఠాకూర్జీలు రామలక్ష్మణులవంటివారు. విశ్వామిత్రుడు, రామలక్ష్మణులను తనవెంట దీసికొనివెళ్ళినట్లు శ్రీ యాద్వడ్కర్‌జీ వారిని తన వెంట ఆంధ్రకు తెచ్చినారని చెప్పినచోనతిశయోక్తిలేదు. ఈ ఉపమానం అతిశయోక్తి అయితే అలంకార శాస్త్రం నుండి ఉపమా, అతిశయోక్త్యలంకారాల్ని తొలగించటంలెస్స. ఆంధ్రలో వీరి ప్రవేశం 1940 సెప్టెంబరు రెండవవారంలో. శ్రీ దేశ్‌ముఖ్‌జీ నవంబర్ మొదటివారంలో గుంటూరులో తొలి శాఖను ప్రారంభించారు. ప్రారంభంలోనే యిక్కడి శాఖలుబాగా ఊపులందుకొన్నట్లు శ్రీ యాద్వడ్కర్జీ వక్కాణ. దీనిని బట్టి శ్రీ దేశ్‌ముఖ్‌జీ యొక్క కార్యకౌశలాన్ని గ్రహింపవచ్చు. 1942 జూన్‌లో యాద్వడ్కర్జీ ఆంధ్రనుండి వెళ్ళిపోయిన తరువాత శ్రీ నరహరిబాలాజీ పార్థీజీ ప్రాంత ప్రచారక్‌గా వచ్చి గుంటూరును కేంద్రంగా జేసుకొని అక్కడే ఉంటూ శ్రీ దేశ్‌ముఖ్‌జీని ఏలూరు కేంద్రంగా పశ్చిమ గోదావరి జిల్లా ప్రచారక్‌గా పంపించారు. అప్పటికి ఏలూరుశాఖ ప్రారంభమైనట్లు లేదు. వీరు ఏలూరు, భీమవరం మొదలైనచోట్ల శాఖలు ప్రారంభించారు. ఆపిమ్మట కొద్దికాలానికే రాజమండ్రి కాకినాడలు కేంద్రంగా తూర్పుగోదావరి జిల్లాలో సంఘవిస్తరణకు పంపబడ్డారు. 1948లో సంఘంపై మొదటి నిషేధం విధింపబడింది. అప్పుడు కొన్నాళ్ళు ప్రచ్ఛన్నంగా తిరుగుతూ సత్యాగ్రహోద్యమానికి స్వయం సేవకుల్ని సమాయత్తం చేశారు. కొన్నాళ్ళు రాజమండ్రి జైలులో ఉన్నారు. 1949 జులైలో నిషేధం తొలగించిన పిమ్మట రాయలసీమకు పంపబడినారు.

రాయలసీమలో 1946 జులై, ఆగస్టు, నెలల ప్రాంతంలో శ్రీ బందిష్టేజీ అనంతపూర్ హిందూపూర్‌లలో శాఖలు నెలకొల్పినట్లు ఉక్తపూర్వమే. ఆతరువాత సంవత్సరానికే

మొదటి నిషేధం విధింపబడింది. అందువల్ల అప్పటికి రాయలసీమలో సంఘ విస్తరణ బాగా జరిగిందని చెప్పటానికి దాఖలా కనబడటంలేదు. నిషేధం తొలగింపబడి శ్రీదేశ్‌ముఖ్‌జీ వెళ్ళిన తరువాతనే అక్కడ విస్తరణ బాగా జరిగినట్లు చెప్పాలి. 1952లో రాయలసీమలో అనావృష్టివల్ల కఱువు కాటకములేర్పడినవి. అప్పుడు గంజి కేంద్రాల్ని నిర్వహించటంలోను తదితర సహాయక చర్యల్ని చేపట్టటంలోను వీరి కృషి మిక్కిలి కీలకమైనది. అయితే దీనివల్ల శాఖలు బాగా దెబ్బతిన్నయ్యని చెప్పవచ్చు. స్వయంసేవకుల్ని దైనందిన శాఖోన్ముఖుల్ని చేయటంలో వారి కౌశలం మఱింత శ్లాఘ్యమని తెలిసిన వారు చెప్పుదురు. శ్రీయుతులు రామదాస్‌భట్ యం.డి. వై.రామమూర్తి. నంజయ్య, సుబ్బరత్నం, రాధాకృష్ణ, విశ్వనాథయ్య ప్రభృతులపై వీరి ప్రభావంబాగా ఉన్నది. వీరందరూ మేటికలవంటి కార్యకర్తలై సంఘకార్య విస్తరణలో తమ వంతుసేవల్ని చెల్లిస్తూ ఉండటం ప్రశంసనీయం.

రాయలసీమలో ఎందరో ప్రతిష్ఠితులైన మహానుభావుల్ని సంఘసంపర్కంలోకి తెచ్చిన ఘనత శ్రీదేశ్‌ముఖ్‌జీకి దక్కుతుంది. స్వర్గస్థులైన శ్రీ సూర్యప్రకాశరెడ్డిగారికి విశేషించి వీరియెడ గురుభావం.

అనంతపూర్‌లోని బారిష్టర్ సోమిరెడ్డి, అమిలినేని వెంకటస్వామి, కర్నూలులోని శ్రీజి.పుల్లారెడ్డి ప్రభృతులు అట్టివారే. శ్రీ అమిలినేని వెంకటస్వామిగారు, 1955లో గుంటూరులో జరిగిన ప్రథమ ఆంధ్రప్రదేశ్ జనసంఘమహాసభల సందర్భంలో అధ్యక్షులుగా వరింపబడటం తెలిసిన విషయమే.

1963 ప్రాంతంలో శ్రీదేశ్‌ముఖ్‌జీ రాయలసీమ నుండి తెలంగాణ ప్రాంతానికి బదిలీయ్యైవచ్చారు. హైదరాబాద్ కేంద్రంగా ఆచుట్టుపట్ల మూడు నాల్గు జిల్లాలకు ప్రచారకులైరి. అప్పటికే తెలంగాణాలో సంఘకార్యం విజృంభణగా సాగుతున్నది. వీరి రాకతో మఱింత వెల్లివిరిసింది. ఇదిట్లుండగా 1970/71 ప్రాంతంలో రాజకీయరంగంలో ప్రవేశించటం జరిగింది. అప్పటి ఆంధ్రప్రదేశ్ జనసంఘపార్టీకి సంఘటనా కార్యదర్శిగా పనిచేసి కార్యకర్తలకు చక్కని మార్గదర్శకత్వం వహించారు. కాలక్రమంలో రాజకీయరంగం తనకు సరిపడదని భావించి కాబోలు తిరిగి మాతృసంస్థయగు సంఘకార్యం చేపట్టారు. ఆంధ్రప్రదేశ్ సంఘసంపర్క ప్రముఖ్ బాధ్యతను విజయవంతంగా నిర్వహించారు.

1974 ప్రాంతంలో సంఘకార్యంలో నొక భాగంగా సేవాకార్యములను నిర్వహించడం శ్రేయస్కరమని భావించి ''భారతీయ వికాసయోజనా సమితి'' అన్న పేరుతో ఒక

సేవాసంస్థను నెలకొల్పారు. ఉచిత వైద్యసౌకర్యాలను సమకూర్చటం, ఉచిత విద్యాబోధన తరగతుల్ని నిర్వహించటం, మురికివాడలలో సేవాకార్యక్రమాల్ని చేపట్టటం వంటి ప్రణాళికల్ని రూపొందించి కార్యాన్వితం చేశారు. హైదరాబాదు, అనంతపూర్ వంటి చోట్ల వారు నెలకొల్పిన ఉచిత హోమియోవైద్యశాలలు చిరకాలం పనిచేసి కొన్ని వందల వేలాది ప్రజలకు సేవచేసినవని చెప్పటం విశేషంగాదు. ఈ సంస్థ తరపున ''భారతీయ వికాస యోజనా'' అన్నపేరుతో ఆంగ్ల భాషలోనొక మంచి మాస పత్రికను నడిపించారు. సేవారంగంలో ప్రసిద్ధి వహించిన గొప్ప గొప్ప రచయితలచేత ఉన్నత స్థాయి వ్యాసాలెన్నో అందులో ప్రచురితమౌతూ ఉండేవి. అది మామూలు పత్రిక వంటిదిగాదు. పరిశోధనాత్మకవిషయములతో నిండి శాశ్వతంగా భద్రపఱచుకొనదగిన స్థాయిలో వెలువడిన సంచికలవి. ప్రొఫెసర్ మాఢేకర్జీ వంటి మహనీయులు ఆపత్రికకు సంపాదకులుగను, ఆసంస్థకు అధ్యక్షులుగను పనిచేసిరని చెప్పినచో చాలును. ఆ వ్యవస్థయెంతటి గొప్పదో తెలియటానికి. ప్రాంతస్థాయిలో, అఖిలభారత స్థాయిలో గూడ ఎన్నో గోష్ఠుల్ని నిర్వహించి, సేవారంగంలో ఒక గొప్ప ఉత్సాహజనకమైన వాతావరణాన్ని సృష్టించగలిగారు. మఱికొంత కాలమువారు జీవించి యుండినచో అది యెంత గొప్ప సంస్థగా నెదిగియుండెడిదో చెప్పతరంకాదు! దాదాపు హఠాత్తుగా 1983 జూన్‌లో వారు మరణించటంతో ''భారతీయ వికాసయోజనా సమితిని'' అప్పుడప్పుడే అఖిల భారత స్థాయిలో నెలకొన్న ''భారత వికాస పరిషత్తు''లో విలీన మొనర్చుట జరిగింది. ''భారత వికాస పరిషత్తు'' అనేక సేవాకార్యాల్ని చేబట్టి నిర్వహిస్తూ ఉండటం మిక్కిలి స్ఫూర్తిదాయకం.

శ్రీదేశ్‌ముఖ్‌జీ యొక్క రూప సంపదగాని, స్వభావంగాని చాలా విలక్షణమైనవి. మిక్కిలి నాజూకైన రూపము. మెత్తని స్వభావముగల వ్యక్తి. తెలుగు బాగా తెలిసిన వ్యక్తి. ఆంధ్రకు వచ్చినప్పటినుండీ యెక్కువగా ఇంగ్లీషులోను, హిందీలోను వ్యవహరించటం అలవాటైన వారు. చూడటానికికాస్త ''రిజర్వుడు''గా కనబడుతున్నప్పటికీ చొరవచూపిస్తే హృదయానికి హత్తుకొనే స్వభావంగల మహనీయుడు. తనకు సన్నిహితులైన వారి విషయంలో ఒక్క సంఘకార్యానికి సంబంధించిన వాటిల్లోనేగాక కౌటుంబిక, వ్యక్తిగత విషయాల్లో చక్కని సలహాలనిస్తూ అభివృద్ధికి బాటలు వేయగల్గిన ఆర్ద్ర హృదయుడు. సంఘపెద్దగానేగాక, కుటుంబ పెద్దగాకూడ ఆప్యాయతను చూరవిచ్చుట వారి నైజం. ఎల్లప్పుడు పులు గడిగిన ముత్యంలాగా ఉంటూ ఎప్పటికప్పుడు శుభ్రమైన తెల్లని దుస్తుల్ని ధరిస్తూ ఆరోగ్యంగా కనబడటం వారి విశిష్టత. పచ్చిపోకలుంటేచాలు ఆకలిదప్పుల్ని

మఱువగల్గిన వ్యక్తి. సంఘ కార్యక్రమాలకు సంబంధించినంతవఱకు శారీరక కార్యక్రమాల మీద కంటె బౌద్ధిక విషయాలలో వీరికి ఆసక్తిమెండు. మంచి వక్త. అధి బహిరంగ సభల వక్తృత్వముగాదు. మేధావంతుల సమక్షంలో స్వయంసేవకుల, కార్యకర్తల సమావేశంలో ప్రసన్నమధురంగా హృదయాలకు హత్తుకొనేటట్లు మాట్లాడగలనేర్పరి. 1940లో, వారు వచ్చిన కొత్తల్లో హిందీకంటె ఇంగ్లీషును ఆదరించిన తెలుగువారికి వారి ఆంగ్లభాషోపన్యాసములు మిక్కిలి ఆకర్షకంగా ఉండేవి. హైదరాబాదు, తెలంగాణా ప్రాంతాలలో వారి హిందీ ఉపన్యాసాలు పాయసం పంచిపెట్టినట్లుండేవి. విషయ వివేచన, భాషాపటిమ, అవసరమైనదానికంటె ఒక్క పొల్లుమాట లేని అందమైన వాక్యవిన్యాసం వారి సొత్తు. ఆ ప్రస్తుతీకరణ విధానం శ్రోతలకు హాయిగొల్పుతూ ఉండేది. సంస్థకోసమని ధనసేకరణలో వారు అందెవేసిన చేయి.

అన్య ప్రాంతాల నుండి యిక్కడికి వచ్చి తొలి రోజుల్లో యెక్కువ కష్టాలు పడినవారిల్లో శ్రీ దేశ్‌ముఖ్ ఠాకూర్జీలు ముఖ్యులు. వయస్సులు చాలా చిన్నవి. నడిపించగల నాయకులు లేరు. అండదండలు లేవు. ''నేను హిందువును'' అని చెప్పుకోవటానికి ప్రజలు సిగ్గుపడుతున్న రోజుల్లో ఒకవైపు కాంగ్రేస్ మరొక వైపు కమ్యూనిష్టు పార్టీల ఉద్యమాల వేడి ఒత్తిడిలో, సంఘసిద్ధాంతాన్ని దైనందినశాఖ ద్వారా వ్యాప్తి చెందించటం అంత తేలిక విషయంగాదు. అందులో ఆవేశపరులైన ఆంధ్రుల మధ్య అదిమఱింత కష్టంతో కూడినపని. రోజుల తరబడి ఉపవాసాలుండి, సెనగపప్పు, మరమరాలు, బఠానీలు, మైరాలతో ఆకలిచల్లార్చుకుంటూ కఠినమైన కార్యాన్ని నిర్వహించటం ఎంత కష్టమో ఏమని చెప్పుట! గుంటూరులోని ఆ పెద్దపార్కులో కుళాయి నీళ్ళతో కడుపునింపుకొంటూ వేడి పొంగి వళ్ళంతా దురదలు లేచి బాధపెడుతూ ఉంటే, గోక్కుంటూ, దిగాలుపడి ఒంటరిగా కూర్చున్న దేశ్‌ముఖ్‌జీని చూసి నిబ్బరాన్ని కోల్పోయిన పాతస్వయంసేవకులు ఎందరు లేరు! ప్రచారక్‌గా రాకముందు శ్రీ దాదారావ్‌జీ పరమార్థే ''ప్రచారక్‌గా వెళ్ళి సంఘవ్యాప్తికి కృషి చేయాలి'' అన్నప్పుడు, తెలిసీ తెలియని ఆవయస్సులో ''ఓ, అదెంతపని'' అన్న దేశ్‌ముఖ్‌జీ ఎంతటి మహనీయుడో ఏమని వర్ణింపగలం! ఒకవైపు మీదపడుతున్న వృద్ధాప్యం, మరొకవైపు 45 సంవత్సరాలు విరామమెఱుగని పరిశ్రమవల్ల జర్జరితమైన శరీరం, దానికి తోడు హఠాత్తుగా ముంచుకొనివచ్చిన అనారోగ్యము - వీటిని లెక్కచేయక హైదరాబాదులో జరుగుతున్న సంఘశిక్షావర్గకు ఎండలో వెళ్లటంవల్ల పెద్దపులివలె మీద పడిన గట్టి వడదెబ్బవల్ల 1983జూన్ నెలలో పతత్యేషకాయో అంటూ పార్థివ శరీరాన్ని తెలుగు మట్టిలో విలీనమొనర్చిన కర్మయోగి, మహితాత్ముడు శ్రీ వినాయక్‌రావ్‌జీ లక్ష్మణ్ దేశ్‌ముఖ్.



# శ్రీ గోపాల్ రావ్ ఠాకూర్

ఆంధ్రప్రదేశ్ సంఘ చరిత్రలో ''ప్రజల మనిషి''గా ప్రసిద్ధికెక్కిన ధీరోదాత్తుడు శ్రీగోపాల్జీ ఠాకూర్. సంఘకార్యవిస్తరణలో ప్రళయ జంఝువుగా, రాజకీయ రంగం ద్వారా సాంస్కృతిక జాతీయ చైతన్యాన్ని ప్రోదిచేసిన ప్రశాంత విప్లవమూర్తిగా, హృదయస్ఫూర్తిగల వక్తగా, స్మితపూర్వభాషిగా, రాయలసీమ క్షుద్బాధితుల పాలిట అన్నపూర్ణడుగా, ఆర్ద్ర హృదయంగల మహోన్నత మానవమూర్తిగా, సర్వతోముఖ ప్రజ్ఞాకంగా నిలిచిన మహనీయుడు శ్రీ ఠాకూర్జీ. మచిలీపట్నంలోగాని, కృష్ణాజిల్లాలోగాని యిప్పటికీ జీవించి ఉన్న ఆనాటి ప్రజలకు సంఘమంటే ఠాకూర్జీ సంఘమనే పేరున్నదని చెబితే ఆవంతగూడా అతిశయోక్తి లేదు. బందరు హిందూ కాలేజీ దగ్గఱ, ఒకగది అద్దెకు తీసుకుని దానికి ''శాంతి నికేతన్'' అని పేరుపెట్టి తన కార్యకలాపాలకు కేంద్ర స్థానంగా చేసుకొన్న నాయకమణి. శ్రీయాద్వడ్కర్‌జీ, బందరు వెళ్ళి శాఖలు పెట్టమని చెప్పినప్పుడు అదెక్కడుంది, ఎట్లాపోవాలి అనికూడ అడగకుండా వెంటనే బయలుదేఱి వెళ్ళిన ధైర్యశాలి. బందరు గొడుగుపేట యందలి కన్యకా పరమేశ్వరీ సత్రంలో తొలి శాఖను పెట్టిన దిట్ట. ఒక్క బెజవాడ తప్ప తక్కిన కృష్ణాజిల్లా అంతటా సంఘశాఖల్ని కోలాహలంగా విస్తరింపజేసిన క్రియాశీలి.

శ్రీ ఠాకూర్జీ యొక్క జనాభిజన విద్యాభ్యాసాదిక బాల్య జీవితాన్ని గూర్చిన వివరాలు లభింపవు. లభించినమేఱకు కొన్ని అంశాలివి : స్వగ్రామం వర్ధా జిల్లాలోని ''నాగరి'' అనే ఊరు. కాని వారి అన్నగారు శ్రీ ఠాకూర్ మాష్టర్జీ (అసలు పేరు తెలియదు) ఉద్యోగరీత్యా ''వణీ''కి బదిలీయై వచ్చి, అక్కడి మరాఠీ ప్రాథమిక పాఠశాలలో ఉపాధ్యాయులుగా పనిచేశారు. వారితోబాటు మొత్తం కుటుంబం కూడ వచ్చింది. మొత్తం ముగ్గురు సోదరులు. రెండవ వారు శ్రీ గోపాల్జీ ఠాకూర్. మూడవవారు శ్రీ గోవిందజీ ఠాకూర్. వారికొక చెల్లెలు కూడా ఉండేది. పేరు జీజా. రామ్‌టేక్‌లో ఉండేది. తల్లివితంతువు. ఆర్థికంగా మధ్యతరగతి కుటుంబం. ఠాకూర్ మాష్టర్‌జీ భార్య వణీలోనే గతించింది. ఆయన ఉద్యోగ విరమణ చేశాక తిరిగి స్వగ్రామం ''నాగరీ''కి వెళ్ళిపోయారు. శ్రీ

గోవిందజీ ఠాకూర్ నాగపూర్‌లో ఒక పత్రికలో పనిచేయటానికి వెళ్ళారు. శ్రీఠాకూర్‌మాస్టర్జీ గూడ తమ్ముడిదగ్గఱికే చేరుకొన్నాడు. ఇక మిగిలినవారు మన గోపాల్జీ ఠాకూర్. వీరు అన్నచాటు తమ్ముడుగా వణీలో మెట్రిక్ చదివి 1935లో పాసైనారు. వణీలో ఇంటర్ కాలేజీలేదు. అందువల్ల పై చదువులకు ఎక్కడికీ వెళ్ళలేని స్థితిలో ''వణీ''లోనే ఉండిపోయారు. 1918లో జన్మించారు. ''వణీ''లో చుఱుకైన స్వయంసేవకుగా, కార్యకర్తగా పనిచేస్తూ ఉండేవారు. 1940కి పూర్వమే ప్రథమ, ద్వితీయ, తృతీయ సంఘశిక్షావర్గలు పూర్తిచేశారు. 1936-1940 మధ్య ఏమిచేస్తూ ఉండేవారో తెలియదు. మన అదృష్టం పండింది. శ్రీయాద్వడ్కర్జీ యవత్‌మాల్‌లో శ్రీదేశ్‌ముఖ్‌ని, ''వణీ''లో ఠాకూర్జీని పట్టుకొని వచ్చి ఆంధ్రకు సమర్పించారు. ''వణీ'' సంఘ కార్యకర్తల్ని, ప్రచారకుల్ని ఎగుమతి చేసిన స్థానం.

శ్రీ గోపాల్జీ ప్రచారక్‌గా రాకపూర్వం చాలా మితభాషి. స్కూల్లో చదివేరోజుల్లో గూడ వక్తృత్వం అసలేలేదు. అట్లాంటిది, కాలాంతరంలో గొప్పవక్తగా రాణించారు. సంఘపరిధిని దాటిన సార్వజనీనమైన వక్తృత్వం వారిది. తొలిరోజుల్లో ప్రధానంగా ఇంగ్లీషులోనే ఉపన్యసిస్తూ ఉండేవారు. అదొక ప్రవాహం. గంట, గంటన్నర, రెండుగంటలు - ఇలా కాల పరిమితిలేని వారి ఉపన్యాసాల్ని వినటానికి స్వయంసేవకులు మాత్రమేగాదు, సాధారణ ప్రజలుగూడవస్తూ ఉండేవారు. విజయవాడ, యస్.ఆర్.ఆర్. కాలేజీ ప్రిన్సిపాల్ డా॥ పుట్టపర్తి శ్రీనివాసాచార్యులుగారు శ్రీఠాకూర్జీ ఉపన్యాసాలను విన్న తరువాత'' నేను లండన్ యూనివర్శిటీలో పిహెచ్.డి. చేసిన వ్యక్తిని. అయినా నీతో సమానంగా ఇంగ్లీషులో ఉపన్యసింపజాలను ఇంతటి జ్ఞానాన్ని, భాషను ఎట్లా సంపాదించినావు'' అని ప్రశంసించారు. శ్రీ గోపాల్జీ మెట్రిక్యులేషన్ మాత్రమే చదివారు. అయినా వారు ఎం.ఏ చదివి ఉండవచ్చునన్న భావం ఉండేది జనసామాన్యంలో. సహజ సిద్ధమైన కళకు, చదువుకు సంబంధం లేదనీ, చదువువల్ల సహజసిద్ధమైన కళ సహజపరిణత సిద్ధమౌతుందని యిందుమూలంగా భావింపవచ్చు.

శ్రీ ఠాకూర్జీ దఱి జేరటానికి వీలుగాని గంభీరుడు కాదు. చల్లని చిఱునవ్వుతో ఇట్టె ఆకర్షించి హృదయానికి హత్తుకొన్నంత అనుభూతిని కలిగించే లలిత హృదయుడు. ఆయన అందరికీ ఆత్మీయులే. ఎవరికి వారు ఠాకూర్జీతనకు మిక్కిలి సన్నిహితులు అనిభావించి మురిసిపోవుట కద్దు. వారి యొక్క ఆప్రవృత్తిలో కృత్రిమత్వంలేదు. సహజ సరళ సౌందర్యమే గోచరిస్తుంది. పాతకార్యకర్తలన్ని వివరాలతో సహా జ్ఞాపకం పెట్టుకొని

పలుకరించే కుశలుడు. ఎందరో స్వయంసేవకుల్ని, కార్యకర్తల్ని ''అరే'' అని ఏకవచనంలో సంబోధించే చొరవగల ఆత్మీయుడు. మెత్తని మందలింపులతోనేగాని, చివాట్లతో మనస్తాపం కలిగించే అలవాటు లేనివాడు. సంఘటనాకార్యంలో అందర్నీ దగ్గఱకు తీయాలేగాని దూరం చేసుకోకూడదన్న ప్రాథమిక సూత్రాన్ని చక్కగా నెఱిగిన వ్యక్తి. వైవిధ్యంగల వ్యక్తుల్ని సమన్వయాత్మకంగా నడిపింపగల చతురుడు. నాయకులకు నాయకుడు. అందరికీ చక్కని మార్గదర్శకుడు.

శ్రీ గోపాల్జీ 1940 నుండి 1950 వఱకు కేవలం సంఘకార్యాన్నే ప్రోదిచేశారు. ఈ కాలఖండంలో 1942, 43 ప్రాంతంలో కాబోలు కొద్దికాలం రాజమండ్రిలో పనిచేశారు. తక్కిన కాలమంతా కృష్ణాజిల్లా అంతా చూస్తూ ఉండేవారు. 1950 ప్రాంతంలో కొద్ది రోజులు చిత్తూరులో ఉండినారు. 1952 ప్రాంతంలో వచ్చిపడిన ''రాయలసీమకఱువు'' సందర్భంలో అప్పుడక్కడ అనంతపురంజిల్లా ప్రచారకుగా ఉన్న శ్రీదేశ్‌ముఖ్‌జీతో కలిసి సహాయక చర్యలు నిర్వహించారు. ఆ సందర్భంలో శ్రీ అనంతాచారి, శ్రీ చిలుకూరి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు తమ వంతు సేవల్ని చెల్లించినట్లు చరిత్ర. దరిమిలా జనసంఘం, బి.జె.పి. నాయకులుగా రాజకీయరంగంలో చక్రం త్రిప్పటం జరిగింది. 1952 జనవరిలో జరిగిన తొలి సాధారణ ఎన్నికల సందర్భంలో వారు రాజకీయ రంగంలో ప్రవేశించారు. అప్పుడే అఖిల భారత స్థాయిలో జనసంఘం ఏర్పడుతున్న సమయం. ప్రయోగాత్మకంగా అక్కడక్కడ స్వతంత్ర అభ్యర్థుల్ని రంగంలోకి దింపటం జరిగింది. ఆంధ్రలో నాలుగైదుచోట్ల అభ్యర్థుల్ని నిలిపారు. గుడివాడ పార్లమెంటరీ నియోజకవర్గానికి శ్రీ పిన్నమనేని లింగయ్య చౌదరిగారు అభ్యర్థి. ఆ సందర్భంలో శ్రీ ఠాకూర్జీ వ్యూహరచన చేసినారు. శ్రీ కోటంరాజు దత్తాత్రేయులు, శ్రీభండారు సదాశివ రావు, శ్రీ ఓగేటి అచ్యుతరామశాస్త్రిగారలు ఆనియోజకవర్గంలో ప్రధాన భూమికను నిర్వహించిన వ్యక్తులు. ఈ చివరి వ్యక్తి ప్రతిరోజు ఒక జీపులో మైకుతో సహా అయిదారుగురు కార్యకర్తల్ని వెంటబెట్టుకొని ''ఊరూరా తిరిగి ప్రచారంచేసి రావటం జరిగేది. ఆరోజుల్లో ఆ ఊళ్ళన్నీ కమ్యూనిష్టు కంచుకోటలు. ఎక్కడా ఘర్షణలు రాకుండేవిధంగా వ్యూహరచనచేసి ఎప్పటికప్పుడు మార్గదర్శనంచేసిన మహనీయుడు. ఎన్నికలు పూర్తియైన ఆఖరిరోజున కార్యకర్తల సమావేశం జరిగింది. అందులో శ్రీఠాకూర్జీ యొక్క చాకచక్యాన్ని ప్రశంసిస్తూ శ్రీ లింగయ్యగారు ఆర్ద్రహృదయులై ఆనందభాష్పాలు రాల్చిన సంఘటన మరపురానిది.

1955లో ఆంధ్రలో మధ్యంతర యెన్నికలు జరిగినవి. అప్పుడు ''నరసరావుపేట''

నుండి శ్రీ అంగరలక్ష్మీ నారాయణగారు అసెంబ్లీ అభ్యర్థిగా నిలబడ్డారు. అప్పుడుకూడ వ్యూహరచన శ్రీ ఠాకూర్జీదే. అక్కడ ప్రధాన పాత్రను వహించిన వ్యక్తులు శ్రీ భండారు సదాశివరావు శ్రీ ఓగేటి అచ్యుతరామశాస్త్రిగారలే. చిలకలూరిపేట దగ్గఉల్ "పసుమఱ్ఱు" అనే గ్రామంలో ఒకనాటి రాత్రియెన్నికల సభ. ఠేంగ్డేజీ, ఠాకూర్జీ 1( గం॥లకు రావాల్సి ఉండెను. కాని అర్ధరాత్రి 1గం॥ వచ్చారు. అసలు వస్తారోరారో అన్న అనుమానంలో వేదికను ఏర్పాటుచేయలేదు. తీరా వాళ్ళు వచ్చారు. కార్యకర్తలు హడావిడిగ వేదికను ఏర్పాటు చేయబోతున్నారు. ఠాకూర్జీవద్దు అని వారించారు. అదొక కూడలి ప్రదేశం. అక్కడ సగం పైకి లేచిన యెత్తైన కొత్తగా కట్టినగోడ ఉన్నది. దానిమీద నిలబడి ఠేంగ్డేజీ హిందీలో ఉపన్యసింపగా శ్రీకొల్లిమర్ల వెంకటేశ్వర్లుగారు తెలుగులోకి తర్జుమ చేశారు. ఠేంగ్డేగారు ప్రారంభంలో : చూశారుగదా శ్రీ ఠాకూర్జీ కార్యసరళి! ఖర్చులేదు కష్టంలేదు. గోడయే వేదిక అయింది. ఇటువంటి ఉపాయాలతో ఎన్నికల ప్రచార నిర్వహించండి" అన్నారు. అప్పుడు ప్రజలుచేసిన హర్షధ్వానాలు ఆశ్చర్యజనకాలు. శ్రీ ఠేంగ్డేజీ యీ చిన్న ఉదంతాన్ని ఒక చక్కని అనుభూతిగా భావించి కాలంతరంలో రెండుమూడు సార్లు నెమరు వేయటం ఆశ్చర్యం కలిగించింది. ఏ పనిచేసిన వ్యూహాత్మకంగా చేయటం ఠాకూర్జీ యొక్క విశిష్టత. అది అలవోకగా ఉంటుందేగా ఆర్భాటంగా ఉండదు.

ఒకసారి ఠాకూర్జీతో కలిసి శ్రీ పిరాట్ల వేంకటేశ్వర్లుగారు రైలు ప్రయాణం చేస్తున్నారు ఠాకూర్జీకి టూటయర్ పెట్టెలో బెర్తుదొరికింది. శ్రీ పిరాట్లకు సీటు మాత్రమే దొరికి రాత్రి కూర్చుండియే ప్రయాణం చేయాల్సి వచ్చింది. ఒక రాత్రివేళ ఠాకూర్జీ కిందకి ది తన నిద్ర అయిపోయిందనిచెప్పి వారిని బలవంతంగా పైకి పంపటం జరిగింది. ఇది శ్రీ ఠాకూర్జీ యొక్క మహోన్నతమైన మానవీయతకు ఉదాహరణగా పేర్కొనవచ్చు.

1948లో సంఘంపై మొదటి నిషేధం విధింపబడింది. అప్పుడు ఏరాజకీయ సంస్థగా సంఘాన్ని సమర్థించలేదు. దానివల్ల సాంస్కృతిక జాతీయాభిమానంగల మహనీయుల కొందఱు శ్రీ శ్యాంప్రసాద్ ముఖర్జీ నాయకత్వంలో జనసంఘాన్ని స్థాపించారు. అ( ఆంధ్రప్రదేశ్‌లో ప్రవేశించబోయే తరుణంలో శ్రీ శ్యాంప్రసాద్ ముఖర్జీ శ్రీ గోపా రావ్‌జీని, సంఘటనా కార్యదర్శిగా నియమించారు. కృష్ణా జిల్లాలో కమ్యూనిస్టులే ఢీకొంటూ సంఘ విస్తరణకు కృషిచేసిన ఠాకూర్జీని మించిన సమర్థుడు, వక్త, యోగ్యుడ రెవ్వరుండురు? 1975లో ఎమర్జెన్సీ వచ్చిపడి సంఘంపై నిషేధం విధింపబడింది

అప్పుడు ''లోక్ సంఘర్షసమితి'' పేరుతో జయప్రకాశ్ నారాయణ్ నాయకత్వంలో జరిగిన రెండవ జాతీయోద్యమంలో ఆంధ్రప్రదేశ్‌గూడ ముందడుగువేసింది. శ్రీయుతులు తెన్నేటి విశ్వనాథం, నీలం సంజీవరెడ్డి వంటి పెద్ద నాయకుల్నేగాక జిల్లా స్థాయి నాయకుల్ని ఎందరినో ఈ ఉద్యమంవైపు మళ్ళించిన ఘనత శ్రీ ఠాకూర్జీకే దక్కుతుంది!

విశాలమైన నుదురు, చక్కని ముఖబింబము, అందమైన క్రాపు, సమవిభక్తాంగత్వము, పెద్దగా శ్రద్ధవహించకపోయినా పరిశుభ్రంగా ఉండేదుస్తులు, అప్పుడప్పుడు ధరించుకోటు, కళ్ళజోడు, అందమైన పలువరుసకు లోపంరానీయకుండా సున్నితమైన ద్రవ్యములతో పరిమళం చిమ్మే కారాకిల్లీ, నిత్య మందస్మితం, ప్రియభాషిత్వం, ఒక విధమైన ఠీవీతో గూడిన నడక, ప్రచండమైన కార్యదీక్ష, ఇదే శ్రీఠాకూర్జీ యొక్క ఆకారము, ఆకారసదృశమగు ప్రజ్ఞ!

ఠాకూర్జీ 1983 జులైలో స్వర్గస్థులైనారు. అంతకు పూర్వం నెలగూడ కాలేదు శ్రీ దేశ్‌ముఖ్‌జీ మరణించి. శ్రీ యాద్వడ్కర్జీవెంట ఈయిద్దరూ ఒకేసారి కలిసి ఆంధ్రకు వచ్చారు. ఒకేసారి మరణించారు. దేశ్‌ముఖ్‌జీ మరణించినప్పుడు బర్కత్‌పురా సంఘకార్యాలయంలో ప్రశాంత శాశ్వత నిద్రలోనున్న వారి మృతదేహం చూసి ''ఒరే, తాత్యా! మనిద్దరం ఒకేసారి కలిసివచ్చాం గదా, మఱినీవు ముందుగా వెళ్ళిపోతున్నావేమిట్రా!'' అని గుండెలు అవిసేటట్లు నిశ్శబ్దంగా రోదించిన ఠాకూర్జీని, దేశ్‌ముఖ్‌జీని ఎవరుగాని యెట్లు మరవగలరు? పిమ్మట శ్రీఠాకూర్జీ గుంటురువెళ్ళారు. అక్కడ శ్రీజూపూడి యజ్ఞనారాయణగారి కుమారుని వివాహానికి హాజరైనారు. ఠాకూర్జీకి తెలిసిన ఎందరెందరో పెద్ద చిన్న పాతక్రొత్త కార్యకర్తలు, స్వయంసేవకులు వచ్చారు. వారందర్నీ చూసి ఠాకూర్జీ మహదానందపడిపోయారు. అందర్నీ పేరుపేరునా పలుకరించి ఉల్లాసంగా గడిపారు. అప్పటి వఱకు గుండెల్లో దాచుకొన్న శ్రీదేశ్‌ముఖ్‌జీ మరణదుఃఖం, ఇప్పుడు కలిగిన పట్టరాని సుహృద్బంధుజన సందర్శనానందం మిళితమై తబ్బిబ్బులు పడి గుండెలు చిక్కబట్టి సంభవించిన మరణమిది! చిత్రం, గుంటూరులో మొట్టమొదటి సంఘశాఖను నెలకొల్పిన మహనీయుడు శ్రీదేశ్‌ముఖ్‌జీ. అక్కడే శ్రీఠాకూర్జీ మరణం! వారి భౌతికకాయాన్ని హైదరాబాదు కార్యాలయానికి తీసుకొనిరావటం జరిగింది. శ్రీదేశ్‌ముఖ్‌జీ దహనమైన చోటనే శ్రీఠాకూర్జీకూడ దహనమైపోయారు. పాతకార్యాలయ ప్రాంగణంలో ఈ యిద్దరికీ కలిపి శ్రద్ధాంజలి సభ జరిగింది. ''ఈ యిద్దరూ ఒకేసారి వచ్చారు. ఒకే సారి వెళ్ళిపోయారు'' అన్న ఒక్క వాక్యంతో కళ్ళనీళ్ళు తెప్పించారు శ్రీ సోమయ్యగారు. ఇదొక చరిత్రాత్మకమైన సహ మరణయాత్ర!

ఇటీవల ''ఖామ్‌గావ్''వెళ్ళి శ్రీయాద్వడ్కర్‌జీని దర్శించినప్పుడు ఈ విషయాలన్నీ వర్ణించి చెప్పటం జరిగింది. అప్పుడు వారు ''వీరిద్దర్నీ నేను ఎంతో ఆత్మవిశ్వాసంతో ఆంధ్రకుతీసుకొనివచ్చాను. నేను ముందుగానే అక్కడినుండి తిరిగి వచ్చాను. వాళ్ళిద్దరూ అంతిమ శ్వాస విడిచేవరకు అక్కడే వుండి సంఘకార్య తపస్సులో పండిరాలిపోయారు'' అంటూ విలవిలా దుఃఖించారు.

ది. 3-7-1983 ఆదివారం నాడు ఉదయం 9.30 గంటల నుండి 12.30 గం॥ల వఱకు హైదరాబాదు సిటీ సెంట్రల్ లైబ్రరీ హాలులో శ్రీ పిరాట్ల వేంకటేశ్వర్లుగారి అభ్యుదయ వేదిక ఆధ్వర్యంలో శ్రీ దేశ్‌ముఖ్, ఠాకూర్జీల ''సంస్మరణ సభ'' జరిగింది. అప్పటి శాసన మండలి సభ్యులు శ్రీ డి. సూర్యప్రకాశ్‌రెడ్డి, ప్రముఖ సాహిత్య వేత్త శ్రీభండారు సదాశివరావు, విజయనగర వాణిజ్య కళాశాల ప్రిన్సిపాల్ శ్రీటి. హరిహర శర్మ, సరస్వతీ విద్యాపీఠం ప్రధాన కార్యదర్శి శ్రీ యస్. యల్. యన్. ఆచార్యులు మొదలగు పెద్దలందరూ హాజరైన సందర్భమది. అప్పుడు డా॥ ఓగేటి అచ్యుతరామశాస్త్రి ఆమహనీయులిద్దరికీ కలిపి సమర్పించిన ''స్మృతి గీత''మిది.

నాకలం ఇంకా
కన్నీళ్ళు కారుస్తూనే ఉంది
అది సిరాగా ఎప్పుడు
మారుతుందో తెలీదు
ఇప్పుడు నేనేం వ్రాయాలి?
నాగుండెలగువ్వ
కుత్తుక వలలో గిలగిలా
కొట్టుకుంటూ, తన్నుకుంటూ
అక్షరాల ~~ఈక్షణాల్లో~~
బొట్లుబొట్లుగా ఇంకా
అశ్రువులు రాలుస్తూనే ఉంది
ఇప్పుడు నేనేం పలకాలి?
నా గుండెల స్మశానంలో
ఆ మహనీయుల శవాలు రెండూ
ఒకటి తర్వాత నొకటిగా

ఇంకా కాలుతూనే ఉన్నాయి
అదుగో, ఆకపాల మోక్షపు
టోంకార ధ్వనులకు
నా అనాహతపుతిత్తులు
వంతగా, సన్నగా, విషాదంగా
సన్నాయి సవ్వడులు
ఊదుతూనే ఉన్నాయి
ఇప్పుడు నేనేం పాడాలి?
నాగుండెల్లోతడి ఆరిపోయింది
అది ఆవిరిగా మాఱి
ఆ మహనీయుల శరీరాల సరోవరాల్లో
ఆఖరిసారిగా వికసించిన
చిఱునవ్వుల చెంగల్వల రేకులపై
హిమబిందువులా మెరుస్తోంది!
మఱి యిప్పుడు నేనేం....
''హిమకిరీటిని''
1996 జనవరిలో ప్రచురించిన తృతీయ ముద్రణ కావ్యం నుండి

## శ్రీ నరహరి బాలాజీపార్థీ



అది 1945 డిసెంబరు నెల ప్రాంతం. బెజవాడలో అప్పుడే ప్రభాత్‌శాఖ అయిపోయింది. శ్రీ చుండూరు వెంకటరెడ్డిగారి యింటి దగ్గఱ వారు, పార్థీజీ, కేదార్జీ మఱి కొందరు స్వయంసేవకులు కలిసి లోకాభిరామాయణం మాట్లాడుకుంటున్నారు. సందర్భం ఎలా వచ్చిందో గాని గుఱ్ఱపు స్వారీ సంగతి వచ్చింది. ఎవరో పార్థీగారికి గుఱ్ఱపు స్వారీ వచ్చు అన్నారు. అప్పుడు అక్కడే ఉన్న దినకర్‌రావ్ కేదార్జీ ఔను! అని చెప్పి నాగపూర్

సంఘశిక్షావర్గలో గుఱ్ఱపుస్వారీని నేర్పే విషయాన్ని గురించి వివరించారు. ''శ్రీమార్తాండజీ'' జోగ్ అనే ఆయన గుఱ్ఱపు స్వారీలో దిట్ట. వారే సంఘశిక్షావర్గలో అది నేర్పుతూ ఉండేవారు. శ్రీపార్థీజీ వారికి సహాయకులుగా ఉండేవారు. నేనైతే చూడలేదు, ''అని కాస్త'' చమత్కారంగా మాట్లాడి అక్కడి వారికి కుతూహలాన్ని రేకెత్తించారు. అయితే ఒకసారి చూడాలి అన్నారు వెంకటరెడ్డిగారు. పార్థీజీ ఉత్సాహంగా నవ్వుతూ గుఱ్ఱాన్ని తెప్పించండి. మీ బగ్గీకి కట్టే గుఱ్ఱముందిగా రప్పించండి అన్నారు, వారు తెప్పించారు. అంతే పార్థీజీ దానిమీద బైఠాయించి బయలుదేరారు. శ్రీరెడ్డిగారు ఏమౌతుందోయేమో అని భయపడి తన నౌకరును సైకిల్ మీద వారి వెంట పంపించారు. శ్రీ పార్థీజీ దర్జాగా ఒక అర్ధగంటసేపు స్వారీచేసి సరదాగా తిరిగి వచ్చారు. అందరూ భలే వినోదించారు. అందరూ ఆశ్చర్యపడిందెక్కడంటే - వారు ప్రాంత ప్రచారకుగా ఆంధ్రకువచ్చి అప్పటికి మూడు సంవత్సరాలుపై చిలుకు దాటింది. ఈ ప్రసక్తి ఎక్కడా ఎప్పుడూ గూడా రాలేదు. పార్థీజీకూడా ఎప్పుడూ సరదాకోసమైనా పాక్కలేదు. ఇదీ ఆశ్చర్యం - నాయకత్వం వహించే వ్యక్తి చాలా స్తిమితంగా ఉదాత్తంగా వ్యవహరించాలి అన్నది సారాంశం.

శ్రీపార్థీజీ 1942 జులైలో మనకు ప్రాంత ప్రచారకుగా వచ్చినట్లు లెక్క. అప్పటి వఱకు విజయవాడ అనౌపచారిక కేంద్రం. వీరు వచ్చిన తరువాత గుంటూరుకు కేంద్రం మార్చి ప్రాంతమంతా పర్యవేక్షిస్తూ ఉండేవారు. ఆరోజుల్లో ఆంధ్రప్రాంతంలోకెల్లా గుంటూరు విద్యాకేంద్రం. ఎన్నో పెద్ద పెద్ద కళాశాలలుండేవి. 1942లో జపానువారు విశాఖపట్టణంలో బాంబులు వేశారు. అందువల్ల భద్రత కోసం యూనివర్శిటీ గుంటూరుకు మార్చబడింది. నాగపూర్‌కి చెందిన డాక్టర్ కె.పి.రోడే అనే ఆయన ఆంధ్రయూనివర్శిటీ భూగర్భశాస్త్రశాఖలో ప్రొఫెసర్‌గా పనిచేస్తూ ఉండేవారు. ఆయన అప్పుడు గుంటూరుకు వచ్చి అక్కడ ఉంటుండేవారు. బెనారస్‌లో వారు శ్రీగురూజీ సహాధ్యాయులు. పార్థీజీకి వ్యక్తిగతంగా బాగా పరిచయం. అందుచేత పార్థీగారు గుంటూరులో వారి యింట్లో తరచుగా ఆతిథ్యం పొందే వారు. బెజవాడకు వచ్చినప్పుడు శ్రీ చుండూరు వెంకటరెడ్డిగారి యింట్లో దిగుతూ ఉండేవారు.

ఆంధ్రకురాక పూర్వం శ్రీపార్థీజీ బీహారులో ప్రచారక్‌గా ఉండేవారు. అక్కడి నుండి బదిలీయై ప్రాంత ప్రచారక్‌గా వచ్చారన్నమాట. క్రమశిక్షణకు మిక్కిలి ప్రాధాన్యమిచ్చే వ్యక్తివారు. ఆయన సమక్షంలో ఎవ్వరూ బద్ధకించటానికి వీలులేదు. వీరి హయాంలో

ప్రాంత మందలి అన్ని జిల్లాల్లోనూ సంఘ విస్తరణ జరిగింది. ఏసంస్థగాని కాలక్రమంలో వృద్ధి పొందటం సహజమే. అయితే, పరిస్థితులు గూడ తోడు పడుచుండటం కద్దు. దిగ్గంతుల వంటి ప్రచారకుల కార్యదీక్షతోపాటు ఆనాటి దేశ కాలమాన పరిస్థితులు కూడా కలిసివచ్చాయి. పార్థీజీ వచ్చిన ఒకటి రెండు నెలలకే ''క్విట్ ఇండియా'' ఉద్యమం విజృంభించింది. అది విఫలంకావటంతో ప్రజల్లో కొంత నిరుత్సాహం ఆవరించింది. యువకుల్లో అది మఱింత హెచ్చింది. దీనితో కాంగ్రెసుపట్ల కొంచెం వైముఖ్యమేర్పడింది. కమ్యూనిష్టులు బ్రిటిషువారిని భుజాన వేసుకొని జాతీయోద్యమాన్ని నీరుగార్చటం వల్ల అదంటే అసహ్యంపుట్టింది. బ్రిటిషువారు జరిపిన కాల్పుల్లో అక్కడక్కడాయువకులు మరణించటం జరిగింది. ఒక్కతెనాలిలోనే ఏడుగురు యువకుల్ని సర్కార్ టపటప కాల్చిపారేసింది. ఇవన్నీ యువకుల్లో ఆవేశంతో పాటు ఆలోచనల్నికూడా రేకెత్తించినాయి. వారికి ఏదైనా ఒక సంస్థకావాల్సి వచ్చింది. సంఘం కనిపించింది. అంతే సంఘశాఖలు విపరీతంగా వెలిసినవి. సంఖ్య పరవళ్ళు తొక్కింది. ఇది గుంటూరు, తెనాలి, విజయవాడ, బందరు వంటి పట్టణాల్లో మరింత ఎక్కువైనది. ఈ అనుకూల పరిస్థితుల్ని మరింత అనుకూలంగా మార్చుకొని కార్యకర్తలు విజృంభించిరి.

ఈ వేడివాతావరణంలో శ్రీపార్థీజీ ఆధ్వర్యంలో 1942 డిసెంబరులో గుంటూరు దగ్గఱ గోరంట్లలో ఒక పెద్ద హేమంతశిబిరం నిర్వహింపబడింది. ప్రాంతమందలి 40 స్థానాల నుండి పదిహేనువందల మంది స్వయంసేవకులు పాల్గొన్నారు. అదే సమయంలో ఒక బాల శిబిరం గూడ నిర్వహింపబడింది. ఇందులో దాదాపు మూడు వందలమంది పాల్గొన్నారు. ఈ తరుణ హేమంత శిబిరానికి ముందటి రెండు సంవత్సరాల్లోను మొదటిది విజయవాడలోను, రెండవది గుంటూరువద్ద నల్లపాడులోను జరిగినవి. అవి యాద్వడ్కర్‌జీ కాలంలో జరిగినాయి. పార్థీజీ కాలంలో ఇది మొదటిది. చాలా పెద్దది. 1943లో జరిగిన విజయవాడ శిబిరానికి పరమ పూజనీయ శ్రీగురూజీ విచ్చేశారు. ఈ ఉత్సాహంలో 1944లో బెల్గాంలో మొదటిసారి జరిగిన సంఘశిక్షావర్గలో (అప్పుడు ఓ.టి.సి అనేవారు) ప్రాంతమంతటి నుండి రమారమి 150మంది స్వయంసేవకులు శిక్షార్థులుగా పాల్గొన్నారు.

ఈ ఉత్సాహకర పరిస్థితులు 1946 చివరి వఱకు కొనసాగినయి. ఆ వరుసలో 1946 అక్టోబరులో ఒంగోలులోను, ఏలూరులోను రెండు పెద్ద ఐ.టి.సిలు (ఇప్పటి ప్రాథమిక శిక్షావర్గలు) జరిగినవి. గుంటూరు, ఒంగోలు, నెల్లూరు, బళ్ళారితో సహా మొత్తం

రాయలసీమ జిల్లాలకు కలిపి ఒంగోలులో జరిగినది. కృష్ణా, ఉభయగోదావరులు, విశాఖపట్టణం, విజయనగరం, శ్రీకాకుళం జిల్లాలకు కలిపి ఏలూరులో జరిగినది. ఏలూరు శిబిరానికి శ్రీ పి. మహేశ్వరరావు ముఖ్య శిక్షక్. వారు తొలుత పాన్సూర్లు స్వయంసేవకు. పిమ్మట ఏలూరు ప్రాంతానికి వెళ్ళిపోయారు. ఒంగోలు శిబిరానికి శ్రీనీలకంఠమోరేశ్వర్ దేశ్‌పాండేగారు ముఖ్యశిక్షక్. ఈ రెండు శిబిరాలు శ్రీపార్థీజీ ఆధ్వర్యంలో పెద్ద సంఖ్యలో దిగ్విజయంగా నడిచినవి. రాయలసీమ మొత్తంలో అనంతపూర్, హిందూపూర్‌లలో మాత్రమే శాఖలుండెడివి. అందుచేత అక్కడ్నించి చాలా కొద్దిమంది మాత్రమే వచ్చారు. ఇప్పటికి పేర్కొనబడిన ఈ కార్యక్రమాలన్నీ మిక్కిలి చరిత్రాత్మకములని చెప్పవలసిన పనిలేదు.

పార్థీజీ యొక్క ఉదాత్తరమణీయమైన స్వభావాన్ని గూర్చి ఒకటి రెండు ఉదాహరణలు చెప్పటం సమంజసం. ఒంగోలు ఐ.టి.సిలో పాల్గొన్నవారికి అక్కడి పి.వి.ఆర్. హైస్కూల్లో వసతి భోజనసౌకర్యాలు ఏర్పాటుచేయటం జరిగింది. అక్కడ కొంచెం నీటి యెద్దడి ఉండేది. ఒకటి రెండు రోజులు నీరు సరఫరాకాక చాలా ఇబ్బంది కలిగింది. స్నానం చేయనిదే తట్టుకోలేని వారికి ఒక సూచన వచ్చింది. పట్టణంలో ఎవరైనా తెలిసివారుంటేగాని,తెలియకపోయినా పరిచయం చేసుకొని అర్థించిగాని అవకాశం ఉన్నవారి యిళ్ళకుపోయి స్నానంచేసి రావచ్చు. కొందరు పట్టణం మీదబడి స్నానం చేసి వచ్చారు. ఒక స్వయంసేవకు ఒకానొక ఇంటికి వెళ్ళి రెండు మూడు సార్లు తలుపుతట్టాడు. మధ్యాహ్నసమయం. ఇళ్ళల్లో అందరూ భోజనాలు చేసికాస్త విశ్రాంతి తీసుకొనే సమయం. ఆ స్వయంసేవకు ఆయింటి వెనుకదొడ్డిగోడదూకి, చప్పుడు కాకుండా గిలకబావి నుండి నీళ్ళుతోడి స్నానం ముగించాడు. ఎంత చప్పుడుగాకుండా చేసినా చప్పుడయింది. ఆ యింటి వారు లేచి తలుపులు తెఱచి చూసే లోపల ఈ స్వయంసేవకు మాయమైనాడు. ఆయింటివారు చాలా కోపంగా కాకుండా కాస్త మందలింపుగా ఫిర్యాదుచేశారు. పార్థీజీ ఆస్వయంసేవకు ఎవరో ఆచూకీతీసి తన దగ్గఱకు పిలిపించారు. అది ఒక్క ఐదునిముషాల దృశ్యం. ఆతడు చాలా భయంగా బఱువుగా వారిదగ్గఱకు వెళ్ళాడు. అప్పటి వఱకు ఎంతో గంభీరంగా ఉన్న పార్థీజీ ''చూడు, సంఘస్వయంసేవకు ఇలా ఉండగూడదు. సంఘం మీద సదభిప్రాయంపోతుంది. ఇక ముందెప్పుడు ఇట్లా చేయవద్దు'' అని ఎంతో మెత్తగా మందలించి ఒక్క చిఱునవ్వునవ్వారు. ఆ చిఱునవ్వునుగాని, అప్పటి వఱకు భయంతో బిగుసుకుపోయిన ఆ స్వయంసేవకు శరీరంలో ఏర్పడిన సడలింపునుగాని, అక్కడున్నవారు సరదాగా వినోదించిన ఆభావ శబలతగాని చూసి తీరవలసిందేగాని చెప్పతరంగాదు!

1945 చివరిభాగంలో భీమవరంలో ఒకపాటి పెద్ద బాలహేమంత శిబిరం జరిగింది. అక్కడ కొందఱు చిన్న పెద్ద అధికారులుండిరి. ప్రవేశద్వారం దగ్గఱ ఒక బాలస్వయంసేవకుని ద్వారపాలకుడుగా పెట్టారు. పార్థీజీ వచ్చారు. వారులోపలికి వెళ్ళాలి. ఆ బాలుడు పార్థీజీని చూసి ఉండవచ్చుగాని వారి స్థాయి తెలిసి ఉండకపోవచ్చు. అతడు అడ్డగించాడు. కాస్త తాళిన తరువాత తానెవరో చెప్పారు పార్థీజీ. అదంతానాకు తెలియదు. ఎవర్నీరానీయవద్దని నాకు చెప్పారు. మీరు వెళ్ళటానికి వీల్లేదు అని చాలా ముద్దుగా గంభీరంగా చెప్పాడు. పార్థీజీ తనకు సహజమైన చిఱునవ్వునవ్వి ఆతణ్ణి దగ్గఱకు తీసుకొని తలను చుంబించి, ''ఇదీ క్రమశిక్షణ అంటే'' అని మెచ్చుకొని పిమ్మట జరిగిన తన బౌద్ధిక్‌లో ఆ విషయం చెప్పినారు.

ఈవిధంగా సంఘకార్యం ఉఱ్ఱూతలూగుతూ ముందుకు సాగుతున్న సమయంలో కొందఱి తెలివితక్కువతనంవల్ల పెద్ద దెబ్బ తగిలింది. ఆంధ్ర మహారాష్ట్ర భేదాలు వచ్చిపడినాయి. చిలికి చిలికి గాలివాన అయింది. పోటీ శాఖలేర్పడినాయి. ప్రక్కప్రక్కనే జరుగుతూ ఉండేవి. అప్పుడు సర్ కార్యవాహ్‌గా ఉన్న భయ్యాజీ దాణీ వచ్చి పరిష్కరించటానికి ప్రయత్నించారు. పరిస్థితి కొంత మెత్తపడింది. చక్కబడలేదు. పరమపూజనీయ శ్రీగురూజీ స్వయంగా విజయవాడకు వచ్చి శ్రీచుండూరు వేంకటరెడ్డి యింట్లో ఇరుపక్షాల వారికి సమావేశం ఏర్పాటుచేసి నచ్చచెప్పటానికి ప్రయత్నించారు. అందరికీ ఒకే ఒక ప్రశ్నవేశారు. దేశహితంకోసం హిందూ సంఘటన, అందుకు సంఘకార్యం కావాలా వద్దా? అని. అందరూ ఏకగ్రీవంగా కావాలి అన్నారు. అయితే యీ భేదాలు మఱచి పనిచేయండి అని చెప్పారు. శ్రీ గురూజీ సమావేశం నుండి వెళ్ళిపోయారు. ప.పూ. గురూజీ మనోభావాన్ని గ్రహించి అనేకులు దారికి వచ్చారు. కొందరు మొండికేసి నడిపిన పోటీశాఖలు ఒకటి రెండునెలల్లో అంతరించిపోయినవి. సంఘశాఖలు కొన్నాళ్ళు కృశించినట్లున్ననూ క్రమంగా పుంజుకొన్నాయి. బుద్ధిమంతులైన స్వయంసేవకులు మళ్ళీ సంఘంలోకి వచ్చారు. సామాన్యులు కొందఱు జారిపోయారు. వీళ్ళందరు తరువాత పశ్చాత్తాపంతో కళ్ళనీళ్ళు పెట్టుకోవటం చరిత్ర.

ఈపరిస్థితుల్లో పార్థీజీ యెంతో సంయమనంతో, సంతులనంతో వ్యవహరించారు. ఇది యెక్కువగా గుంటూరు జిల్లాలో జరిగినది. అందులోను తెనాలి గుంటూరు పట్టణాలు ముఖ్యమైనవి. ఈకీచులాటలో దేశ్‌ముఖ్‌జీ, ఠాకూర్జీ, దేశ్‌పాండేజీలు ఇక్కడే ఉండిపోయినా శ్రీ సహస్ర భోజిని బందిష్టేలు అస్సాంకు బదిలీయై పోయినారు.

శారీరకంగా అనారోగ్యం కంటె మానసికంగా అలసిపోయిన శ్రీపార్థీజీ 1946 డిసెంబరులో ఆంధ్రను విడిచిపెట్టి నాగపూర్ వెళ్ళిపోయారు. గుంటూరు జిల్లాకు శ్రీబందిష్టేజీ స్థానే శ్రీబాలకవి కుమారస్వామిగారు జిల్లా ప్రచారక్‌గా వచ్చారు. మొత్తం ప్రాంతంలో వీరు మొదటితెలుగు జిల్లా ప్రచారకుల్లో ఒకరు. వీరిది నెల్లూరు జిల్లా గూడూరు దగ్గర ఓడూరు. రాజమండ్రిలో బి.ఏ చదివి మంచి కార్యకర్తగా పేరుతెచ్చుకొని గుంటూరు జిల్లా ప్రచారకులైనారు. 1946లో ఒంగోలులో జరిగిన ఐ.టి.సిలో వీరు ప్రముఖ పాత్ర వహించారు. పొన్నూరు దగ్గఱ జడవల్లి అనే కుగ్రామముంది. అక్కడ శ్రీ ఉపద్రష్ట వెంకట్రామయ్యగారింట్లో 1946 జూన్ 30వ తేదీన ముఖ్యులైన కార్యకర్తల సమావేశం జరిగింది. దానికి పార్థీజీ, బందిష్టేజీ, కుమారస్వామిగారు వచ్చారు. అక్కడ బందిష్టే కుమారస్వామిగారికి బాధ్యత అప్పగించి అనంతపూర్ వెళ్ళిపోయారు.

శ్రీనరహరి బాలాజీ పార్థీగారు 1913లో నాగపూర్‌లో జన్మించారు. తండ్రిపేరు శ్రీబాలాజీ రామచంద్రపార్థీ. సూపరిండెంటు పదవిలో ప్రభుత్వోద్యోగం చేశారు. వీరికి ఇద్దరు సోదరులు, ఇద్దరు సోదరీమణులు. అందరికంటె వీరేచిన్న. 1931లో మెట్రిక్, 1933లో ఇంటర్ 1935లో బి.ఏ పూర్తిచేసి 1940లో తొలుత బీహార్‌లో ప్రచారక్‌గా వెళ్ళి 1942 జూన్‌లో ప్రాంతప్రచారకుగా ఆంధ్రకు వచ్చి 1946 డిసెంబరులో నాగపూర్‌కి వెళ్ళిపోయారు. అక్కడ కొన్నాళ్ళు ఒక ఆంధ్రవ్యక్తి స్థాపించిన డీసల్ ఇంజన్ ఏజన్సీ కంపెనీలో ఉద్యోగం చేశారు. పిమ్మట ''యవత్‌మాల్''లో బి.ఎడ్. ట్రైనింగుచేసి నాగపూర్ ధరమ్‌పేట న్యూ ఇంగ్లీషు హైస్కూల్లో టీచరుగా పనిచేశారు. ఇంగ్లీషు, ఫిజిక్సు బోధించేవారు. ప్రతి రోజు సైకిల్ మీద వెళ్ళివచ్చేవారు. 1952మే 16నాడు తెలుగు వచ్చిన ఒక తమిళకన్యతో వివాహమైనది. ఆమేపేరు హేమలతా పార్థీ. వీరికి ఇద్దరు కుమారులు. భరత్, శ్రీనివాస్ వీరిపేర్లు. ఇద్దరూ తృతీయ వర్ష సంఘశిక్షావర్గ చేసిరి. వీరికి నల్గురు కుమార్తెలుగూడా ఉన్నారు. మంచి ఆదర్శవంతమైన కుటుంబం. శ్రీమతి హేమలతా పార్థీగారు కూడా టీచరుగా ఉద్యోగంచేశారు. శ్రీపార్థీజీ 73 ఏళ్ళ వయస్సులో పక్షవాతానికి గుఱియై కొన్నాళ్ళు మంచంలో విశ్రాంతి తీసుకొని 1985లో మరణించారు. చివరిరోజుల్లో అంతిమశ్వాస వదిలే వఱకు స్వయంసేవకుగానే ఉండిరి. ఆంధ్రలో ఉన్నది నాలుగున్నర సంవత్సరాలే అయినా మరపురాని మహా మనీషిగా చెఱగని ముద్రవేసిపోయిన మహనీయుడు శ్రీ నరహరి బాలాజీ పార్థీజీ.

# శ్రీ దినకర్‌రావ్ బుచ్చే



ప్రస్తుతం వీరు నాగపూర్, మహల్ సంఘ బిల్డింగు కార్యాలయంలో ( డా॥హెడ్గేవార్ భవన్) ఉంటున్నారు. రెండు మూడేళ్ళనాడు పక్ష వాతానికి గుఱియై నడిచీ నడవని, మాట్లాడీ మాట్లాడలేని స్థితిలోనున్నారు అందువల్ల లభించిన మేఱకు కొన్ని విషయాలు మనవి చేయటం జరుగుతున్నది.

శ్రీ దినకర్ బుచ్చి 1923 ఫిబ్రవరి 8వ తేదీనాడు నాగపూర్‌లో జన్మించారు. తండ్రిపేరు రామచంద్రరావ్ కృష్ణరావ్ బుచ్చి, తల్లిపేరు పార్వతి. వీరు ముగ్గురు సోదరులు. శ్రీ బుచ్చి చివరివారు. ఇద్దరు చెల్లెళ్ళు. ఒక చెల్లెలు గతించినది. ఒక సోదరుని కొడుకు వచ్చి చూసిపోతూ ఉంటారు.

1932లో సంఘస్వయంసేవకులైనారు. నాగపూర్‌లోని మోహితే సంఘస్థాన్ నడుస్తున్న సమయంలో ప్రతిరోజు బైటనుంచొని చూస్తూ ఉండేవారు. నాల్గైదురోజులు గడిచిన తరువాత ఉత్సాహంకొద్దీ, స్వయంప్రేరణతో స్వయంసేవకులైనారు. 1942లో నాగపూర్‌లోని ఒక కాలేజీలో బి.కాం. మొదటి సంవత్సరం చదువుతున్న రోజులు. ఇంతలో ''క్విట్ ఇండియా'' ఉద్యమం వచ్చింది. కాలేజీలు మూతపడ్డాయి. ఏంచేయాలి? సంఘ అధికారుల ప్రేరణతో ప్రచారక్‌గా ఆంధ్రకు వెళ్ళటం జరిగింది.

తొలుత విజయవాడకు వెళ్ళారు. స్టేషన్‌లో దిగి జట్కా తీసుకొని శ్రీచుండూరు వెంకటరెడ్డిగారి యింటికి వెళ్ళారు. రెడ్డిగారు వారిని సాదరంగా లోపలికి ఆహ్వానించారు. ఇంతలోకి, శ్రీపార్థీజీ వచ్చారు. పరస్పరం పరిచయాలు భోజనాదులు ముగిసినాయి. శ్రీబుచ్చి విజయవాడలో ఆ ఒక్కరోజే ఉన్నారు. మరుసటి రోజు ప్రచారక్‌గా ఒంగోలు వెళ్ళిపోయారు.

1943 జనవరి మొత్తం నెల అక్కడే ఉన్నారు. అప్పటికి ఒకే సాయంశాఖ ఉన్నది. వృద్ధాప్యం, అనారోగ్యం కారణంగా, జ్ఞాపకశక్తి నశించి అక్కడి కార్యకర్తల పేర్లు వారు

చెప్పలేకపోయినా మనకు తెలిసిన దాన్ని బట్టి శ్రీయుతులు వావిలాల రాధాకృష్ణమూర్తి, నీలంరాజు సుబ్బారావు మొదలైన కార్యకర్తలుండేవారు. వారి యొక్కగాని, తదితర కార్యకర్తల యొక్కగాని సహాయ సహకారాలు తీసుకొంటూ ఆనెలల్లా అక్కడ ఉండి, నెల్లూరుకు ప్రచారక్‌గా వెళ్ళినారు.

నెల్లూరులో కూడ వీరు చాలా కొద్దికాలమే ఉన్నారు. 1943 ఫిబ్రవరి నుండి ఏప్రిల్ వఱకు మాత్రమే ఉండి ''మే''లో ఒకే ఒక స్వయంసేవకుని నాగపూర్ ఓ.టి.సికి తీసుకొని వెళ్ళారు. ఆతనిపేరు డా॥ తూములూరి శేషగిరి రావు. వీరు నెల్లూరులో ఉండగా వేంకటేశ్వర్లు అనే ఒక స్వయంసేవకుని యింటి గదిలో ఉండేవారు. భోజనం హోటల్లో చేస్తూ ఉండేవారు. వారు వెళ్ళేటప్పటికి నెల్లూరులోగూడ ఒకే సాయంశాఖ ఉండేది. ఓ.టి.సి. అయిపోయిన తరువాత నాగపూర్ నుండి వారు మళ్ళీ నెల్లూరుకు రాలేదు. వారు మొత్తం ఆంధ్రలో పనిచేసిన కాలం నాలుగైదు నెలలు మాత్రమే. కాని వీరి పేరు అందరికీ తెలుసు.

దరిమిలా వీరు మళ్ళీ మూడేళ్ళు వార్ధాలో బి.కాం. చేశారు. అది పూర్తి అయిన పిమ్మట 1948 వఱకు స్వంత గృహనిర్మాణం చేయిస్తూ వార్ధాలోనే ఉండిపోయారు. 1949లో మళ్ళీ ప్రచారక్ జీవితాన్ని ప్రారంభించి తమిళనాడులో ప్రవేశించారు. సేలం, కోయంబత్తూరు, కారైకుడి, మధురై, మద్రాసు జిల్లాల్లోనూ, నగరాల్లోనూ పనిచేసి 1979లో మళ్ళీ నాగపూర్‌కి వచ్చేశారు. అక్కడ చాలా కాలం కార్యాలయ వ్యవస్థలో విధినిర్వహణ చేస్తూ ఉండేవారు. సుమారు మూడేళ్లనాడు పక్షవాతం వచ్చి మళ్ళీ యిప్పుడిప్పుడే కోలుకుంటున్నారు. ఇప్పుడు సుమారు 75 ఏళ్ళ వయస్సు. ఆయురారోగ్యాభివృద్ధులతో తులతూగుదురుగాకయని మంగళాశీస్సులు!

# శ్రీ నీలకంఠ మోరేశ్వర్ దేశ్‌పాండే



పంచ పాండవుల్లో భీమునిది అన్ని విధాలా చాలా ప్రత్యేకమైన వ్యక్తిత్వం. ఎప్పుడు ఉద్దండమైన లీలను ప్రదర్శిస్తాడో, ఎప్పుడు ప్రశాంత రామణీయకతను సంతరించుకొంటాడో చెప్పలేం. అయితే అది సాధారణంగా ఔచిత్య పూరితంగానే ఉంటుందనేది యథార్థం. అతడు వాయుపుత్రుడు. వాయువులక్షణం తాను కదలటం ఇతురుల్ని కదలించటమే. అలాగే ఆ మొదటి ఐదుగురు ప్రచారకుల్లో భీముని వంటివారు శ్రీ దేశ్‌పాండేజీ. ఆయన ఎక్కడ ఉంటే అక్కడ తాను ఊగుతూ ఇతరుల్ని ఊగిస్తూ ఉండేవారు. ఆయనను చూసినవాళ్ళకు ఆయన పేరు తలుచుకోగానే కళ్ళముందు ఒక కరికలభం, సింహకిశోరం, జలపాతం, జంఝూనిలం, ఆకర్ణాం తము ఎక్కుపెట్టి విడిచిన బాణం. ఇట్లా యెన్ని ఉపమానాలు చెప్పినా అవి పాతవై వినటానికి ఆనకపోవచ్చు. వారొక అద్భుతమైన వ్యక్తి. ఒక పురాణకథా నాయకుడు అని భావించి ఉపమానాల జోలి విరమించటం లెస్స.

వర్ధాలో 1943లో మెట్రిక్ పరీక్షలు వ్రాసి ఉత్తీర్ణులైన పిమ్మట, ఇంటర్ చదువుతూ సంఘపని చేయటానికి విద్యార్థి ప్రచారక్‌గా వచ్చి నెల్లూరు వి.ఆర్.కళాశాలలో చేరిన వ్యక్తి శ్రీ దేశ్‌పాండేజీ. 1945లో ఇంటర్‌లో ఉత్తీర్ణుడైన పిదప నెల్లూరు జిల్లా పని చూస్తూ ఉండేవారు. అంటే తొలుత నెల్లూరు పట్టణాన్ని దరిమిలా ఆజిల్లాను ఉఱ్ఱూతలూగించటం ప్రారంభించారు. 1953 వఱకు అక్కడ పని చేసిన తరువాత గుంటూరు, విజయవాడ, మచిలీపట్టణం, వరంగల్లు పట్టణాల్లో మాత్రమే సంఘపని చూస్తూ ఉండేవారు. మొత్తం మీద ఆంధ్రలో 1943-1955 మధ్య గట్టిగా పన్నెండు సంవత్సరాలు అహోరాత్రాలు పనిచేసిన ధీరుడు. అనంతరం మళ్ళీ కొన్ని పైచదువులు చదివి, ఉద్యోగంలో ప్రవేశించి, గృహస్థాశ్రమాన్ని స్వీకరించి అంతిమ శ్వాస విడిచే వఱకు సంఘకార్యంలోనే తపించిన ధన్యాత్ముడు.

శ్రీ దేశ్‌పాండేగారు రాకపూర్వం నెల్లూరులో 1942 జూన్/జూలైనెలల్లోనే మొట్ట

మొదటి సంఘ శాఖ ప్రారంభమైనది. డా॥ శేషగిరిరావు అనే వ్యక్తి అప్పుడక్కడొక ప్రముఖ కార్యకర్త. 1942 నవంబరు, డిసెంబరు నెలల్లో నెల్లూరుకు నాగపూర్ నుండి వచ్చిన తొలి ప్రచారక్ శ్రీ దినకర్‌రావ్‌జీ బుచే అనేవారు. ఆయన 1943 మే వఱకు మాత్రమే, అంటే ఐదారు నెలలు మాత్రమే ఉండగలిగారు. వారు వచ్చినప్పుడు నెల్లూరులో ఒకే ఒక సాయం శాఖ ఉండేది. వారి హయాంలో అది రెండు శాఖలైనది. వారు ఆ తరువాత చిరకాలం తమిళనాడులో ప్రచారక్‌గా పనిచేశారు. నెల్లూరు నుండి ఆయన వెళ్ళిపోయిన వెంటనే శ్రీదేశ్‌పాండేజీ విచ్చేశారు. కాలేజీలో విద్యార్థిగా ఉండటమనేది ఒక నెపం మాత్రమే. చదువు పేరుతో తోటి విద్యార్థుల్ని ఆకర్షిస్తూ సంఘశాఖల వైపు మళ్ళించటమే ప్రధానమైన లక్ష్యం.

నెల్లూరులో పైడా సుబ్బరామయ్య అనుపేరుగల ఒక మహనీయుడుండేవారు. అక్కడికి సంఘం ప్రవేశించకముందు. వారు హిందు మహాసభ అభిమానిగా ఉండేవారు. అది కారణంగా ఆ జిల్లాలో వీరసావర్కర్‌గారి ప్రభావం కొంత ఉండేది. పైపెచ్చు ఆ జిల్లాలో పొదిలి, కందుకూరు, ఉదయగిరి మొదలైనచోట్ల ముస్లిముల సంఖ్య కొంచెం ఎక్కువగానే ఉండేది. అంటే, భావాత్మకంగా హిందూజాతీయాభిమానం, ప్రతి క్రియాత్మకంగా ఇస్లాం వ్యతిరేక భావం కాస్తోకూస్తో ప్రజల్లో ఉన్న సమయమది. సరిగ్గా ఆసమయంలో దుమికిపడిన సింహకిశోరం శ్రీదేశ్‌పాండేజీ. వీరి వ్యక్తిత్వం, పరిస్థితుల అనుకూల్యం కలిసి వచ్చి జిల్లా అంతటా ఉత్సాహమైన సంఘ వాతావరణం నెలకొన్నది. రాపిడివల్ల రవ్వలు పుట్టించవచ్చు అన్న సామెతగా ఏదో ఒక సంఘర్షణను సృష్టించటం. ఒక అలజడిరేపటం, దాన్ని అనుకూలంగా మార్చుకొనటం, ఇదీ, దేశపాండేగారి కార్యసరళిలో ఉన్నకీలకం. వీరి ప్రభావం వల్ల ''తిన్నడి'' వంటి స్వయంసేవకులు సంఘ సిద్ధాంతంపై అచంచలమైన విశ్వాసంగలిగిన కార్యకర్తలు కోకొల్లలుగా బయలుదేరారు. శ్రీయుతులు కొచ్చి కృష్ణమూర్తి, ఇ.సి. రామమూర్తి, భీమారాథయ్య, పురుషోత్తమ రావు, యన్. రంగారావు టి. రామమూర్తి, యన్. రామమూర్తి, పరంధామరెడ్డి, రామరాఘవరెడ్డి, వేణుగోపాలరెడ్డి, వై.సి. రంగారెడ్డి, నరసయ్య మఱియు పి.సి.రమణయ్య వంటి మంచి కార్యకర్తలు. ఇందులో ఎక్కువమంది ప్రచారకులుగా వచ్చారు. దేశ్‌పాండేగారి ఉద్దండత, ఆవేశం వీరందరిలో ఎంత ఉండేదో దాదాపు ఆసమయంలోనే ఆజిల్లాలో పనిచేసిన శ్రీసోమయ్యగారి యొక్క స్తిమితత్వము, ఆలోచనగూడ వీరిలో అంతే మోతాదులో ఉండేది. ఈ రెండు లక్షణాల సమన్వయమే యీ కార్యకర్తలు. కాలాంతరంలో అక్కడి

నుండి తెలంగాణా జిల్లాలకువచ్చి అక్కడ సంఘకార్యవిస్తరణకు కృషి చేసినవారు. వీరిలో కొందరు కీర్తిశేషులైరి. మఱికొందరు చిరంజీవులై యుండుట మన అదృష్టం.

శ్రీ దేశ్‌పాండేజీ ఒక్క ముస్లిములతోనేగాదు, విజయవాడ ఖమ్మం పట్టణాల్లో కమ్యూనిష్టులను ఢీకొన్న సందర్భాలుగూడా ఉన్నాయి. 1948 జనవరి 30వ తేదీన గాంధీజీ హత్య జరిగింది. అప్పుడే విజయవాడలో హేమంతశిబిరం జరుగబోతున్నది. ఆ సందర్భంలో కమ్యూనిష్టులు శిబిరం మీద చేసిన దాడులు అమానుషంగా ఉండినవి. వాటిని యెదుర్కొనటంలో వారు చూపిన ఉద్దండత చారిత్రాత్మకం. గండ్ర గొడ్డలిధరించిన పరశురామునివలె విజృంభించి వాళ్ళను చెల్లాచెదరుచేసిన విధం అదొక అద్భుతమైన దృశ్యం. కమ్యూనిష్టులు వారిని పట్టుకొనిపోయి ఎక్కడో దాచిపెడితే, ఠాకూర్జీ, ఆత్రేజీ, బోను వేంకటేశ్వరరావు ప్రభృతులు వారిని విడిపించుకొని వచ్చిన విధం శివాజీ చరిత్రలోని యేదో ఒక ఘట్టాన్ని మనకళ్ళకు కట్టింపగలదు. తెలంగాణలో సంఘం విజృంభణంగా విస్తరిస్తున్నది. అది చూచి ఓర్వలేని కమ్యూనిస్టులు, దాదాపు రెండువందల మంది ఖమ్మం కార్యాలయంపై దాడులు చేశారు. అప్పుడు శ్రీ దేశ్‌పాండేగారు విజృంభించి వాళ్ళను తోకముడుచుకొనిపోయేటట్లు చేసిన దృశ్యం, రోకలినో, నాగలినో ధరించి శత్రువుల పీచమడంచిన బలాభిరాముడైన బలరాముణ్ణి తలపింపజేస్తుందని చెబితే అతిశయోక్తి కాదు. ఆసమయంలో అక్కడ ప్రచారక్‌గా ఉన్న శ్రీరామనరసింహ దండను ధరించి శత్రువులమీద ప్రహార్లను విసిరిన దృశ్యం స్ఫూర్తిదాయకం. అప్పుడు వరంగల్లులో ప్రచారకుగా పనిచేయుచుండిన శ్రీ కొమరువోలు నారాయణరావుగారు కమ్యూనిష్టులు వారిమీద క్రిమినల్ కేసులను వేయటంలోగాని, వారు వేసిన క్రిమినల్ కేసులను ఎదుర్కొనటంలోగాని చూపిన నేర్పుగూడ ఇక్కడ స్మరణీయం.

అన్యాయాన్ని చిన్నమంతగూడ ఓర్వని వ్యక్తి శ్రీదేశ్‌పాండే. కొందఱు రైలుపెట్టెలలో తామొక్కరే సీటును ఆక్రమించుకొని కూర్చుంటారు. స్త్రీలు, వృద్ధులు నిలబడి ఉన్నా సానుభూతి లేకుండా హాయిగా విశ్రమించటం తెలిసిన విషయమే. అది దేశ్‌పాండేగారు సహించేవారు కాదు. లెమ్మని మూడు సార్లు చెప్పేవారు. అప్పటికీ లేవకపోతే శాస్తి చేసేవారు. అందువల్ల ఆపెట్టెలో ఉన్నంతసేపూ ఆయన్ని దేవుడుగా చూసేవాళ్ళు తక్కిన ప్రయాణీకులు. చిత్రం దెబ్బలు తిన్నవాళ్ళుకూడా మిత్రులైపోవటం కద్దు! ''అదుగో, ఆపోతున్నాడే అతడు గూడూరు దగ్గఱ రైలు పెట్టెలో మనచేత తన్నులు తిన్నవాడే. ఇప్పుడు మంచి సంఘకార్యకర్త'' అని కాలాంతరంలో శ్రీ దేశ్‌పాండేజీ చెప్పిన కథలు కోకొల్లలు.

వారు ఆంధ్రకు ప్రచారక్‌గా రాబోవుముందు తండ్రిగారి దగ్గఱకు వెళ్ళి అనుమతిని వేడినారట! అప్పుడు తండ్రిగారు : ''నీవు ప్రచారక్‌గా వెళ్ళటానికి నా అభ్యంతరం లేదు. కానీ, నీది అసలే దుందుడుకు స్వభావం. నాకు పుత్రశోకం రాకుండా చూడు'' అన్నారట!

శ్రీదేశ్‌పాండేగారు సర్వతోముఖ ప్రజ్ఞాశాలి. శారీరక కార్యక్రమాల్లోగాని, బౌద్ధిక్ కార్యక్రమాల్లోగాని సమానమైనదిట్ట. ప్రారంభదశలో శాఖల్లో వారే దండ, ఛురిక, శూల, ఖడ్గ, మొదలైనవన్నీ నేర్పుతూ ఉండేవారు. చాలాకాలం వఱకు సంఘశిక్షావర్గలో వారు శిక్షక్‌గా వుండి యివన్నీ నేర్పుతూ ఉండేవారు. అంతేగాదు, పెద్ద పెద్ద కార్యక్రమాలకు వారే ముఖ్యశిక్షక్‌గా ఉండేవారు. 1946లో ఒంగోలులో జరిగిన ఐ.టి.సి. లో వారే ముఖ్య శిక్షక్ బాధ్యతను నిర్వహించారు.

సంఘపాటలు పాడటంలోగూడ వారిదొక ప్రత్యేకమైన శైలి. మంచిగళం. గాంభీర్యాన్ని, మాధుర్యాన్ని సమపాళ్ళల్లో రంగరించుకొన్న కమ్మని కంఠస్వరం. ''లే!నమస్తే, ఓ ఉపేక్షిత'' ''జాగ్ ఉఠాహై ఆజ్‌దేశ్‌కా వహసోయా అభిమాన్'' వంటి పాటలు పాడితే వారే పాడాలి అన్నంత సమ్మోహితం చేసేవిగా ఉండేవి. దేశపాండేగారు ప్రసాదించిన స్ఫూర్తివల్లనే కొందఱు స్వయంసేవకులు చాలా గొప్ప పాటలు వ్రాయగలిగారు. ''దివికేగిన మనదేశభక్తుల'' ''పదండి భరత యువకులారా!'' ''మాదేనోయ్! హిందుస్థాన్'' ''కరమునఖడ్గము, ఉరమున కవచము, ధరించిదాస్యముబాపుమురా!'' మొదలైనవి. పెన్నానదీతో యములను ఆస్వాదించిన నెల్లూరి కార్యకర్తల ఎదలు పొంగి ప్రవహించినవే! ఇదంతా శ్రీదేశ్‌పాండేగారి చలువే అనటం ఏపాటి మాట!

బౌద్ధికుల విషయంలో వారిదొక అపూర్వమైనశైలి. మరాటీ, హిందీ, ఇంగ్లీషు, తెలుగు భాషల్లో - నిత్యవ్యవహారంలో మాట్లాడడమేగాదు, అనర్గళధారా ప్రవాహంగా ఉపన్యసించే వారు. సంస్కృతంలో బౌద్ధికులు ఇచ్చే అవకాశం రానందున ఇవ్వలేదుగాని, లేకపోతే, అందులో గూడ అద్భుతంగా ప్రసంగింపగల పండితుడు. ఏభాషలో ఉపన్యసించినా, మామూలుగా సంభాషణలో మాట్లాడినా అంతటి బఱువైన శబ్దజాలాన్ని సరియైన అర్థంలో ఇంతకుమించిన మాటే మరొకటి లేదన్నట్లుగా ఎలా మాట్లాడగలిగేవారో ఆదేవుడికి తెలుసు. ఏభాషలో ఉపన్యసించినా తప్పకుండా ఒకటి రెండు సంస్కృతశ్లోకాల్ని ఉట్టంకిస్తూ ఉండేవారు. నిజమైన దేశభక్తులకు, కుహనాదేశభక్తులకు ఉన్న భేదాన్ని చెప్పటానికి ''కాకః కృష్ణః పికః కృష్ణః కోభేదః పికకాకయోః। వసంతకాలే సంప్రాప్తే, కాకః కాకః పికః పికః'' అన్న శ్లోకాన్ని తఱుచుగా ఉదహరిస్తూ ఉండేవారు. హృదయాల్ని గిలిగింతలు

పెట్టి కుతూహలాన్ని రేకెత్తించే కట్టుకథల వంటి విచిత్రాంశాల్ని బౌద్ధికుల్లోగాని, విడిగా కూర్చున్నప్పుడుగాని చెబుతూ ఉండేవారు. నానాసాహెబ్ 1859 సెప్టెంబర్ 24వ తేదీనాడు నేపాల్లో మరణించినట్లు మామూలుగా మనం వినే చరిత్ర. కాని వారు ''నానాసాహెబ్ ఆ విప్లవ జ్వాలల్లో మాడిపోకుండా ఎలాగో తప్పించుకొని బయటబడ్డాడనీ, నూట ఇరవై సంవత్సరాలు జీవించాడని, ప్రచ్ఛన్నంగా గుఱ్ఱంమీద సహ్యాపర్వత శ్రేణుల్లో మౌనంగా తిరుగుతూ ఉంటాడనీ, ఈవిధంగా మహారాష్ట్రలో జానపదులు నమ్ముతూ ఉంటారనీ, చెప్పి బహుశా సుభాష్‌చంద్రబోసు విషయం గూడా అంతేననీ ముగించేవారు.'' ఇటువంటి కథానకాలు హృదయానికి హత్తుకొని బాలస్వయంసేవకులకేగాదు, పెద్దవాళ్ళకుగూడా యెంతటి స్ఫూర్తిని ప్రసాదిస్తాయో యిట్టే ఊహింపవచ్చును. వారి బౌద్ధికులనండి, ఉపన్యాసాలనండి, అవి ఒక జలపాతంలా ఉండి, నాటకీయతను సంతరించుకొని మిక్కిలి కళాత్మకంగా ఉండేవనుట నిక్కము!

బొంగరమువలె గిరగిర తిరుగుచున్నట్లుండిన కుదిమట్టమైన విగ్రహము, లేత చామన చాయరంగు, గుండ్రని ముఖము, కొందమతుమ్మెదల వంటి మీసకట్టు, మధ్యపాపిటనుండి ఇరువంకలకు చక్కగా వ్రాలి అణగియున్న నల్లనికురుల క్రాపింగు, సైకిలు కట్టుధోవతి, సాధారణ మూగాకాలరుకలిగి మోచేతి వఱకు మడిచిన పొడుగుచేతుల చొక్కా (అప్పుడప్పుడూ లాల్చీ) మధురగంభీరమైన కంఠస్వరము, అంతలోనే ఉగ్రత్వము, మఱుక్షణమే చిఱునవ్వు. పాదరసమువలె చకచకా సాగిపోవునడక - ఇదీ, వారి ఉద్దండలీలాకృతి!

రాజాభావూ దేశపాండేగా అందరూ ఆప్యాయంగా పిలిచే శ్రీనీలకంఠ మోరేశ్వర్‌దేశ్‌పాండేజీ 25మే 1925లో వార్ధాలో జన్మించారు. కాని వారి స్వగ్రామం విదర్భలోని అమరావతీ జిల్లాయందలి ''మంగ్రూల్ దస్తగీర్''. అక్కడ వారికి ఇప్పటికీ కొద్దిపాటి స్థిరచరాస్తులున్నవి. తండ్రిపేరు మోరేశ్వర్ త్ర్యంబక్ దేశ్‌పాండే. తల్లి పేరు ఉమాబాయి. ఈమే దేశ్‌పాండేగారి బాల్యంలోనే గతించినది. తండ్రి మనదేశ్ పాండేగారు మరణించిన పిమ్మట మరణించారు. శ్రీదేశ్‌పాండేగారికి ఒక తమ్ముడున్నాడు. పేరు ప్రభాకర్. ముగ్గురు సోదరీమణులు. కమలాబాయి,సుశీలాబాయి, మందాకిని అనువారలు. చివరియిద్దరూ వితంతువులు. అందరూ ఇప్పుడూ ఉన్నారు. మనకథానాయకుడు 1937లో 7వ తరగతిలో అమరావతీ జిల్లా మొత్తానికి ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులైరి. 1943లో మెట్రిక్‌లో వార్ధాజిల్లాలో ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులైనవారిలో వీరొకరు. 1945లో ఇంటర్

పొసైనట్లు పూర్వోక్తం. 1955 డిసెంబరులో విజయవాడ కృష్ణలంకలో జరిగిన హేమంతశిబిరానికి పిమ్మట కొంచెమటూాయిటుగా వారు ప్రచారకుగా విరమించుకొని అమరావతికి వెళ్ళిపోయినారు. వాస్తవానికి వారు జీవితాంతం ప్రచారకుగానే ఉండిపోతారన్నది అందరియొక్క భావన. అట్టిది వారు గృహస్థాశ్రమమున ప్రవేశించటం మొదట్లోనమ్మశక్యంగా లేకుండెను. వారి శ్రీమతిగారిపేరు సులోచనాబాయి. 1957లో ఆంధ్రా యూనివర్శిటీనుండి బి.ఏలో ప్రైవేటుగా చదివి ఉత్తీర్ణులైరి. కొన్నాళ్ళు ఆంగ్ల వారపత్రిక ''ఆర్గనైజర్''లో పనిచేసిరి. దరిమిల 1959-60లో పంజాబు యూనివర్శిటీనుండి బి.యిడి. ట్రైనింగుచేసి భండారాజిల్లాలోని ''లాఖనీ'' పట్టణంలో సమర్థ- హైస్కూల్ (మైన్)లో ఇంగ్లీషు టీచరుగా పనిచేసిరి. అమరావతీ యవత్‌మాల్ జిల్లాలతో కూడిన అమరావతీ సంఘవిభాగ్‌కు 1978 వఱకు బౌద్ధిక్ ప్రముఖ్‌గా పనిచేసిరి. 1975 సెప్టెంబరు 8వ తేదీనాడు మీసాక్రింద అమరావతిలో అరెస్టుకాబడి అక్కడే జైలుశిక్షను అనుభవించిరి. వారు స్కూలు పని, సంఘపనీ యివే ప్రధానంగా పెట్టుకొని చివరివరకూ జీవించారు. సంఘబౌద్ధికులేకాక, పరివార క్షేత్రాలన్నింటిలో చివరికి జనసంఘం వేదిక మీద నుండి కూడా ఉపన్యాసాలు చెఱుగుతూ ఒక్కనిముషం, కూడా తీరికలేకుండా జీవించారు.

రాజాభావూ ఆంధ్రనుండి వెళ్ళిపోయిన పిమ్మట తానుగా మళ్ళీ ఆంధ్రకు రాలేదు. 1978 అక్టోబరులో స్వయంసేవకులకోరికపై నెల్లూరు వచ్చారు. అక్కడ సంఘానికి సొంతకార్యాలయం ఏర్పడింది. దాని ప్రారంభోత్సవానికి వీరిని రప్పించారు. విజయదశిమినాడు ప్రారంభోత్సవం జరిగింది. పాత స్వయంసేవకులను, కార్యకర్తలను కలుసుకొని యెంతో ఆనందించారు. ఆ ఆనందబాష్పధారలతో పెన్నానదీ ప్రవాహం ఇబ్బడిముబ్బడియై పరవళ్ళు తొక్కిందని చెబితే సహృదయులు ఊహించుకోవాలిగాని యెంతని వర్ణింపగలం. అందులో దేశ్‌పాండేజీ వంటి భావోద్వేగంగల వ్యక్తి విషయంలో! తిరిగి అమరావతికి పోతూ ''సంఘకార్యాన్ని మఱింతగా కొనసాగించండి అన్న సందేశాన్ని అందించి ప్రస్థానం సాగించారు. అప్పటికి కొంత అలసిపోయినట్లు కనిపించారు. అమరావతికి చేరుకొన్న పిమ్మట మూడురోజులకు అక్టోబర్ 16, 1978నాటి అర్ధరాత్రి 2గం॥లకు మహాప్రస్థానం జరిగింది.

ఆకుటుంబాన్ని ఓదార్చటానికి వెళ్ళిన స్వయంసేవకులతో వారి తండ్రిగారు: ''నాపుత్రుడు విడిచివెళ్ళిన పనిని కొనసాగించండి''అని యిచ్చిన సందేశం మిక్కిలి స్ఫూర్తి దాయకం! శ్రీదేశ్‌పాండే దంపతులకు ముగ్గురు కొడుకులు. సంజయ్, సురేష్, రాజేంద్ర

అనువారలు. ఒక కుమార్తె వసుంధర. అమరావతి వెళ్ళినప్పటినుండి వారు ఏ అద్దెయింట్లో నివసిస్తూ ఉండేవారో ఇప్పటికీ అదే యింట్లో ఉన్నంతలో గుట్టుచప్పుడుగా సుఖజీవనం చేస్తున్న ఆదర్శ కుటుంబమది. శ్రీ రాజాభావూగా పిలువబడిన శ్రీ నీలకంఠ మోరేశ్వర్ దేశ్‌పాండేగారు మఱపురాని మహనీయమూర్తి!

## శ్రీపాదగజానన్ సహస్ర భోజిని



శ్రీసహస్రభోజినిగారు 1951లో ప్రచారక్ బాధ్యతకు స్వస్తిచెప్పి ప్రభుత్వోద్యోగంలో ప్రవేశించారు. మహారాష్ట్ర ప్రభుత్వంలో ''అడిషనల్ చీఫ్‌డైరెక్టర్ ఆఫ్ ఇన్ఫర్‌మేషన్'' పదవి వఱకు చేరుకొన్నారు. 1983లో ఉద్యోగ విరమణచేశారు. వారు ఆ పదవిలో ఉండగా ఎప్పుడూ యెక్కువగా ముఖ్యమంత్రివెంట ఉండేవారు. ఓర్వలేని చాడీకోరులు కొందరు ముఖ్యమంత్రి దగ్గఱకు వెళ్ళి ''సహస్రభోజిని ఆర్.యస్.యస్ వాడు, అతనికి మరీ అంత ప్రాముఖ్యం ఇవ్వకండి'' అని చెవిలో ఊదారు. అప్పుడా ముఖ్యమంత్రి: ''అలాగా, అట్లా అయితే ఆర్.యస్.యస్. వారైనాసరే సహస్రభోజినీ వంటి సమర్థులు, నిజాయితీపరులు, చుఱుకైనవారు దొఱికితే మరొక యిద్దర్ని తీసుకొని రండి, వారి సేవలు ఉపయోగించుకొందాం'' అని యెంతో ఆనందాన్ని వ్యక్తం చేశారు ఆముఖ్యమంత్రి. ఇది గాలికబురుకాదు. ఆ ముఖ్యమంత్రి అన్న ఆమాటలు మరుసటిరోజు పత్రికలన్నింటిలోనూ ప్రచురింపబడినాయి. అది చదివి శ్రీ సహస్రభోజినీ స్వయంగా చాలా ఆశ్చర్యానందాలు పొందటం జరిగింది. ఇందుమూలంగా: సంఘస్వయంసేవకులు మంచి క్రమశిక్షణగలిగి, తాము ఏరంగంలో పనిచేసినా అక్కడి వారిని ప్రభావితం చెయ్యగలగాలి అన్న సందేశం మనకు లభిస్తున్నదని గ్రహింపవచ్చు.

శ్రీపాద గజానన్ సహస్రభోజిని 1925 అక్టోబర్ 12వ తేదీనాడు నాగపూర్‌లో జన్మించారు. తండ్రి పేరు గజానన్. తల్లిపేరు సరస్వతి. 1943లో మెట్రిక్ పరీక్షలో ఉత్తీర్ణులైనారు. పరీక్షలు వ్రాసి, ఫలితాలు వెల్లడి అయ్యేలోపల జబల్‌పూర్ దగ్గఱ ఒక చిన్న పట్టణంలో విస్తారక్‌గా పనిచేసివచ్చారు. అప్పుడు శ్రీ ఏకనాథ్‌జీ రానడేగారి

మార్గదర్శకత్వం లభించినట్లు ఆనందంతో చెప్పినప్పుడు వారి కళ్ళుచెమ్మగిల్లినాయి. మెట్రిక్ పూర్తి అయిపోయింది. వెంటనే ప్రచారక్‌గా వెళ్లాలన్నతహతహ పుట్టింది. అప్పటి సరిగ్గా పదిహేడు సంవత్సరాల వయస్సు. సరాసరి డా॥ హెడ్గేవార్‌భవ సంఘకార్యాలయానికి వెళ్లారు. అదృష్టంకొద్దీ అక్కడ ఒకేసారి శ్రీయుతు బాబాసాహబ్‌జీ ఆప్టే, భయ్యాజీ దాణీ, బాలాసాహెబ్‌జీదేవరస్ - ఈ ముగ్గురిదర్శన లభించింది. వారందరికీ తన కోరికను గూర్చి మనవిచేశారు. అంతే, వారిని ప్రచారక్ ఆంధ్రకు పంపటానికి నిర్ణయం జరిగింది. సహస్రభోజనిగారు ఇంటికివెళ్ళి ఈనిర్ణయాన్ని గూర్చి తల్లిదండ్రులకు తెలియజేశారు. అదృష్టవశాత్తు ఇంట్లో అంత సంఘమయ వాతావరణమే. అందుచేత వెంటనే అనుమతి లభించింది. కుటుంబంచాల పెద్దది. వీరంతా ఐదుగురు సోదరులు, నలుగురు సోదరీమణులు. అందరికంటె తాన చిన్న. అప్పటికే తండ్రిగారు ఎ.జి. ఆఫీసునుండి ఉద్యోగవిరమణచేశారు. ఈపరిస్థితిలో తనకు అనుమతి లభించటం వారికి మహదానందం కలిగించింది.

నిర్ణయానుసారం వారు నాగపూర్‌నుండి గ్రాండ్ ట్రంక్ ఎక్స్‌ప్రెస్‌లోపయనించి విజయవాడకు చేరుకున్నారు. అప్పుడక్కడ మాననీయ శ్రీపార్థీజీ ప్రాంతప్రచారక్. వారి దర్శనం చేసుకున్నారు. తొలుత కొన్నాళ్ళు బెజవాడలోనే ఉండటానికి నిర్ణయమైనది. సుప్రసిద్ధ హోమియో డాక్టర్, ప్రముఖ సంఘకార్యకర్త అయిన శ్రీరామమూర్తిగారి యింటిలో మకాం. ఆ కుటుంబసభ్యుల వాత్సల్యాభిమానాన్ని చూరగొంటూ కొన్ని నెలలు విజయవాడలోనే ఉండటం జరిగింది. ఆసమయంలోనే సుప్రసిద్ధ సంఘకార్యకర్త ప్రొఫెసర్ రాఘవాచారిగారితో సన్నిహిత సంబంధం ఏర్పడింది. తన ప్రచారక్ జీవితం ప్రారంభమైన వెంటనే యీ యిద్దరి మహనీయుల ఆశీస్సులు లభించటం అదృష్టంగా భావించిన వ్యక్తి శ్రీ సహస్రభోజిని. వారు కొంచెం ఆర్ద్రహృదయులు. పొంగివస్తున్న భావశబలతను ఆపుకోలేరు. దరిమిలా వారిని ప్రచారక్‌గా ఏలూరు పంపటం జరిగింది. అక్కడ అప్పటికే శ్రీబోను వేంకటేశ్వరరావుగారు శాఖను ప్రారంభించారు. గట్టిపునాదులు వేశారు. వారు తెలుగు హిందీభాషలలో మంచి వక్త. శ్రీశ్రీపాద్‌గారు ఏలూరులో మొదట్లో ఒక గుళ్ళో ఉంటుండేవారు. తలుపులు, తాళం ఏమీ లేకుండా తెరచి ఉండే గుడి అది. నాల్గైదు బట్టలు తప్ప తనదగ్గర యేమున్నాయి గనుక? పైగా దొంగలభయమంటూ లేని మహమంచి రోజులవి. పిమ్మట కొన్ని రోజులకు స్వయంసేవకులు, మిత్రులు అయిన శ్రీకేశవరావ్ పరంకుశరావ్ సోదరులు తనకు ఒక చిన్న గదిని యేర్పాటు చేశారు. శ్రీవల్లమస్నెటి నరసింహారావుగారి యింట్లో గూడా ఉంటూ ఉండేవారు. ఏలూరులో

జరిగిన సంఘకార్యవిస్తరణలో శ్రీయుతులు నారాయణరావు, లక్ష్మణరావు, సుందరం, నరసింహారావు, వైద్యులు శ్రీరాఘవాచారి, కేశవరావు, పరంకుశరావు (వీరిద్దరూ సోదరులు) పల్లారాధాకృష్ణ, నరసింహమూర్తి ప్రభృతులు బాగా సహకరించారు. ఒకటికి రెండుశాఖలైనాయి. కృష్ణాగోదావరీ నదుల మధ్యనున్న జిల్లా పశ్చిమగోదావరి. అక్కడ పంటలు బాగా పండేమాట నిజమే. కాని సంఘశాఖల దృష్ట్యా అంతసారవంతమైన నేలకాదు. అందువలన అక్కడ శాఖలు అనుకొన్నంతగా వికసించలేదు అన్నారు వారు చమత్కారంగా. (వారు మిక్కిలి హాస్యప్రియులు)

వారు ఏలూరు వెళ్ళిన తరువాత మొదటిసారి ఒక మంచి ఉత్సవం ఏర్పాటుచేశారు. అదొక సార్వజనికోత్సవం. వందమంది అతిథులు, యాభైమంది స్వయంసేవకులు హాజరైన కార్యక్రమమది. ''సంఘం మనస్సులను చేరదీసి కలుపుతుందిగాని, డబ్బును కూడబెట్టటంకాదు'' అప్పటి వఱకు మంచి ధ్వజం కూడాలేదు. అందరు కలిసి చిన్న చిన్న మొత్తాలు సేకరించి ఒక యెత్తైన మంచి ధ్వజం కొన్నారు. దాన్ని ప్రతిష్ఠించి, ప్రణామ్ చేశారు. తరువాత శాఖాకార్యక్రమాలు జరిగాయి. అప్పుడు అందరూ యెదలు పులకించి నట్లు ఆనందపడ్డారు. ఆతరువాత పట్టణంలో చక్కని సంఘవాతావరణం ఏర్పడింది.

ఏలూరుకు దగ్గఱలో ఒక కుగ్రామం ఉంది. అక్కడికి క్రైస్తవ మిషనరీలు వచ్చి తమ కార్యకలాపాలు సాగించటానికి కుట్ర పన్నుతున్నట్లు తెలిసింది. అది అడ్డుకొనటానికి ముందుగానే శ్రీ సహస్రభోజనీగారి నేతృత్వంలో అక్కడొక శాఖను నెలకొల్పటం జరిగింది. అది గట్టిపడేవరకు ప్రతిరోజు గణవేషధారులైన కొందరు స్వయంసేవకులు సైకిళ్ళమీద అక్కడికి వెళ్ళివచ్చేవారు. అదికూడ ఆ పరిసర ప్రాంతాల్లో మంచి సంఘ వాతావరణాన్ని ప్రోదిచేసింది. అక్కడ ప్రచారకుగా ఉన్నప్పుడే వారు ఇంటర్‌మీడియేట్‌కి ప్రైవేటుగా హాజరై ఉత్తీర్ణులైనారు. నాగపూర్‌నుండి తాను బెజవాడకు బయలుదేఱినప్పుడు చదువు ఆపివేయాల్సిన అవసరంలేదని, తీరిక సమయాల్లో చదువుకొని ప్రైవేటుగా పరీక్షలకు వెళ్ళవచ్చనీ, ఆవిధంగా విద్యాభివృద్ధిని సాధించాలని శ్రీబాలాసాహెబ్ దేవరస్ వారికి చెప్పటం జరిగింది. పరీక్షలప్పుడు వారినుండి పరిచయ పత్రాన్ని తీసుకొని ఇందోరు వెళ్ళి అక్కడ శ్రీదేశ్‌ముఖ్‌జీ అనువారి యింట్లో మూడువారాలుండి పరీక్షలు వ్రాసి ఉత్తీర్ణులైనారు. ఆ కుటుంబ సభ్యులు అంతకాలం తనను ఉంచుకొని వాత్సల్యాన్ని కురిపించటం చాలా గొప్ప విషయమనీ, అదంతా శ్రీబాలాసాహెబ్‌జీ చలవేనని మురిసి పోయారువారు. కార్యకర్తల అభివృద్ధికి శ్రీ బాలాసాహెబ్‌జీ ఎంత శ్రద్ధ తీసుకుంటారో

అన్నదానికి ఇది పరమోదాహరణంగా భావింపవచ్చు.

గుంటూరులో జరిగే ఒక సమావేశానికి అక్కడికి పదిమైళ్ళదూరంలో ఉన్న ఒ పల్లెటూరి నుండి కాలినడకతో వెళ్ళటానికి నిర్ణయించుకొని బయలుదేరారు శ్రీదత్తో బందిష్టే. సహస్ర భోజనీలు. కొంతదూరం వెళ్ళినతరువాత కుండపోతగా వర్షం కురి మార్గమంతా జలమయమైనది. మోకాటిబంటి నీళ్ళల్లో, కళ్ళకు వర్షపు చినుకు అడ్డమొస్తుంటే, పాములు తమమీదుగా దూకుతూ ప్రవాహంలో కొట్టుకుపోతూ ఉం అవి కఱవవు అని ఈదుకుంటూ, కొంత ఆలస్యమైనా గుంటూరు సమావేశాని హాజరైనారు.

1948లో సంఘంమీద మొదటిసారి నిషేధం మోపినప్పుడు శ్రీగురూజీ బేతుల్‌జైలులో నిర్బంధించటం జరిగింది. నిషేధం తొలగించిన తరువాత వారిని విడుద చేశారు. అప్పుడు నాగపూర్‌నుండి శ్రీఘటాటేగారి కారులో వారి కుమారులు శ్రీసహస్రభోజినిగారు భేతుల్‌కి బయలుదేరారు. బేతుల్ ఇంకా పదిమైళ్ళు ఉందనగా కార చెడిపోయింది. అవి ప్రయాణసౌకర్యాలు సరిగ్గా లేనిరోజులు. ఆరోడ్డు మీద వచ్చే పోయేబండ్లు ఏవీలేవు. ఏం చేయాలి? కారును డ్రైవర్నీ, శ్రీఘటాటేగారికుమారుణ్ణి అక్కడే వదిలేసి శ్రీ. సహస్రభోజినిగారు పదిమైళ్ళు పరుగెత్తుకొంటూ వెళ్ళి శ్రీగురూజీ సందర్శన భాగ్యం పొందారు. ఇది తన జీవితంలో గొప్ప చరిత్రాత్మక సంఘటన.

కులభేదాలకు, భాషాభేదాలకు, అతీతంగా సమస్త హిందూ సమాజం నాది, దీని సంఘటనకు నేను కృషిచేయాలి అన్న భావాన్ని ప్రతి హిందూ హృదయంలోను నింపటానికి సంఘం కృషిచేస్తున్నది. దీన్ని ఆచరణ సాధ్యం చేయటానికి కూడ ప్రయత్నిస్తున్నది. యాభైసంవత్సరాలకు పూర్వం విచ్ఛిన్నకర ధోరణులు దేశంలో నెలకొని ఉన్నాయి. కమ్యూనిష్టులు ఏభాషకు ఆ భాషగా ఒక ప్రత్యేక దేశంగా భావించే ధోరణికి వెళ్ళారు. సంఘస్వయంసేవకులు ఈదేశంలోని భాషలన్నీ తమ మాతృభాషలుగా భావిస్తారు. ఒక సందర్భంలో ఒక వ్యక్తి సహస్రభోజినీ దగ్గఱ '' మా తెలుగుతల్లికి మల్లెపూదండ'' అనే పాటపాడారు. అప్పుడక్కడున్న ఒకాయన శ్రీభోజినీతో వ్యంగ్యంగా తెలుగు మరాఠీ భాషలు భిన్నమైనవి అని అనటం జరిగింది. దానికి శ్రీ సహస్రభోజినీగారు నా మాతృభాషగూడ తెలుగే. మనదేశభాషలన్నీ నాకు మాతృభాషలే సుమా! అని చెప్పితాముకూడా ఆగీతాన్ని కంఠస్థం చేసి, స్వయంసేవకులతో కలిసి తఱచు పాడుతూ ఉండేవారు.

ఏలూరులో ఒక శాఖను రెండుశాఖలు చేశారు. రెండవశాఖ ముటికివాడలో పెట్టటం జరిగింది. వీళ్ళల్లోనుండి బయలుదేరిన కార్యకర్తలు ఆజిల్లాసంఘ వ్యాప్తికి కృషిచేశారు. ఏలూరు పట్టణమేగాకుండా భీమవరం, తాడేపల్లిగూడెం, నిడదవోలు మొదలైనచోట్ల గూడ వీరి హయాంలో సంఘకార్యాభివృద్ధి కొంత జరిగింది. వీరు హిందీ ఇంగ్లీషు భాషల్లోనేగాక తెలుగులో గూడ చిన్న చిన్న ఉపన్యాసాలు ఇస్తూ ఉండేవారు. వారి మొదటి తెలుగు బౌద్ధిక్ నిడదవోలులో జరిగింది. వారికి ఇప్పటికీ చాలా తెలుగు శబ్దాలు జ్ఞాపకం ఉన్నవి.

కంఠస్వరం మరీ అంత బాగాలేకున్నా, ఆనాడు వారు సంఘపాటలు పాడుతూ ఉండేవారు. ''పునాది రాళ్ళుగా ఉండటమే మాధ్యేయం, మామీద మందిర నిర్మాణం చేయండి'' అనే అర్థాలు ఇచ్చే హిందీ మరాఠీ పాటలుకొన్ని వారికి వచ్చు. చక్కని కళాత్మకమైన వక్తృత్వంగూడా వారిసొత్తు. వారి సంభాషణా విధానం చాలా ఆకర్షకంగా ఉంటుంది. లేత బంగారుఛాయలోనున్న అందమైన శరీరం, ముఖబింబంవారిది. స్వభావంకూడా సరళసుందరమైనది. సంఘకార్యం యొక్క సాఫల్యవైఫల్యాలు వ్యక్తిగత సంబంధాలు పెంచుకొనటం మీద ఆధారపడి ఉంటాయి అంటారువీరు. ఇది మిక్కిలి యధార్థం. ప్రచారక్‌గా రిటైర్ అయిన తరువాత, వారు ''హిందూస్థాన్ సమాచార్‌లోను, ''యుగధర్మ'' ''తరుణ్ భారత్'' వంటి హిందీ పత్రికలలోను, ''హితవాద'' వంటి ఆంగ్ల పత్రికలలోను పనిచేసిన పిమ్మట, మధ్యప్రదేశ్ మహారాష్ట్ర ప్రభుత్వాల ''ఇన్‌ఫర్‌మేషన్ డిపార్టుమెంటులో పెద్ద ఉద్యోగం చేసి రిటైరైనారు. వారిధర్మపత్ని శ్రీమతి సరళగారుకూడా టీచర్‌గా పనిచేసి రిటైరైనారు.

ఆంధ్రలోగాని అస్సాంలోగాని 1943-1951 వరకు దాదాపు ఎనిమిదేళ్ళు ప్రచారక్‌గా పనిచేశారు. ఆంధ్రలో 1943-46 వరకు ఉన్నారు. ఇప్పటికీ వారు యాక్టివ్ స్వయంసేవకు. 73 ఏళ్ళ వయస్సులో నిత్యోత్సాహిగా దర్శనమిచ్చేవారు ధన్యాత్ములు.

# శ్రీ అనంత్ మంజునాథ్ శీర్షికర్



వీరు 1943లో ప్రచారక్‌గా విజయవాడలో కొద్దికాలం మాత్రమే పనిచేశారు. అప్పటికక్కడ సంఘకార్యం చక్కగానే సాగిపోతున్నది. కాకపోతే కార్యకర్తలు ఎంతో కష్టపడాల్సివచ్చేది. బెజవాడలో కంటె గుంటూరులో సంఘకార్యంబాగా ఉండేది అన్నారు శ్రీ యాద్వాడ్కర్జీ బెజవాడలో కంటే తెనాలిలో సంఘకార్యం విజృంభణగా సాగుతూపోయింది అన్నారు శ్రీ బందిష్టేజీ. ఇద్దరూ విజయవాడలో సంఘానికి శ్రీకారం చుట్టి విస్తరణకు పరిశ్రమించినవారే. అక్కడ పనిచేసిన యెందరో కార్యకర్తలు, ప్రచారకులు చెప్పినదానిని బట్టి, అది విద్యాకేంద్రం కాకపోవటం, అనేక విదేశీసిద్ధాంతాలమీద మోజు ప్రబలంగా ఉండటం, అసలు విజయవాడ వాతావరణమే మిక్కిలి ఉష్ణంగా ఉండి, బైటనుండి వచ్చిన కార్యకర్తలపై తన ప్రభావం చూపి ఆరోగ్యానికి హానికలిగించటం, వంటివి కారణాలు. సంవత్సరంపొడుగునా చన్నీళ్ళుదప్ప అసలు వేణ్ణీళ్ళు స్నానం చేసే అవసరమే ఉండదు. అన్నాడొక ప్రచారక్. దీనికితోడు తుఫాను దెబ్బలకు తఱచుగా గురి అవుతూ రోజులతఱబడి జనజీవితం స్తంభించిపోవటం కూడ మరొక కారణం. ఇటువంటి పరిస్థితుల్లో తట్టుకొంటూ కొందరు పనిచేసి రాణించగా, కొందరు చేయలేక నిరాశపడటం! అట్లా నిరాశపడికూడ పనిచేసిన వాళ్ళు కొందఱుండగా, మనవల్లకాదు, అని వెళ్ళిపోయిన ప్రచారకులు ఒకరిద్దరున్నారు. అందులో శ్రీ అనంతమంజునాథ శీర్షికర్‌గారు ఒకరు.

ఒకసారి శ్రీ వెదురుపర్తి వేంకటరత్నంగారి యింటిలో ఒక సమావేశంపెడితే ఆ వెంకటరత్నంగారొక్కరే వచ్చారుగాని మరెవ్వరూ రాలేదు. దానికి శ్రీ అనంత శీర్షికర్‌గారు నిరాశపడి నాగపూర్ వెళ్ళిపోయారు. అది బెజవాడ ప్రజల దురదృష్టమని చెప్పకతప్పదు. చాలా సున్నితహృదయుల విషయంలో ఒక్కొక్క సారి యిట్లా జరగటంకద్దు. అయితే, ఆయన చాలా గట్టికార్యకర్త. నాగపూర్‌లో 1996 సెప్టెంబరులో మరణించేవఱకు నిష్ఠావంతుడైన కార్యకర్తగా చక్కగా పనిచేయటం జరిగింది.

శ్రీ అనంతశీర్షికర్‌గారు 1924 నవంబరు 9నాడు జన్మించారు. జన్మస్థానం ''ధూలియా'' జిల్లాలోని ''చాలీస్‌గావ్'' వీరి తండ్రిగారు డాక్టరు. ఉద్యోగరీత్యా బదిలీ అయి నాగపూర్ చేరుకొన్నారు. వీరు సోదరులు నలుగురు. మూడవవారు నాగపూర్ నగర సహకార్యవాహ్. శ్రీ అనంత శీర్షికర్ బి.ఏ.బి.టి. నాగపూర్ ధరమ్ పేట న్యూ ఇంగ్లీషు స్కూలులో హెడ్‌మాస్టరుగా పనిచేసి ఉద్యోగవిరమణచేశారు. వీరు విజయవాడకు ప్రచారక్‌గా వెళ్ళకపూర్వమే మూడు ఓ.టి.సిలు పూర్తిచేసిరి. తొలుత వీరు నాగపూర్ మోహితే శాఖకు వెళుతూ ఉండేవారు. నానా శీర్షికర్ పేరుతో ప్రఖ్యాతులు. వీరికి ఇద్దరు కుమారులు. సునీల్, సుబోధ్‌లు - ఇద్దరూ స్వయంసేవకులే. విశ్వహిందూపరిషత్, సంస్కార భారతి కార్యకర్తలు. ''లఘు ఉద్యోగభారతి''లో క్రియా శీలకార్యకర్తలు.

శ్రీ అనంత శీర్షికర్‌గారు నాగపూర్‌లో సంఘకార్యనిర్వహణతోబాటు, విభిన్న వ్యక్తులు మరణించినప్పుడు, అంతిమ యాత్ర, దహనసంస్కారాది కార్యక్రమాల్లో హాజరైసహాయకులుగా సేవచేసేవారు. వారు సర్వీసులో ఉండగా ఇంటి పనుల మీద సి.యల్. పెట్టినదిలేదు. ఆయా వ్యక్తుల మరణ సమయాల్లో మాత్రం ఆకుటుంబానికి సహాయపడటానికి తప్పకుండా సెలవుపెట్టేవారు. అంత్యేష్టి సంస్కారశాస్త్ర పద్ధతులు బాగా తెలిసినవారు. 1990లో భార్యా వియోగం జరిగింది. క్రుంగిపోయారు. ఆచింతతోనే 1996 సెప్టెంబరులో దివంగతులైనారు. స్వయంసేవకులు తమకు నచ్చిన విధంగా ఏదో ఒక సహాయ సేవాకార్యాలను చేపట్టాలని, తాను ఈ సేవాకార్యం స్వీకరించానని చెబుతూ ఉండేవారు. వారికిదే మన శ్రద్ధాంజలి.

# శ్రీ నాగనాథ బల్వంతరావ్ కాళే



1943, 44లో ఆంధ్రలో కొన్నాళ్లు విస్తారక్‌గా పనిచేసి, పిమ్మట ఒక సంవత్సరం నాగపూర్‌లో ఖాళీగా ఉండి, మళ్ళీ 1946లో తమిళనాడుకు ప్రచారకుగా వెళ్ళి 1953 వఱకు పనిచేసి, తిరిగి నాగపూరుకు వెళ్ళిపోయి జీవితంలో స్థిరపడి, డెబ్బైయేడేండ్ల వయస్సులో ఇప్పటికీ చుఱుకుగా ఉంటూ, స్వయంసేవకుగా సంఘంద్వారా హిందూ సమాజానికి తనవంతు సేవను చెల్లిస్తున్న మహనీయులు శ్రీ నాగనాథ బల్వంత్‌రావ్ కాళే.

శ్రీ కాళేజీ 1920 ఏప్రిల్ 8వ తేదీన వారణాసిలో జన్మించారు. అదివారి అభిజనం. మెట్రిక్యులేషన్ వఱకు అక్కడే చదువుకొన్నారు. దరిమిలా వారికుటుంబం నాగపూరుకు వచ్చి స్థిరపడింది. అక్కడ న్యాయశాస్త్రంలో బి.ఏ., యల్.యల్.బి. చేశారు. కాలేజీలో ఇంటరు చదువుకొనే రోజుల్లో నాగపూర్‌లో సంఘ సంపర్కంలోకి వచ్చి స్వయం సేవకులైనారు. వీరు ప్రవేశించిన తొలిశాఖ ఇత్వారీశాఖ. శ్రీ బాలాసాహెబ్‌జీ దేవరస్ అప్పుడాశాఖకు కార్యవాహ్‌గా ఉండేవారు. శ్రీ బచ్‌రాజ్‌జీ వ్యాస్ శిక్షకుగా ఉంటూ ఉండే వారు. 1938, 39, 40లో వరుసగా మూడు ఓ.టి.సీలు పూర్తిచేశారు. 1943-44లో ఆంధ్రకు విస్తారకుగా వచ్చి విజయనగరం, విశాఖ పట్టణాల్లోపనిచేసిరి. శ్రీ జె.వి.యస్. శాస్త్రి విజయనగరంలోను, శ్రీ పిళ్ళా రామారావ్‌విశాఖ పట్టణంలోనూ ప్రముఖ స్వయం సేవకులుగా ఉండిరి. ఈరెండు పట్టణాల నుండి ఆసంవత్సరం ముగ్గురు ఓ.టి.సి.కి వెళ్ళటం జరిగింది. బెల్గాంలో అది మొదటి ఓ.టి.సి. ఆ సమయంలో శ్రీ పార్థీజీ ప్రాంతప్రచారక్, అప్పుడొక సెలవు దినంనాడు విజయవాడలో ప్రౌఢస్వయంసేవకుల సమావేశం ఏర్పాటుచేయబడింది. దానికి అకోలాలో అడ్వకేట్‌గా ఉండి విదర్భ ప్రాంత సంఘచాలక్‌గా పనిచేస్తున్న శ్రీ బాబాసాహబ్ సహోనిగారువచ్చి బౌద్ధికునిచ్చారు.

దరిమిలా 1946-53 వఱకు మద్రాసులో ప్రచారకుగా ఉన్నారు. 1950లో ఉమ్మడి మద్రాసు రాష్ట్రస్వయంసేవకులకు నెల్లూరులో నిర్వహింపబడిన ఓ.టి.సిలో పాల్గొనిరి. శ్రీ శివరామ్‌జీ జోగ్లేకర్ నాయకత్వంలో మద్రాసునుండి ఏడెనిమిది మంది

స్వయంసేవకులను తీసుకొని ''సైకిల్ ట్రిప్పు''గా నెల్లూరుకు వెళ్ళటం జరిగింది. త్రోవలో గూడూరుదాకా రాగా అక్కడికి నెల్లూరు నుండి సైకిల్ మీద వెళ్ళిన శ్రీనీలకంఠమోరేశ్వర్ దేశపాండేగారు వారికి స్వాగతం చెప్పి తన వెంట నెల్లూరుకు తీసుకొనివెళ్ళారు. ఇది యెంతో ఉల్లాసంగా నడచిన ట్రిప్పు. సంఘంపై మొదటిసారి నిషేధం విధింపబడినప్పుడు వారు బాపూజీ మహాశబ్దేతో పాటు నెల్లూరుజైల్లో ఉన్నారు. ఆసందర్భంలో దినపత్రికల్లో యిలా ఒక వార్త వచ్చింది : ''ఒకానొక ఆర్.యస్.యస్ కార్యకర్త యింట్లో ''యోగచాప్'' అనబడే ఒకానొక వింత ఆయుధం దొఱికింది. దాన్ని ఉపయోగించే పద్ధతి పోలీసువారికి కూడా తెలియదు. ఆకార్యకర్తను ప్రభుత్వం అరెస్టుచేసింది'' అని. వారిని నిర్బంధం నుండి ప్రభుత్వం విడుదలచేసింది. నెల్లూరు నుండి మద్రాసు వఱకు ఇద్దరు పోలీసులు వెంటవచ్చారు. ఇంతలో వారికొక ఆదేశం జారీ అయింది. ''వారు మద్రాసులో ఉంటే శాంతికి భంగం కలుగుతుంది కాబట్టి తక్షణమే వారు మద్రాసునుండి వెళ్ళిపోవాలి'' అని. ఆ ఆదేశాన్ని వారు తిరస్కరించారు. నిన్ననేగదానన్ను బేషరతుగా విడుదల చేసింది. దారిపొడుగునా ఇద్దరు పోలీసులు నావెంట ఉన్నారుకదా. నావల్లయేవిధంగా శాంతికి భంగం కలిగిందో చెప్పండి'' అని గట్టిగా వాదించారు. రైలు బండి గంటసేపు ఆగిపోయింది. చివరికి చేసేది లేక శ్రీకాళేజీ ప్రథమతరగతి రైలుపెట్టెలో ప్రయాణించి నాగపూర్‌కి చేరుకొన్నారు. వారి వెంట ఇద్దరు పోలీసులుకూడా ఉండిరి.

సంఘం సత్యాగ్రహాన్ని ప్రారంభించింది. వీరు నాగపూర్ నుండి మద్రాసుకు తిరిగి వచ్చి సత్యాగ్రహంలో పాల్గొని మళ్ళీ జైలుకు వెళ్ళారు. ఈసారి మద్రాసుజైల్లో నిర్బంధించారు. అప్పుడు వారితోబాటు తాటికొండ వీరభద్రయ్యగారు, అమ్మనమంచి లక్ష్మీనారాయణగారు కూడా నిర్బంధింపబడ్డారు. ఇలా సంఘ ప్రచారక్ జీవితాన్ని గడిపి, విరమించుకొని నాగపూర్ చేరుకొన్నారు. అక్కడ న్యాయవాదవృత్తిని ప్రారంభించి 1990దాకా కొనసాగించారు.

శ్రీకాళేగారిది సంపన్నకుటుంబం. వారి తండ్రిగారికి డాక్టర్జీ, గురూజీలపై అభిమానం మెండు. వారిద్దరికీగూడ ఈ కుటుంబమంటేయెంతో ఆత్మీయత. గురూజీ వారణాసికి వెళ్ళినప్పుడు వీరింటిలోనే బసచేసిన సందర్భాలున్నాయి. శ్రీకాళేగారి సోదరులు, సోదరీమణులు అందరూ స్వయంసేవకులే. వారికుమారులు, కుమార్తెలుకూడా సంఘం అభిమానులే. వారి అన్నగార్లలో ఒకరు డా॥ సంపూర్ణానందకు పోటీగా జనసంఘ టిక్కెట్టుమీద ఉత్తరప్రదేశ్ అసెంబ్లీకి పోటీచేశారు. (వారి పేరు శ్రీదత్తాకాళే) వీరి

ఐదుగురు సోదరీమణులలో ఒకామె నాగపూర్ సంఘచాలకులైన శ్రీ యమ్.యన్.ఘటాటేగారి సతీమణి. శ్రీకాళేగారి సతీమణి శ్రీమతి పద్మావతిగారు మధ్యప్రదేశ్‌లోని బేతుల్ పట్టణ సంఘచాలకులై శ్రీయన్.యస్. దేశపాండేగారి పుత్రిక. సుప్రసిద్ధ కమ్యూనిష్టుపార్టీ నాయకుడు శ్రీయస్.ఏ.డాంగేగారి పుత్రిక రోజా. పైన పేర్కొనబడిన బేతుల్ సంఘచాలకులైన శ్రీయల్.యస్.దేశపాండేగారి కుమారుడు శ్రీభానుదేశపాండేని వివాహమాడినారు. ఈ విధంగా ఈ కుటుంబము ఎంతో ఉన్నతమైన కుటుంబము.

శ్రీ నాగనాథ్ కాళేజీ ఆంధ్రలో పనిచేసిన కాలం స్వల్పమే అయినా ఇక్కడి స్వయంసేవకుల్ని చాలా ప్రభావితం చేశారు. తమిళనాడు స్వయంసేవకులపై వీరి ప్రభావం అమితంగా ఉండినట్లు అప్పటి పాత స్వయంసేవకులు కొందరు చెప్పుచుందురు. తమిళనాడులో కుంభకోణం, తంజావూరు పట్టణప్రాంతాలలో ప్రచారకుగా పనిచేసిన శ్రీ అమ్మనమంచి లక్ష్మీనారాయణగారికి వీరిపై అమితమైన అభిమానం. శ్రీకాళేగారు నాగపూర్‌లో ప్రజలకుపయోగించే మంచి పనులుకొన్ని చేశారు. నాగపూర్ నాగరిక సహకారీ బ్యాంకు 1962లో వీరిచేత ప్రారంభింపబడిన సంస్థ. వివిధ స్థాయిల్లో బాధ్యతలు చేపట్టి, కొన్నాళ్ళు ఛైర్మన్‌గాకూడా పనిచేసి దాని సర్వతోముఖాభివృద్ధికి పనిచేసిన మహనీయులు. అభ్యంకర్‌నగర్‌లోని నూతన భారత్ విద్యాలయం వంటి పలువిద్యాసంస్థలలో కార్యనిర్వాహక సభ్యులు. ఇవన్నియు ఏదో వేడుక కొఱకు నెలకొల్పబడినవిగాక ఉన్నతమైన ఆశయాదర్శాలతో ప్రారంభింపబడి వర్ధిల్లుచున్న సంస్థలు.

వ్యక్తిచూడటానికి చాలా పొట్టిగా, నిరాడంబరంగా, సామాన్యుడుగా కనిపిస్తున్నా అఖండ ప్రజ్ఞాధురీణులు. నిరంతర సమాజసేవకులు. ఆదర్శ కార్యకర్త, నిష్ఠావంతుడైన స్వయంసేవకు. ఇప్పుడు 77 సం॥వయస్సులో నిత్యోత్సాహిగా దర్శనమిస్తున్న మహనీయులు. ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధులతో వర్ధిల్లుదురుగాక!

# శ్రీ దినకర్ రావ్ కేదార్



అది 1945 జూన్ నెల నాటి మాట. యవత్ మాల్ జిల్లాలో ''వణీ'' అనే పేరుగల చిన్న పట్టణ మొకటున్నది. అది యెందరో ప్రచారకుల్నీ, కార్యకర్తల్నీ యెగుమతి చేసినబస్తీ, అక్కడొక విశిష్టమైన సంఘ కుటుంబమున్నది. ఆయింటి యజమాని పోస్టల్ ఇన్స్‌పెక్టర్. నిష్ఠావంతుడైన స్వయంసేవకు. ప్రతిరోజు ప్రభాత్ శాఖకు వెల్ళుచుండెడివారు. వారి సతీమణి రాష్ట్ర సేవికా సమితిలో క్రియా శీల కార్యకర్త్రి. వారి పెద్ద కొడుకు బెంగాలులో ప్రచారకు. పరమపూజనీయ శ్రీ గురూజీ సర్ సంఘచాలక్ ఐన క్రొత్తల్లో చేసిన మొట్టమొదటి విడత పర్యటనలో వణీకి వచ్చినప్పుడు వారింటనే బసచేశారు. మాననీయ శ్రీ బాబాసాహెబ్ ఆప్టేజీ సంవత్సరానికొకసారి వణీకి వచ్చిపోతూ ఉండేవారు. అక్కడ వారి చెల్లెలు ప్రాథమిక పాఠశాలలో ఉపాధ్యాయురాలు. వితంతువు. ఆమెను చూసిపోవటానికి వస్తూ ఉండేవారు. వారు వచ్చినప్పుడల్లా యెల్లప్పుడూ గుర్తుండేటట్లుగా ఏదో ఒక గొప్ప విషయాన్ని గూర్చి చెబుతూ ఉండేవారు. డాక్టర్జీ మరణించారు. పదవరోజుకర్మ. పిండప్రదానం చేశారు. కాకి ముట్టుకోలేదు. వెంటనే అక్కడున్న వారందరూ దణ్ణంబెట్టుకొని డాక్టర్‌జీకి ఇలా విన్నవించారు : డాక్టర్జీ, నిశ్చింతగా ఉండండి. మీవారసులు గురూజీయే. వారే సర్‌సంఘచాలక్ వారి నేతృత్వంలో నిష్ఠతో పనిచేస్తాం అని. వెంటనే కాకి పిండాన్ని ముట్టుకున్నది. అందరూ ఆనందబాష్పాలు రాల్చారు.

ఇది ఒకసారి చెప్పిన మహావిషయం. వాస్తవానికి అప్పటికే గురూజీని సర్ సంఘచాలక్‌గా ప్రకటించారు. సందేహమేలేదు. ఒక వేళ ఎవరి మనస్సులోనైనా ఏమైనా ఉందేమో. అదికూడ నివృత్తి అయింది. ఆప్టేజీకి ఇటువంటి నమ్మకాలున్నాయి. అటువంటి కుటుంబంలో ఇటువంటి కథలు వింటూ స్ఫూర్తిని పొందుతూ మంచి స్వయంసేవకుడైనాడు ఆయింటి యజమాని రెండవకొడుకు. 1944నాటికే వరుసగా మూడు సంవత్సరాల ఓ.టి.సీలు చేసేశాడు 1945 జూన్ జూలై నాటికి మెట్రిక్‌లో ఉత్తీర్ణుడైనాడు. ఇంటర్ ఎక్కడ చదుదామా అని ఆలోచిస్తున్నాడు. ''వణీ''లో లేదు.

నాగపూర్‌లో కూడా ఇంటర్ సైన్సు కోర్సులున్నకాలేజీలేదు. ఆసందర్భంలో మళ్ళీ ఆప్టేజీ వచ్చారు. ఆకుఱ్ఱవాడుచాలా సన్నగా ఉండేవాడు అదిచూసి ఆప్టేజీ : ''నీవు చదవటానికి పంజాబు వెళ్ళు. అక్కడైతే కాస్త లావవుతావు. అని తమత్కారంగా సలహా ఇచ్చారు. అప్పుడాతడు ''నేను బెజవాడవెళ్తాను. అక్కడ శ్రీగోపాల్ ఠాకూర్జీ ప్రచారక్‌గా ఉన్నారు. ఆయన ఈవణీనుండి వెళ్ళిన వారే గదా'' అన్నాడు. ఆప్టేజీ సరేనన్నారు. అతడు 1945 జూన్ జూలైనెలల్లో బెజవాడ చేరుకున్నాడు. ఆతని పేరు శ్రీదినకర్‌రావ్‌జీకేదార్. కలకత్తాలో 1938-1944 వఱకు ప్రచారకుగా పనిచేసిన వారి అన్నగారు భాస్కర్‌జీకేదార్. నాగపూర్‌లో ''అణ్ణాజీ''గా ప్రఖ్యాతులు. ఇప్పటికీ దీర్ఘాయుష్యంతులై ఉన్నారు.

మన కథానాయకుడు శ్రీ దినకర్‌రావ్‌జీకేదార్ ఇప్పటి వయస్సు 73 సంవత్సరాలు. వారు 1945 జులైలో బెజవాడ చేరుకొన్నాడు. అంతకుముందు తాను బెజవాడ వస్తున్నట్లు ఠాకూర్జీకి జాబు వ్రాశారు. వారు ఆసమయంలో బందరులో ఉన్నందువల్ల అందుకోలేదు. వీరు స్టేషన్ నుండి జట్కా మీద యస్.ఆర్.ఆర్. కాలేజీకి వెళ్ళారు. ప్రిన్సిపాల్ శ్రీనివాసాచారిగారిని కలిశారు. వారు ఇంటర్‌లో సీటు ఇచ్చారు. అప్పుడే శ్రీ ముడుంబై రాఘవాచారి గారితో పరిచయమైనది. వారు వీరిని భోజనానికి తన యింటికి తీసుకొని వెళ్ళారు. తరువాత మద్దూరి శ్రీరామమూర్తిగారితో పరిచయమైనది. శ్రీబోను వెంకటేశ్వరరావుగారితో పరిచయమైనది. కొన్నాళ్ళు కార్యాలయంలో నివాసం. తరువాత గవర్నర్ పేటలో ఒక గది అద్దెకు తీసుకొని ఒక హోటల్ యజమానితో ప్రతి రోజు తనకు చపాతీలు మాత్రమే ఇచ్చే విధంగా ఒప్పందం చేసుకొని అక్కడ భోజనం. ప్రతిరోజు సత్యనారాయణపురం శాఖకు వెళ్ళటం. చదువుకంటె యెక్కువగా సంఘపనిచేయటం. ఇదీ వరుస. ఆయన పూర్తి సమయ ప్రచారక్‌కారు, బందిష్టేజీవలె, దేశపాండేజీవలె విద్యార్థి ప్రచారక్.

శ్రీ కేదార్జీ 1945 జులైనుండి 1947 జులై వఱకు రెండు సంవత్సరాలు మాత్రమే విజయవాడలో ఉన్నారు. ఆసమయంలో ఆరు ప్రభాత్ శాఖలు, ఆరు సాయంశాఖలు ఉండేవి. వారు రోజుకొకటీ రెండు శాఖల చొప్పున అన్ని శాఖలకు వెళ్ళుచుండేవారు. ప్రతి శాఖలోను సంఖ్యచాలా ఎక్కువగా ఉండేది. ఉత్సవాలన్నీ సత్యనారాణయణపురం శాఖలో జరుగుచుండేవి. అక్కడి మైదానం పెద్దది. 1946లో బెల్గాంలో జరిగిన ఓ.టి.సి.కి కృష్ణాజిల్లానుండి ప్రథమ ద్వితీయ వర్షలకు 40 మంది స్వయంసేవకులు వెళ్ళారు. అప్పుడు శ్రీ కేదార్జీ బెజవాడ నుండి శిక్షక్‌గా వెళ్ళారు. బెల్గాం ఓ.టి.సి.కి వెళ్లే తెలుగు

స్వయంసేవకులకు తఱచుగా అనారోగ్యం చేస్తూ ఉండేది. తాను వెళ్ళినప్పుడు కూడా అదే పరిస్థితి. అది శ్రీగురూజీ దృష్టికి వెళ్ళింది. దానికి వారు : ''ఆంధ్రస్వయంసేవకులు కారం ఎక్కువగా తింటారు. ఇక్కడ మీరు ఆహార పదార్థాల్లో కారం తక్కువగా వేస్తున్నారు. కాబోలు, వారికి ఆరోగ్యం సరిగా ఉండటం లేదు'' అని చమత్కరించినప్పుడు అందరూ తెలుగు వారితో సహా భళ్ళున నవ్వుకొన్నారట! బెజవాడలో 1947లో గురుదక్షిణ పద్దెనిమిది వేలు అయింది. గుంటూరులో అంతకంటె ఎక్కువ అయ్యింది. శ్రీగురూజీతోపాటు ఆబాజీ బెజవాడవచ్చినప్పుడల్లా అక్కడి వారికొక క్రొత్త హిందీపాట ఇచ్చిపోతూ ఉండేవారు. ఒకసారి ''అటల్‌జీ వ్రాసిన'' హిందూతనమన హిందూజీవన్ రగ్‌రగ్ హిందూమేరా పరిచయ్'' అన్న గీతం ఇచ్చిపోతే శాఖల్లో విపరీతంగా పాడుకుంటూ ఉండేవాళ్ళు. మద్దూరి శ్రీరామమూర్తిగారికి 24 గం॥ సంఘ పనితప్ప మరొకటి లేదు. బోను వేంకటేశ్వరరావుగారు వివాహితులైనా 24 గం॥ సంఘపనిలోనే మునుగుతూ కార్యాలయంలోనే ఉండేవారు. ఎక్కువగా ఇంటికి వెళ్లేవారు కాదు. హిందీలోను, తెలుగులోను గొప్పవక్త. చాలా ఆవేశంగా మాట్లాడేవారు. అటువంటి కార్యకర్తలు చాలా అరుదుగా ఉంటారు. అంటారు శ్రీకేదార్జీ. బెజవాడలో ప్రతి సంతవ్సరం ఒక బాలశిబిరం జరిగేది. ఆరోజుల్లో అక్కడ వారు సంఘానికి పెద్దదిక్కు. వారి యిల్లు స్వయంసేవకులకొక ఆకర్షణ కేంద్రం.

శ్రీ దేశ్‌పాండేగారి కోరికపై శ్రీకేదార్జీ సెలవులు వచ్చినప్పుడు రెండునెలలు చిత్తూరులో సంఘపనిచేశారు. తంజావూరునేలిన మహారాష్ట్ర ప్రభువు శ్రీశహాజీ రావుకాలంలో కొన్ని మహారాష్ట్ర కుటుంబాలు అక్కడ స్థిరపడినవి. చిత్తూరులోగూడ కొన్ని కుటుంబాలుండేవి. వీరుగాక నేపాల్‌నుండి వచ్చిన గూర్ఖా వారుకూడా చాలామంది ఉండేవాళ్ళు. వీళ్ళందరూ శాఖకు వస్తూ ఉండేవాళ్ళు. చేతికి వాళ్ళకుగాని, శ్రీకేదార్జీకిగాని గడియారాలు లేనందువల్ల ప్రభాత్‌శాఖలు నాలుగింటికే జరుగుతూ ఉండేవి. గూర్ఖా వారు గస్తీ చేసి, కొంత విసుగొచ్చి సమయం తెలియక, కేదార్జీని నిద్రలేపి శాఖకు తీసుకొని వెళ్ళేవాళ్ళు. గంటకుపైగా శాఖనడిచినా ఇంకా తెల్లవారేదికాదు. తరువాత తెలిసేది.। ఏనాలుగో నాలుగున్నరో అయ్యిందని. ఇలా రెండుమూడుసార్లయిన తరువాత ఒక్కొక్కప్పుడు కావాలనే ఆసమయంలో శాఖలునడుపుతూ ఉండేవాళ్ళు.

బెజవాడలో కమ్యూనిష్టులుగాని, క్రైస్తవులుగాని చాలా యెక్కువ. మూడంతస్థుల కమ్యూనిస్టుపార్టీ ఆఫీసుపైన నాల్గువైపులా మైకులు పెట్టి రాత్రి 12 గం॥దాకా

ఉపన్యాసాలిస్తుంటే ప్రజలు చచ్చేటట్లు వినాల్సివచ్చేది. అట్లాగే ప్రతి ఆదివారం కూడలి ప్రదేశాల్లో క్రైస్తవులు రెండు మూడు వందల సంఖ్యలో బయలుదేరి మత ప్రచారంచేస్తూ ఉంటే వచ్చే పోయే వాళ్ళు అదివినే దుఃస్థితి అక్కడుంది. ఇంతటి పటిష్టమైన కమ్యూనిష్టు క్రైస్తవ ఉద్యమాలు ఆంధ్రలోదప్ప మహారాష్ట్రలో లేవు. అటువంటి ఆంధ్రప్రాంతంలో శ్రీయుతులు బందిష్టే, దేశ్‌ముఖ్, ఠాకూర్జీ, దేశపాండే, పార్థీజీ, శ్రీబాపూరావ్‌జీ వంటి మహనీయులు సంఘపనిచేసి నెగ్గుకురావటం మామూలుమాటకాదు. అంటారు శ్రీకేదార్జీ.

వారు ఆంధ్రనుండి వెళ్ళిపోయిన తరువాత, బి.ఏ., ఎం.ఏ., ఎల్.ఎల్.బి. చేసి వణీలో వకీలుగా స్థిరపడ్డారు. ఆంధ్రప్రదేశ్‌నిగూర్చి బాగా ఆకళింపు జేసికొన్న వ్యక్తుల్లో వారొకరు. వారు ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధులతో విలసిల్లుదురుగాక.

## శ్రీమధుసూదన్ వామనమోఘే

1946 డిసెంబరు నెల రెండవ శనివారం మఱియు ఆదివారం - ఈరెండు రోజులలో



భీమవరంలో కృష్ణా పశ్చిమ గోదావరి జిల్లాల ప్రౌఢ స్వయంసేవకుల శిబిరం జరిగింది. దాదాపు ఎనిమిది వందలమంది పాల్గొన్నారు. యు.ల్.సి. యమ్ క్రైస్తవ సమిషనరీ హైస్కూలులో విడిది. త్యాగరాజ గానసభ ఆవరణలో భోజనవ్యవస్థ - ప్రాంత అధికారుల వసతి యేర్పాటు చేయబడింది. రెండవరోజున ప్రాంతంలోని ప్రచారకులందరి సమావేశంగూడ ఏర్పాటుచే బడింది. మొత్తం ప్రాంతంనుండి ముప్పది యారుమంది ప్రచారకులు హాజరైనారు. అదే సమావేశంలో అప్పటి వఱకు ప్రాంత ప్రచారకగా ఉన్న మాననీయ శ్రీ నరహరి బాలాజీ పార్థీజీ, నూతనంగా వచ్చిన మాననీయ శ్రీబాపూరావ్‌జీ మోఘేల (మధుసూదన్ వామనమోఘే) రాక గూడ జరిగింది. ఈ మార్పు ప్రకటన ప్రచారకుల సమావేశంలో చేయబడింది. ఆనాటి సాయంత్రం బహిరంగసభ జరిగింది. దానికి ఎ.డబ్ల్యు.జి.బి. కాలేజీ ప్రిన్సిపాల్ శ్రీపెద్దాడ

రామస్వామిగారు అధ్యక్షత వహించారు. యస్.ఆర్.ఆర్. అండ్ సి.వి.ఆర్. కాలేజీ లెక్చరర్ శ్రీముడుంబై రాఘవాచార్యులుగారు ప్రధానవక్త. అది నగర సంఘకార్యవాహ్‌గా శ్రీజి. సోమరాజుగారు, ప్రచారక్‌గా శ్రీకోసూరి వేంకటేశ్వరరావుగారు ఉన్నసమయం. బహిరంగ సభావేదికపై శ్రీ పార్థీజీ శ్రీబాపూరావ్‌జీలుకూడా ఆసీనులై ఉన్నారు. అది మొదలుకొని శ్రీబాపూరాజీ మోఘే మనకు రెండవ ప్రాంత ప్రచారకులైనారు.

శ్రీ బాపూరావ్‌జీ మోఘే 1916లో మధ్యప్రదేశ్‌లోని మందసోర్ జిల్లా యందలి ''భానుపురా'' పట్టణంలో జన్మించారు. తండ్రిపేరు వామన్‌పాండురంగ మోఘే. తల్లిపేరు అన్నపూర్ణ. తండ్రిగారు గవర్నమెంటు డాక్టరుగా పనిచేస్తూ ఉండేవారు. ఇందోరు దగ్గఱ ఒక గ్రామంలో పనిచేస్తున్న వీరు భానుపురాకి బదిలీయై వెళ్ళటం జరిగింది. అక్కడ శ్రీ బాపూరావ్‌జీ జన్మించారు. వీరి సోదరులు మొత్తం నలుగురు. అందరికంటె పెద్దవారు శ్రీమోరేశ్వర్ వామనమోఘే. వారు ఇప్పటికీ చిరంజీవులై ఇందోర్‌లోనే తమ స్వంత ఇంట్లో ఉంటున్నారు. రెవెన్యూ డిపార్ట్‌మెంట్‌లో డెప్యూటీ కలెక్టర్‌గా పదవీ విరమణ చేశారు. రెండవవారు శ్రీమనోహర్ వామనమోఘే. వీరు 1942 నుండి 1990దాకా పూర్తి ప్రచారక్‌గా కొంతకాలం గృహస్థ ప్రచారక్‌గా కొంతకాలం ఇందోరు, ఉజ్జయినీ మొదలగు ప్రాంతాల్లో పనిచేశారు. మొదటి నిషేధ సమయంలో వీరు మధ్యభారత్ ప్రాంతప్రచారక్. వీరు ఇప్పటికీ సజీవులే. మూడవవారు శ్రీబాపూరావ్‌జీ మోఘే. నాల్గవవారు శ్రీమార్కండ్‌మోఘే. యల్.యం.పి. చేసి రెండవ ప్రపంచయుద్ధ సమయంలో డాక్టరుగా వెళ్ళారు. వీరిది మంచి సంపన్నకుటుంబం.

శ్రీ బాపూరావ్‌జీమోఘే 1927లో మెట్రిక్‌లో ఉత్తీర్ణులైనారు. రెండుసంవత్సరాలు ఖాళీగా ఉన్నారు. పిమ్మట శ్రీహరివిష్ణువాకణ్‌కర్ వెంట బెనారస్ వెళ్ళారు. అక్కడ 1929లో ఇంటర్‌పాసైనారు. 1931లో బనారస్‌లో బి.యస్.సిలో ఉత్తీర్ణులైనారు. 1933లో లక్నోలో ఎం.ఎస్.సిలో ఉత్తీర్ణులైనారు. ఎం.ఎస్.సి. చదివేటప్పుడు సంఘస్వయంసేవక్ ఐనారు. భావూరావ్‌జీ దేవరస్ ప్రేరణతో ప్రచారకులైనారు. ఆతరువాత వారు కుటుంబవిషయం బొత్తిగా పట్టించుకోలేదు. అసలు ఇందోరు వెళ్ళి కుటుంబ సభ్యుల్ని చూడటం కూడా చాలా తక్కువ. ఇంట్లో ముద్దుగా బాపూరావ్ అనిపిలిచేవారు. అదేపేరు వెలుపలకూడ ప్రచారంలోకి వచ్చింది. జె.బి.కృపలానీ, సుచేతాకృపలానీలతో వీరికి మంచి సన్నిహిత సంబంధాలుండేవి. వారి ప్రభావం గూడ బాగా ఉండేది. శ్రీమదన్ మోహన్ మాలవీయ ప్రభావం చాలా యెక్కువగా ఉండేది. బాల్యం నుండీ వారికి హాకీ

అన్నా, క్యారమ్ అన్నా చాలా యిష్టంగా ఉండేది. మొదటినుండీ వారిది ప్రశాంతమైన స్వభావం. ప్రచారక్‌గా వెళ్ళటానికి పూర్వం వారికి ఉపన్యాసమిచ్చే అలవాటు బొత్తిగాలేదు. ఆతరువాతనే ఆకళ అబ్బింది.

పిత్రార్జితం ఆస్తిని పంచుకొనేటప్పుడు తక్కిన సోదరులు బాపూరావ్‌జీని కూడా రమ్మనిపిలవటం జరిగింది. కాని వారు తనకు చిల్లగవ్వకూడా అవసరంలేదని, తన భాగం కూడా సోదరులకేవిడిచి పెట్టినవ్యక్తి. ఐతే సోదరుల బలవంతంమీద కొలది రొక్కాన్ని తీసుకొని, జాగృతి ప్రకాశన్ ట్రస్టుకు మూలధనంగా సమర్పించిన నిర్మోహి వీరు. వారిని బాల్యం నుండి పట్టుకొని పీడించిన జబ్బు ''డిసెంట్రీ'' అందువల్ల మిగతా ఆహారం కంటె మజ్జిగ త్రాగటం బాగా అలవాటు. ఢిల్లీలో వారికి మంచి వైద్యం కుదిరింది. అందువల్లనే వారు ఢిల్లీలో ఉండేవారు. వారు తెలుగు నేర్చుకుంటూ ఉండేవారు. వారు చదివిన కొన్ని తెలుగు ''రీడర్సు'' ఇప్పటికీ వారి పెద్దన్నగారు శ్రీ మోరేశ్వర్ యింట్లో ఉన్నాయి. ''సంఘస్వయంసేవకు అయినప్పటి నుండే మా తమ్ముడికి సర్వశక్తులు ఆవహించినయ్'' అన్నారు వారి పెద్దన్నగారు. ''వాడి చిన్ననాటి ఫోటో ఒకే ఒకటి నాదగ్గఱ ఉన్నది. అది మీకిస్తే యెట్లా'' అన్నారు కంటతడి పెట్టుకుంటూ.

శ్రీ బాపూరావ్‌జీ సరిగ్గా ముప్పై యేళ్ళ వయస్సులో ఆంధ్రకు ప్రాంతప్రచారకులుగా వచ్చారు. అంతకుపూర్వం ఉత్తరప్రదేశ్‌లో ప్రచారక్‌గాను, కొన్ని జిల్లాలకు కలిపి సహ ప్రాంత ప్రచారకుగాను పనిచేస్తూ ఉండేవారు. వారు ఆంధ్రకు వచ్చిన ఒక్క సంవత్సరంలోపుగానే సంఘం మీద మొదటి నిషేధం విధింపబడింది. ఈ సంవత్సరంలో వారు ప్రాంతమంతటా పర్యటించి ఒక అవగాహనకు రాగలిగారు. ఇక్కడ ఆంధ్రమహారాష్ట్ర భేదాలు సద్దుమణిగీ మణుగకముందే వారు రావటం జరిగింది. వచ్చిన క్రొత్తల్లో ఈ పర్యటన చేసేటప్పుడు వారి చేతిలో ఒక బెత్తం ఉండేది. అది యు.పి.లోగూడ ఉండేది. అయితే అది పట్టుకొని యిక్కడ పర్యటిస్తూ ఉంటే: ''జాగ్రత్త! ఎటువంటి భేదాలు లేకుండా మామూలుగా సంఘకార్యం నిర్వహించండి! లేకపోతే నా.... ఇదిగో బెత్తం'' అని హెచ్చరిస్తూ ఉన్నట్లుండేదని ఆనాటి జ్యేష్ఠ స్వయంసేవకులు, కార్యకర్తలు సరదాగా అనటం కద్దు. మొత్తంమీద ఆసంవత్సరమంతా వారు సుడిగాలిలాగా పర్యటించి ఒక నూతనోత్తేజం కలిగించారు. దానివల్ల సంఘ శాఖలు మళ్ళీ ఊపందుకొని విపరీతంగా పెరిగిపోయినవి. 1947 ఆగస్టులో స్వాతంత్ర్యం వచ్చింది. దేశం విభజింపబడింది. తండోపతండాలుగా కాందిశీకులు పాకిస్థాన్‌నుండి రావటం మొదలుపెట్టారు. దేశంలోని ప్రజలు, ముఖ్యంగా

యువకులు కళ్ళు తెఱిచారు. సంఘసిద్ధాంతమే శరణ్యమనుకొన్నారు. సంఘశాఖలు స్వయంసేవకులతో నిండిపోతున్నాయి. కమ్యూనిష్టులకు కళ్ళుకుడుతున్నాయి. అవకాశం కోసం ఎదురుచూస్తున్నారు.

1948 జనవరి 31 ఫిబ్రవరి 1,2 తారీఖుల్లో విజయవాడలో పదివేలమంది స్వయంసేవకులతో పెద్ద శిబిరం ఏర్పాటు చేయబడింది. యస్. ఆర్. ఆర్ అండ్ సి. వి. ఆర్. కాలేజీ ప్రాంగణం శిబిర స్థలం. 30వ తేదీకల్లా దాదాపు ఆరువేల మంది స్వయంసేవకులు వచ్చేశారు. ఇంకొక నాలుగైదువేలమంది మార్గమధ్యంలో ఉన్నారు. ఇంతలోనే 30వ తేదీ సాయంత్రం గాంధీగారి హత్యనుగూర్చిన ప్రకటన రేడియోలో ప్రకటింపబడింది. ఇది అవకాశంగా తీసికొని కమ్యూనిష్టులు 31వ తేదీనాడు శిబిరం మీద దాడిచేశారు. శ్రీగోపాల్‌రావ్ ఠాకూర్, శ్రీనీలకంఠ మోరేశ్వర్‌దేశ్‌పాండే, అప్పుడు విజయవాడలో ప్రచారక్‌గా ఉంటున్న వినాయక్ శంకర అత్రేల నాయకత్వంలో సంఘ స్వయంసేవకులు కమ్యూనిష్టులపై ఎదురుదాడులు సలిపి వాళ్ళ పీచమణచటం జరిగింది. మద్రాసులో ఉన్న గురూజీ విజయవాడరాకుండా నాగపూర్ వెళ్ళిపోయారు. ప్రభుత్వం గాంధీజీని చంపింది ఆర్. యస్. యస్. వారే అనే అభియోగం (అభాండం వేసి) మోపి ఫిబ్రవరి నాల్గవ తేదీనుండి 1949 జూలై పదకొండవ తేదీవఱకు సంఘాన్ని నిషేధించింది.

ఈ సమయంలో బాపూరావ్‌జీ నిర్వహించిన పాత్ర అమోఘమైనది. వారు ఎంతోస్తిమితంగా చాకచక్యంగా దీన్ని తట్టుకొంటూ సంఘయంత్రాంగాన్ని నడిపించటం జరిగింది. శిబిరంలో ఉన్న స్వయంసేవకుల్ని జాగ్రత్తగా తమ తమ ఊళ్ళకు పంపించే ప్రయత్నం చేశారు. నిషేధసమయంలో వారిని ఆంధ్ర ప్రాంతం విడిచిపెట్టి వెళ్ళమని ప్రభుత్వం ఆదేశించింది. కాని వారు ప్రచ్ఛన్నంగా తిరుగుతూ ప్రచారకులకు, కార్యకర్తలకు మార్గనిర్దేశం చేస్తూ ఉండేవారు. మొత్తంమీద సంఘస్వయంసేవకులు చేసిన సత్యాగ్రహ ఫలితంగా సంఘంపై నిషేధం తొలగింపబడింది. విజయవాడలో జరిగిన యీ శిబిరానికి దేశంలోని మొత్తం సంఘచరిత్రలోనే ప్రధానమైన స్థానమున్నది. సరిగ్గా, ఇక్కడ శిబిరం జరుగుతున్నప్పుడే గాంధీజీ హత్య జరిగింది. అది సంఘానికి అంటగట్టి కమ్యూనిష్టులు, ప్రభుత్వమూచేసిన కుట్రఫలించింది. ఆనాలుగైదు రోజులు ఈ భీషణ వాతావరణాన్ని యెదుర్కొనే గడ్డుసమస్య యింకా సంవత్సరంకూడా తిరగకుండానే, దాదాపు క్రొత్తగా వచ్చిన బాపూరావ్‌జీపైబడింది. వారి వయస్సుగూడ ముప్పైయేళ్ళే. అయినా వారు దీన్ని నిభాయించారు. సంఘంపై నిషేధం తొలగింపబడింది. చెదిరిపోయిన సంఘశాఖల్ని మళ్ళీ

కుదురుపడచే బాధ్యత స్వయంసేవకులపైబడింది. అది బాపూరావ్‌జీ నేతృత్వం దిగ్విజయంగా జరిగింది.

వారి హయాంలో సంఘశాఖల పునరుజ్జీవనం చాలా బాగా జరిగింది. జిల్లాల తాలూకాలు దాటి, అనేక గ్రామాలకుగూడ శాఖలు విస్తరించినవి. ఎందరో క్రొ ప్రచారకులు, విస్తారకులు వచ్చారు. ఏప్రాంతానికాప్రాంతంగా విడివిడిగా ఓ.టి.సి ప్రారంభమైనాయి. 1952 మేలో ఆంధ్రప్రాంతం మొదటి ఓ.టి.సి మళ్ళీ విజయవాడలో యస్.ఆర్.ఆర్. అండ్ సి.వి.ఆర్. కాలేజీలోనే జరిగింది. దానికి మంచి సంఖ్య స్వయంసేవకులు వచ్చారు. జిల్లా స్థాయిలో తాలూకా స్థాయిలో యంత్రాంగ పటిష్ఠపఱచటం జరిగింది. సాధ్యమైనన్ని యెక్కువ గ్రామాల్లో సాప్తాహిక్ శాఖలు నడి ప్రణాళిక రూపొందించబడింది. ఇలా ఉండగా బాపూరావ్‌జీతో వ్యక్తిగతంగా పేచీబడి కొందఱు 1953లో గుంటూరుజిల్లాలో, ముఖ్యంగా తెనాలి ప్రాంతంలో సంఘం నుం వెళ్ళిపోవటమేగాక కొంత హానికూడ కలిగించారు. దాన్ని గూడా ఎంతో చాకచక్యం తట్టుకొని నిలబడ్డారు బాపూరావ్‌జీ.

ఒక శాఖల విస్తరణ మాత్రమేగాదు, ఇతర విధాలుగా కూడా సంఘసిద్ధాంతాన్ని ప్రచార చేయటానికి ఎన్నో ప్రణాళికలు రూపొందించారు వారు. వాటిని సక్రమంగ నిర్వహించటానికి సరియైన వ్యక్తుల్ని యెంపికచేసి బాధ్యతలు అప్పగించారు. వా ప్రేరణతోనే 1947లో జాగృతి వారపత్రిక ప్రారంభమైనది. దానికి సంపాదకులుగా మొదట్లో శ్రీ బుద్ధవరపు వేంకటరత్నంగారిని, తరువాత శ్రీ తూములూరి లక్ష్మీనారాయణగారిని నియమించారు. 1954లో వారి ప్రోత్సాహంతోనే ''భారతీయ రచయితల సమితి'' ఏర్పడింది. దానికి పీఠాధిపతిగా శ్రీ భండారు సదాశివరావుగార్ని యెంపికచేశారు. అదే 1974లో జాతీయ సాహిత్య పరిషత్తుగా రూపాంతరంచెందివారి ఆధ్వర్యంలోనే నడుస్తున్నది. ''జాగృతి ప్రచురణలు'' పేరుతో హిందూ సంస్కృతిని ప్రోదిచేసే మంచి మంచి పుస్తకాలను ప్రచురింపజేశారు. ''సాహిత్యనికేతన్''పేరుతో ఒక గ్రంథ విక్రయశాలను నెలకొల్పారు. ''భారతీయ విద్యాకేంద్రం'' పేరుతో విశాఖపట్నంలో ఒక విద్యాసంస్థను నెలకొల్పిదానికి శ్రీ పిళ్ళారామారావుగారిని మూల విరాట్టుగా నియమించారు. ''భారతముద్రణాలయం'' పేరుతో ఒక ప్రెస్సును నెలకొల్పి దాని బాధ్యతలు శ్రీ గొట్టుముక్కల సోమరాజుగారి భుజస్కంధాలపై నిలిపారు. ఒక భారత ముద్రణాలయందప్ప తక్కిన వ్యవస్థలన్నీ మూడు పూవులు ఆరుకాయలుగా ఇప్పటికీ

నిలిసిల్లుతూనే ఉన్నాయి. ఎన్నో ఆటుపోటుల్ని యెదుర్కొంటూ, ఇవన్నీ ఆపది పన్నెండు సంవత్సరాలలోనే చేయగల్గటం ఒక్క బాపూరావ్‌జీకే చెల్లింది!

1956 నవంబరు 1నాడు ఆంధ్రప్రదేశ్ ఏర్పడింది. కాని సంఘదృష్ట్యా ఆంధ్రప్రదేశ్ 1953 నుండే యేర్పడింది. అప్పటినుండి శ్రీబాపూరావ్‌జీ ఆంధ్రప్రదేశ్ ప్రాంతప్రచారకులైనారు. తెలంగాణాలో సంఘకార్యవిస్తరణకు ఎందరో ప్రచారకుల్ని, కార్యకర్తల్ని పంపటం జరిగింది. శ్రీ కొమరువోలు నారాయణరావుగార్ని హైదరాబాదు నగరానికి, కొంతకాలం తరువాత వరంగల్లుకు పంపారు. హిందూస్థాన్ సమాచార్‌ని పర్యవేక్షించటానికి శ్రీ చిలుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు హైదరాబాదు చేరుకొన్నారు. నల్లగొండ జిల్లాకు శ్రీ రాఘవులుగార్ని పంపటం జరిగింది. (ఇప్పుడు విశ్వహిందూ పరిషత్తును చూస్తున్న రాఘవులుకాదు. వారు బందరుకు చెందిన మరొక రాఘవులు.) శ్రీ కొచ్చి కృష్ణమూర్తిని వరంగల్లుకు పంపారు. శ్రీ రేవాకోటేశ్వరరావుని సూర్యాపేటకు పంపించారు. ఇవి మచ్చుకు మాత్రమే కొన్ని పేర్లు. 1955 డిసెంబరులో మొత్తం ఆంధ్రప్రదేశ్‌కి కలిపి బెడవాడలో కృష్ణలంకలో నిర్వహించిన పూర్తి గణవేషధారీ స్వయంసేవకుల శిబిరం మిక్కిలి చరిత్రాత్మకమైనది. ఆంధ్ర తెలంగాణా స్వయంసేవకుల్ని భారీయెత్తున కలుపుతూ మంచి భావసమైక్యతకు గుఱుతుగా నిలిచి పోయే శిబిరమది. దాని నిర్వహణ ఎంత కష్టభూయిష్టమైనదో భగవంతుడికి బాపూరావ్‌జీకి మాత్రమే తెలుసు.

శ్రీ బాపూరావ్‌జీ బౌద్ధికులు ఒక అపూర్వమైన ప్రత్యేక నమూనాకు చెందినవి. మేధావిలసనం, విశిష్ట విశ్లేషణ, లలితమనోహరమైన భాష, ఒక్కొక్క అంశానికి ఒక్కొక్క పేరాగ్రాఫుగా అమర్చినపొందిక. ఒక్క అక్షరంకూడా పొల్లులేకుండా, ఒక్క అంశంకూడా అనవసరమనిపించకుండా, చెప్పిన ఉపన్యాసం వ్యాసంగాను, వ్రాసిన వ్యాసం ఉపన్యాసంగాను ఉండేటట్లు, గుండెలకు హత్తుకునేటట్లుగా ఉండేవి. వారి బౌద్ధికుల బాణీని గమనించిన వారికి పింగళి సూరన్న ''ప్రభావతీ ప్రద్యుమ్నంలో'' వ్రాసిన యీ క్రింది పద్యం తప్పక స్ఫురింపగలదు :-

సీ॥ *శబ్దసంస్కారమెచ్చటను జాఱగనీక, పదమైత్రి యర్థసంపదలఁబొదల*
*తలపెల్లనక్లిష్ట తను బ్రదీపితముగాఁ, బునరుక్తి దోషంబు పొంతఁబోక*
*ఆకాంక్షిత స్ఫూర్తి యాచరించుచును, శాఖా చంక్రమక్రియఁ గడవజనక*
*ప్రకృతార్థభావంబు పాదుకోనదుకుచు, నుపపత్తియెందునత్యూర్జితముగ*

గీ॥ నొకట పూర్వోత్తర విరోధమొందకుండc దత్తదవయవ వాక్యతాత్పర్యభేద
ములు మహావాక్య తాత్పర్యమునకు నొనరcబలుక
నేర్చుట బహుతపః ఫలముగాదే!

శ్రీ బాపూరావ్‌జీ దూరం నుంచి చూస్తే సముద్రంవలె గంభీరుడుగాను, దగ్గరికి వెళ్ళి మాట్లాడటం మొదలుపెడితే గంగానదివలె పవిత్రంగాను కనిపించేవారు. చొరవతీసుకొని సమీపిస్తే ప్రతి సమస్యకు అతి సరళంగా ఆచరణ సాధ్యంగా పరిష్కారం సూచించేవారు. ప్రశాంత రమణీయంగా, మృదులంగా మాట్లాడేవారు. ప్రతిరోజు తమ బట్టలు తామే ఉతుక్కొని ధరించేవారు. పదార్వన్నె పసిడిమేని-కాంతి, సమచతుస్రాకృతిగా కనిపిస్తున్నట్లున్న సుప్రభాతసుందర శతపత్రం వంటి ముఖబింబము, కాటుక కన్నులో అన్నట్లున్న ఆకర్షణీయములైన నేత్రాంచలములు, కొదమ తుమ్మెదరెక్కల వంటి మీసములు, అంతవత్తుగాను, అంతపల్చగాను కాకుండా మధ్యస్థంగా ఉన్న నల్లని క్రాపింగు, ఒంటిపేటగాకాక, రెండుపేటలుగా ఉన్నవో అన్నట్లు కాన్పించే తెల్లని అందమైన పలువరుస, కుదిమట్టంగాను పొట్టిగాను ఉన్న విగ్రహము. ఇదీ వారి మూర్తిమత్త్వము.

ఆయన అసాధారణమేధావి, మంచిరచయిత, గొప్ప ప్రణాళికావేత్త, సంఘటనా కార్యకర్త. అందరికీ తలలోనినాల్క, ఆంధ్రప్రదేశ్‌కి భగవత్ప్రసాదుడుగా వచ్చిన మహామహుడు. వారు ఆంధ్రప్రాంతం నుండి వెళ్ళిపోతూ ప్రాంతప్రచారక్ బాధ్యతను శ్రీ సోమయ్యగార్కి అప్పగించి వెళ్ళారు.

1959వఱకు ఆంధ్రప్రదేశ్ ప్రాంత ప్రచారకులుగా పనిచేసినవారు 26.1.1994న దివంగతులైనారు. వారికిదే తెలుగు ప్రజల భక్త్యంజలి.

# శ్రీ వినాయక్ శంకర ఆత్రే



అది 1953 మే - జూన్‌నెల. విజయవాడ యస్.ఆర్.ఆర్. అండ్ సి.వి.ఆర్. కాలేజీ ప్రాంగణంలో ఓ.టి.సి సమారోప్ ఉత్సవం. శ్రీనారాయణ్‌రావ్‌జీ భట్వాడేకర్ తన లలిత మధుర కంఠస్వరంతో ''పవిత్ర జాహ్నవీ రోక్ సకాకోయీ, జాకర్ మిలీ వేసాగర్‌మే, ఇస్ పుణ్యకార్యకోరోక సకే కోయీ అంతిమ విజయీ ఇస్ జగమే'' అని పాడినప్పుడు ప్రకృతి పులకించిపోయింది అని చెబితే అతిశయోక్తికాదు. ఈ పాట ఎవరు వ్రాసిందీ అన్న ప్రశ్న అప్పటికప్పుడు తలయెత్తింది. సమాధానం వెంటనే దొరకలేదు. కాలక్రమంలో దొరికింది. అది శ్రీ వినాయకశంకర్ ఆత్రే వ్రాసిన పాట! ఎప్పుడు? ఎక్కడ వ్రాశారు? అన్నది మరొక ప్రశ్న? దానికి సమాధానమిది.

గాంధీజీ హత్యను సంఘం మీద త్రోసి ప్రభుత్వం సంఘాన్ని నిషేధించింది. నాయకుల్ని కార్యకర్తల్ని అరెస్టుచేసి జైళ్ళకు పంపింది. ఆసమయంలో శ్రీ వినూ ఆత్రే, పోలీసులకు తారసపడికూడా ఉపాయంగా తప్పించుకొని అండర్ గ్రౌండులోకి వెళ్ళిపోయారు. విజయవాడలో శ్రీ సూర్యనారాయణరాజుగారి గోడౌన్‌లో 40రోజులు దాగుకొని కాలక్షేపం చేశారు. ప్రతిరోజు ఉషఃకాలంలో కృష్ణానదీ స్నానానికి వెళ్ళటం, స్నానసంధ్యాదులు ముగించు కొని రావటం, పుస్తకపఠనం, ఏవోకొన్ని రచనలు చేయటం వంటి దినచర్యతో భవిష్యత్ కార్యక్రమాన్ని గూర్చి మంతనాల జరుపుకుంటూ ఉన్న సమయంలో వ్రాసిన పాటయిది. దీనితోపాటు ''హమ్ కో అపనా హీ ధర్మప్యారా'' అనేపాటగూడా వ్రాయటం జరిగింది.

అదే సమయంలో అప్పటికి గుంటూరుజిల్లా ప్రచారకుగాఉన్న శ్రీబాలకవి కుమారస్వామిగారు ప్రచ్ఛన్నంగా తిరుగుతూ వచ్చి వినూ ఆత్రేని కలుసుకున్నారు. ఇద్దరూ నాగపూర్ వెళ్ళి, అధికారులనుండి సూచనల్ని తీసికొని జైలుపాలైన మన డిటెన్యూలను విడిపించటానికి ''హెబియస్‌కార్పస్'' పిటిషన్ దాఖలు చేసే ప్రయత్నంలో పడ్డారు. పది పన్నెండువేల రూపాయల నిధిని జమచేసి, ఆయా జైళ్ళల్లో ఉన్నవారి సంతకాలు తీసుకొని

మద్రాసువెళ్ళి హైకోర్టు అడ్వకేట్‌గా పనిచేస్తున్న శ్రీ సంజీవకామత్‌ను ఆశ్రయించి కార్యాన్ని సాధించారు. దాదాపు నూటయాభై ఆరుమందిని విడుదల చేయించగలిగారు. ఆరోజుల్లో, అంతటి భీషణ వాతావరణంలో పోలీసులకు పట్టుబడకుండా నిధిని వసూలు చేస్తూ, అవసరమైన సంతకాలు సేకరిస్తూ ఇట్టి కార్యాన్ని సాధించటం ఎంతకష్టమో భగవంతుడికి తెలియాలి! తిండీ తిప్పలూ లేకుండా, స్నానసంధ్యాదులు అమరకుండా పిచ్చిబట్టినట్లు తిరిగి యిద్దరు పిచ్చివాళ్ళు సాధించిన ఘనకార్యమిది!

శ్రీ ఆత్రేజీ మంచి గాయకులు. 1947మార్చిలో వారు ప్రచారక్‌గా నాగపూర్ నుండి విజయవాడకు చేరుకొన్నారు. వచ్చిన నెలరోజులకే నాగపూర్ ఓ.టి.సిలో యోగచాప్ మరియు సంఘగీత్ శిక్షకుగా వ్యవహరించటానికి వెళ్ళటం జరిగింది. సంఘగీత్ నేర్పటానికి ఒక శిక్షక్ ఉండేవారనీ, ఆయన శ్రీ ఆత్రేజీ అనీ తెలుసుకొన్నప్పుడు ఆనందం కలగటం సహజం. సంఘంపై మొదటిసారి విధింపబడిన నిషేధం తొలగింపబడిన తరువాత 1949 నవంబరులో విజయవాడ మున్సిపాలిటీ శ్రీ గురూజీని ఆహ్వానించి కనీవినీ యెఱుగని విధంగా పౌరసన్మానం చేసింది. ఇది ఆనాటి మున్సిపల్ ఛైర్మన్ తదితర కౌన్సిల్ సభ్యులయొక్క పరమ వివేకానికి తార్కాణం. ఆ సందర్భంలో కార్యక్రమానికి ప్రారంభంలో శ్రీ ఆత్రేగానం చేసిన ''హే అఖండ రాష్ట్ర పురుష - అమితశక్తి ధారీ! కోటి కోటి కంఠకరే - వందనాతు మ్హారీ'' అన్న గీతంగాని, వారే చివరలోగానం చేసిన ''వందేమాతరం''గానంగాని అప్పుడు అవి విన్నవారిలో ఆఖరివ్యక్తి మరణించిన పిమ్మటగూడా ఈ పంచభూతాల్లో కలిసి యెప్పటికీ వినిపిస్తూనే ఉంటాయి. అన్యప్రాంతాలనుండి ఆంధ్రప్రదేశ్‌కి వచ్చిన ప్రచారకుల్లో గాయకులుగా ఇద్దరే ప్రసిద్ధులు. ఒకరు వినాయక ఆత్రేకాగా, రెండవ వారు శ్రీ నారాయణ్‌రావ్‌జీ భట్వాడేకర్. ఆసందర్భంలో శ్రీగురూజీ అరమోడ్పు కనుదోయితో పొందిన ఆనందం ఏమని వర్ణింపగలం!

శ్రీ గురూజీ విజయవాడనుండి మద్రాసువెళ్ళాలి. మద్రాస్‌మెయిలులో ప్రయాణం. స్టేషన్‌లో ఇంకా బండి ఉండగానే ప్రళయంగా తుఫాను ప్రారంభమైనది. బండిసాగింది. కృష్ణా బ్రిడ్జిదాటింది. కృష్ణాకెనాల్ స్టేషన్ దగ్గఱ ఆఘాటికి తట్టుకోలేక రైలుబండి మెలికలుదిరిగి రెండుపెట్టెలు నేలకొఱిగికూరుకొని పోయినవి. భగవత్కృపవల్ల శ్రీగురూజీ కూర్చున్న బోగీకి ఏమీ ఇబ్బంది కలుగలేదు. ఇంకా బండికదలటం అప్పటికప్పుడు సాధ్యంకాదు. శ్రీ గురూజీ వెంటవున్న ఇద్దరు స్వయంసేవకులు అతికష్టం

మీద కార్యాలయానికి వచ్చి తెలియజేశారు. అప్పుడు శ్రీ వినూఆత్రేజీ శ్రీబోను వెంకటేశ్వరావు, శ్రీదేశ్‌పాండేజీ, కాలేజీ ప్రిన్సిపాల్ శ్రీ పుట్టపర్తి శ్రీనివాసాచారిగారు - శ్రీ గురూజీకోసం రెండు ఫ్లాస్కో‌ల్లో టీ తీసుకొని కృష్ణాబ్రిడ్జిమీదగా తుఫానుగాలికి, కుండపోత వర్షానికి తట్టుకుంటూ - ఏమాత్రం తొట్రుపాటుపడినా కృష్ణలోపడిచావటం ఖాయం. అంతటి ప్రమాదకర స్థితిలో సురక్షితంగా గురూజీని చేరుకున్నారు. శ్రీగురూజీకి ''టీ'' అంటే భలే యిష్టం. రోజుకు ఎన్నికప్పులో తెలియదు. విపరీతమైన వేడిగా త్రాగుతారు. ఒక్క గరళకంఠుడికీ, గురూజీకి తప్ప సాధ్యంకాదు. మొదట్లో ఒక కప్పు ఇచ్చారు. అది తోటి ప్రాయణీకులకు ఇచ్చారు. అలా ఐదారుకప్పులు ఇతరులకిచ్చిన తరువాతనే తాము ఒకటి రెండు కప్పులు త్రాగారు. అప్పుడు శ్రీ ఆత్రే ఒక సంఘగీత్ పాడి అందరనీ ఆనందింపచేశారు. ఈ ఘట్టాలన్నీ మిక్కిలి చరిత్రాత్మకములు.

ఆత్రేజీ చేసిన మరొక సాహస కార్యాన్ని గూర్చి రేఖామాత్రంగా చెప్పటం అవసరం. 1948జనవరి 31 ఫిబ్రవరి 1,2 తేదీల్లో నిర్వహింపబడవలసిన శిబిరం ఏర్పాట్లు చేయటంలో శ్రీ బోను వేంకటేశ్వరరావుగారితో కలిసి వారు నిర్వహించిన పాత్ర అమోఘం. మూడు నాలుగు రాత్రుళ్ళు నిద్రాహారాలు లేకుండా నిమగ్నమైనారు. ఆ సంగతి తెలుసుకొన్న శ్రీ బాపూరావ్‌జీ ఆత్రేని కలిసి ఒకపూట పూర్తిగా విశ్రాంతి తీసుకొనవలసిందిగా బలవంతాన పంపించారు. ఇంతజేసీ గాంధీజీ హత్యతో శిబిరం రద్దుకావటమేగాక, కమ్యూనిష్టుల దాడిని యెదుర్కొనవలసి వచ్చింది. కమ్యూనిష్టులు శ్రీ దేశ్‌పాండేజీని పట్టుకొని తీసికొని వెళ్ళి ఒక హోటల్లో రహస్యంగా దాచిపెట్టారు. శ్రీతాకూర్జీ, శ్రీబోను వేంకటేశ్వరరావు, శ్రీ ఆత్రేజీ మెటికలవంటి రెండువందల మంది స్వయంసేవకులను వెంటబెట్టుకొని ఆహోటల్ మీద దాడిచేసి ఇరవైనిముషాలపాటు హోరాహోరి పోరి శ్రీదేశ్‌పాండేజీని విడిపించుకొనివచ్చారు. దాదాపు నూట ఆరుగురు స్వయంసేవకులకు దెబ్బ తగిలింది. ఒక స్వయంసేవకుని అరచేతిలో పిస్తోలు గుండు దూసుకుపోయింది. శ్రీదేశ్‌పాండేజీయొక్క ఒక చెంపకు ఊడిపడుతుందన్నంతగా పెద్ద దెబ్బదగిలింది. చిత్రం తిరిగివచ్చిన దేశ్‌పాండేగారు తలకు కట్టుకట్టుకొని ఆ కాసేపట్లోనే స్వయంసేవకుల మధ్యకు రావటం మహదానందం కలిగించింది. ఆసమయంలో ఆత్రేజీ విజయవాడలో ప్రచారక్‌గా ఉన్నందువల్ల ఇంతటి చరిత్రలో తానొక వీర పురుషుడుగా రాణించారని చెబితే అతిశయోక్తి కాదు.

శ్రీ ఆత్రేజీ విజయవాడకు వచ్చిన పిమ్మట 1947 జులైలో జరిగిన గురుదక్షిణ

అంతకుపూర్వం ఎన్నడూలేని యెక్కువ మొత్తానికి చేరుకొన్నది. 17వేల రూపాయలు సమర్పింపబడినవి. వీరు, శ్రీబోను వెంకటేశ్వరరావుగారు సంయుక్తంగా, వ్యవస్థితంగా చేసిన ప్రయత్నఫలితమే యిది. అలాగే పన్నెండు శాఖలు నలభైశాఖలైనాయి. నగరంలో నూతనోత్సాహం పుంజుకొన్నది. వారు ప్రచారక్‌గా ఉన్నప్పుడు వారిపై ఉంచబడిన బాధ్యతలు రెండు. ప్రచారక్‌గా శాఖల విషయం చూసుకొనటం, కార్యాలయ వ్యవస్థను సరిగా ఉంచటం. వీటిల్లో మొదటి బాధ్యతను చక్కగా నిర్వహించారు. రెండవది సాధ్యంకాలేదు. కార్యాలయం చిన్నది కావటం, వంటశాల భోజనవ్యవస్థకు సరిపోకపోవటం, కేంద్రకార్యాలయం కావటంవల్ల వచ్చేపోయేవారి సంఖ్య అధికంగా ఉండటం వంటి కారణాలవల్లకాస్త గిజాటుగా ఉండేది. మాననీయ శ్రీబాపూరావ్ జీ మోఘేగారికి దీర్ఘవ్యాధిగా పరిణమించిన కడుపునొప్పి ఉండటంవల్ల వారి శుశ్రూష విషయంలో గూడ జాగ్రత్తగా వ్యవహరించటం అవసరమయ్యేది. అయితే శ్రీబోను వేంకటేశ్వరరావుగారు తీసుకొన్న మెలకులవల వల్ల క్రమంగా సర్దుకొని పరిస్థితి మెఱుగైనది.

శ్రీ ఆత్రేజీకి ఒకసారి నలభైరోజులు మానసిక వత్తిడి ఫలితంగా తీవ్రమైన అనారోగ్యం చేసింది. విజయవాడలోని హోమియోపతి డ్యాక్టరు, నిష్ఠావంతులైన స్వయంసేవకు అయిన డా॥ మద్దూరి శ్రీ రామమూర్తిగారి దగ్గఱ మందుతీసికొనటంవల్ల కుదుటపడింది. దరిమిలా వారు కొన్నాళ్ళు తమ స్వగ్రామం వర్ధాలో ఉండి తమ తండ్రిగారు కూడ హోమియోపతి డ్యాక్టర్ కావటంవల్ల మంచి మందులు వాడి ఆరోగ్యం చక్కబడిన తరువాత మళ్ళీ విజయవాడకు రావటం జరిగింది.

శ్రీ వినాయక్ శంకర్ ఆత్రేజీ 1926 జులై 25వ తీదీనాడు వర్ధాలో ఉన్నత సంపన్న కుటుంబంలో జన్మించారు. పితామహులు స్వర్గీయ లక్ష్మణ్ రాజారామ్ ఆత్రే మంచి కీర్తి ప్రతిష్ఠల నార్జించిన వ్యక్తి. తిలక్‌మార్గానుగామి. వర్ధామున్సిపాలిటికి చిరకాలం అధ్యక్షులుగా పనిచేసిన వారు. పూజ్య శ్రీ డ్యాక్టర్జీకి మిక్కిలి సన్నిహితులు. అప్పాజీ జోషీ డ్యాక్టర్‌జీల సమక్షంలో ప్రతిజ్ఞిత్ స్వయంసేవకులైనారు. తండ్రిపేరు శంకరరావ్ లక్ష్మణ్ ఆత్రే. తల్లిపేరు ఉమాబాయి ఆత్రే. తండ్రి హోమియోపతి డ్యాక్టరు. కాని వృత్తిని అవలంబించలేదు. ధనిక భూస్వామి. శ్రీ ఆత్రే తరువాత ఆరుగురు సోదరీమణులు ఒక తమ్ముడు ఉన్నారు. ఇంతమంది చెల్లెళ్ళ పెళ్ళిళ్ళు చేయాల్సిన బాధ్యత తనపై ఉన్నందువల్ల శ్రీ ఆత్రే యెక్కువ కాలం ప్రచారక్‌గా కొనసాగలేకపోయారు. వారి తండ్రిగారు కొన్ని సంవత్సరాలక్రితం మరణించగా తల్లి 1996 సెప్టెంబరులో మరణించారు. శ్రీబాలాసాహెబ్ దేవరస్‌జీకి

సోదర పుత్రిక ఒకతె ఉన్నది. ఆమె పేరు సింధూదేవరస్. శ్రీ బాలాసాహెబ్‌జీ ఆమెను తన మానస పుత్రికగా భావించి ఆమె తండ్రిగారితో ఆకన్యకు తానే పెళ్ళిచేస్తాను అని చెప్పటం జరిగింది. దాని ప్రకారం ఆమెను శ్రీ ఆత్రేజీ పెళ్ళిచేసుకున్నారు. ఆరూపేణ శ్రీ ఆత్రేజీ శ్రీబాలాసాహెబ్‌జీకి అల్లుడు అని చెప్పవచ్చు. తెలిసిన బంధువులు స్నేహితులు అలాగే భావించటంకద్దు. వారికి ఇద్దరు కొడుకులు. ఇద్దరూ ఇంజనీర్లు.

శ్రీ ఆత్రేజీ వర్ధాలో 9వతరగతి చదివేటప్పుడు శ్రీ నీలకంఠమోరేశ్వర్ దేశపాండేజీ కూడ అక్కడే చదవటానికి వెళ్ళారు. ఇద్దరూ కలిసి 1943లో మెట్రిక్‌లో ఉత్తీర్ణులైనారు. ఇద్దరూ ఒకేసారి ఆంధ్రకు ప్రచారకులుగా వెళ్ళాలనే సంకల్పం శ్రీదేశ్‌పాండేజీకి ఉండినది. కాని ఆత్రేజీ అగ్రికల్చరల్ బి.ఏ పట్టభద్రుడయ్యే వఱకు తాను ప్రచారకుగా రాజాలనని చెప్పటం జరిగినది. అందువల్ల శ్రీదేశ్‌పాండే 1943లోనే ప్రచారకులై రాగా శ్రీ ఆత్రేజీ పట్టభద్రత్వం పొందిన తరువాతనే వచ్చారు. కాని శ్రీదేశ్‌పాండేజీకంటె ముందే ప్రచారకుగా విరమించుకొని వెళ్ళిపోయారు. వారు అగ్రికల్చరల్ డిపార్టుమెంటులో ఉద్యోగంచేసి సుమారు 15 సంవత్సరాలనాడు సేవానివృత్తులైనారు. ప్రస్తుతం నాసిక్‌లో తమ కుమారుని దగ్గఱ ఉంటున్నారు.

శ్రీ వినూగారు తఱచుగా తలుచుకునే తెలుగువారిలో శ్రీబోను వేంకటేశ్వరరావు, శ్రీకుమార స్వామి, శ్రీమద్దూరి శ్రీరామమూర్తి శ్రీలక్కరాజు నిరంజన్‌రావు, శ్రీ చుండూరు వేంకటరెడ్డి, అప్పుడు సత్యనారాయణపురం శాఖకు ముఖ్యశిక్షక్‌గా ఉన్న శ్రీహనుమంతరావు, బందరు సంఘచాలకులు శ్రీ ధూర్జటి సుబ్రహ్మణ్యంగారు, శ్రీ పుట్టపర్తి శ్రీనివాసాచారిగారు, శ్రీ ముగుంబై రాఘవాచారిగారు మొదలగువారు ఆనాడు ప్రసిద్ధులైన సంఘకార్యకర్తలు. శ్రీవినూకి విజయవాడకు గల అనుబంధంగొప్పది. 1949 నవంబరులో శ్రీగురూజీ మళ్ళీ ఒకసారి విజయవాడకు పర్యటన సందర్భంలో వెళ్ళటం జరిగింది. అప్పుడు శ్రీబోను వేంకటేశ్వరరావుగారు శ్రీ ఆత్రేజీకి ఒక జాబు వ్రాస్తూ విజయవాడలో శ్రీ గురూజీ కార్యక్రమం విజయవంతంకావాలంటే ఆత్రేగూడ అక్కడికి రావటం అవసరమని వ్రాశారు. ఆత్రే వెంటనే బయలుదేఱి వెళ్ళి శ్రీవేంకటేశ్వరరావుగారికి కుడిభుజంగా పనిచేశారు. ఆంధ్రనుండి ఎవరైనా నాగపూర్ కార్యాలయానికి వచ్చారు అని తెలిస్తే చాలు వెంటనే వచ్చి కలుసుకొని ఆత్మీయంగా పలుకరించి వెళ్ళటం వారి రివాజు. వారికి తెలుగుభాష యింకా బాగా గుర్తు ఉంది. వారు ప్రచారక్‌గా ఉన్నప్పుడు శ్రీబోను వేంకటేశ్వరరావుగారి ప్రజ్ఞను బాగా గుర్తించారు. డాక్టర్జీ శతజయంతి అప్పుడు నాగపూర్‌లో

ఐదువేల మంది పాత ప్రస్తుత ప్రచారకుల సమావేశం ఏర్పాటు చేయబడింది. ఆప్రచారకులు ప్రాంతాలవారీగా మళ్ళీ సమావేశమైనారు. అంటే ఆంధ్రలో పనిచేసిన తెలుగు మరాఠీ పాత క్రొత్త ప్రచారకుల బైఠక్ ప్రత్యేకంగా జరిగింది. అప్పుడు శ్రీ ఆత్రే, బోను వేంకటేశ్వరరావుగారు కూడా వచ్చారు. ఆసందర్భంలో ''విజయవాడలో శ్రీబోను వేంకటేశ్వరరావుగారి సహాయ సహకారాలు లేకపోతే యే ప్రచారకు అక్కడ పనిచేయలేరు'' అని చెప్పినప్పుడు అందరూ హర్షధ్వానాలు చేయటం జరిగింది. శ్రీవినూ ఆత్రే చాలా కలుపుగోలుతనంగల వ్యక్తి. ఆత్మీయంగా వ్యవహరింపగలిగిన వ్యక్తి.

ఆరోజుల్లో శ్రీవినూ ఆత్రే గానమంటే తెలుగు స్వయంసేవకులు చెవికోసుకొనేవారు. ''సంఘటన్ హి జీవన్ ప్యారే, సంఘటన్ హి జీవన్'' అన్న వారు పాడే పాట విజయవాడలో బాగా ప్రచారంలో ఉండేది. వృద్ధాప్యంలో ఇప్పుడు వారి కంఠస్వరం ఎలా ఉన్నదో తెలియదుగాని వారిపేరు చెబితే వారి పాట వినాలని ఉత్సాహపడే స్వయంసేవకులు పాతవారు ఇంకా ఉన్నారంటే ఆశ్చర్యపడవలసిందిలేదు. శ్రీ ఆత్రేజీ సపరివారంగా ఆయురారోగ్య ఐశ్వరాభివృద్ధులతో తులతూగుదురుగాక!

## శ్రీ వినాయక్ విశ్వనాథ్ పేండ్సే



శ్రీ వినాయక్ విశ్వనాథ్ పేండ్సే ఉరఫ్ అప్పాజీ పేండ్సే మచిలీపట్టణం కేంద్రంగా కృష్ణాజిల్లాలో ఒక భాగానికి ప్రచారక్‌గా పనిచేసిన వ్యక్తి. స్వభావరీత్యాగాని, సంఘ క్రమశిక్షణ దృష్ట్యాగాని ఒక ప్రత్యేకమైన కోవకు చెందిన మహనీయుడు. శ్రీ పిన్నమనేని లింగయ్య చౌదరిగారిని సంఘానికి సమర్పించిన ఘనుడు. దరిమిలా శ్రీలింగయ్యగారు 1957 ఫిబ్రవరి 27 నుండి దివంగతులయినదాకా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రీయ స్వయంసేవక సంఘానికి ప్రథమ సంఘచాల కులుగా వ్యవహరించిన ప్రఖ్యాత పురుషుడు, మేధావి, ఉదాత్తుడు, భారతీయ సంస్కృతీ సారాన్ని ఆపోశనం పట్టిన ఘనుడు. ఆంగ్లభాషాకోవిదుడు, వక్త. శ్రీచల్లపల్లి రాజావారికి న్యాయసలహాదారు. అప్పాజీ కారణంగా వారికి సంఘ సంపర్కమేర్పడిన విధమిది:

శ్రీ లింగయ్యగారికి ఒకే ఒక కుమారుడుకలిగాడు. అతడు పదేళ్ళలోపుగా ఉన్నప్పుడు ఎలా ప్రవేశించాడోగాని బాలస్వయంసేవకుగా సంఘంలో ప్రవేశించాడు. శ్రీ లింగయ్యగారికి అప్పటిదాకా ఉండిన ఆలోచనాధోరణి వేఱు. అది సంఘానికి అనుకూలమైన ధోరణికాదు. వారితో శ్రీ పేంఢ్సేగారికి కూడా కొంత పరిచయమేర్పడింది. అదొక దాగుడుమూతల పరిచయం. అంత ఆత్మీయమైనదిగాదు. కాని యీ బాలుడు ప్రతిరోజూ శాఖకు వచ్చి చుఱుకుగా పాల్గొంటూ ఉండేవాడు. ఒక సంవత్సరం గురుదక్షిణా కార్యక్రమం జరిగింది. ఇంట్లో అంత ఆనూకూల్యంలేదు గాబట్టి కొద్దిగా సమర్పించాడు. కాని ఆమరుసటి సంవత్సరానికి కొంచెం ఎక్కువగా సమర్పిద్దామనుకొని తనకు తానుగా ఇంట్లోనే ఒక డబ్బాను ఏర్పాటుచేసి గంగాజళిని సమకూర్చడం మొదలుపెట్టాడు. కాని మరుసటి గురుదక్షిణ కార్యక్రమంరాకముందే జ్వరమొచ్చి మరణించాడు. జ్వరంలో ''సంఘశాఖ'', ''గురుదక్షిణ'', ''గంగాజళి'', ''డాక్టర్జీ'', ''గురూజీ'' ఇత్యాదిగా పలవరిస్తూ కలవరిస్తూ ఉండేవాడు. అప్పుడు తల్లిదండ్రులకు ఆవిషయం పూర్తిగా అవగాహనకు రాలేదు. ఆతడు మరణించిన తరువాత ''ఆ గంగాజలి డబ్బును చూసి ఘోరున విలపించారు. తల్లిదండ్రులు ఏదైనా కొనుక్కొనటానికి ఇచ్చిన డబ్బును అవసరానికి కొంత ఉపయోగించుకొన్నా మిగతాది ''గంగాజలి''కి సమర్పించేవాడు. అకాల మరణం పొందిన తమ పుత్రుని సంస్మరణార్థం తాము చేయగలిగిందేముంది గనుక! తాము స్వయంసేవకులవటంతప్ప! అంతే వారు స్వయంసేవకులైనారు. దరిమిలా సంఘచాలకులైనారు. ఇదీ చరిత్ర!

శ్రీ చౌదరిగారిని ఆవిషాదంలోనుండి తప్పించి సంఘసంపర్కంలోకి రప్పించి, ఆ ఆనందాన్ని చూఱలు ఇవ్వటంలో శ్రీ అప్పాజీ పేంఢ్సే నిర్వహించిన పాత్ర ప్రశంసనీయమైనది. మచిలీపట్టణానికి వీరు వచ్చిన క్రొత్తరోజులు. ఒక చొక్కా కుట్టించుకొనటానికి బట్టకొని, కొలతలు ఇచ్చి ఒక స్వయంసేవకు ద్వారా దర్జీవాని దగ్గఱకు పంపించటం జరిగింది. ఆరోజుల్లో ఆంధ్ర ప్రాంతంలో దర్జీవాళ్ళు యెక్కువగా ముస్లింలు ఉండేవారు. ఆవిషయం ఆయనకు తెలియదు. కుట్టినచొక్కా కార్యాలయానికి వచ్చింది. మాటల సందర్భంలో అది కుట్టింది ముస్లిం అని తేలింది. వెంటనే ''అది నాకక్కర్లేదు'' అని విసిరిపారేసిన ఉద్దండుడు. ఏవిషయంలోగాని రాజీలేని సిద్ధాంత బలాన్ని ఆవాహన చేసుకొన్న వ్యక్తి. వారికి తప్పనిసరిగా ''పిలక'' ఉండేది. ఒక్కొక్కప్పుడు నున్నగా గుండుకొట్టించిన సందర్భాలు గూడా ఉండేవి. అప్పుడప్పుడు విడిసమయంలోగూడ సంఘక్యాప్ ధరిస్తూ ఉండేవారు. ఇంతటి చాదస్తమున్నా వారి ఏక నిష్ఠాకమైన

కార్యకర్తృత్వశక్తికీ, బద్ధకమంటే యేమిటో తెలియని చుఱుకుదనానికి అందరూ ఆశ్చర్యపోతూ వారంటే అమితమైన గౌరవంచూపేవారు. ఆంధ్రకు వచ్చిన ప్రచారకుల్లో అప్పటివఱకూ దాదాపు అందరూ నాగపూర్‌కు, విదర్భకు చెందిన వారే. శ్రీ పేండ్సేజీ ఒక్కరే పూనానుండి వచ్చిన వ్యక్తి. ప్రతి విషయంలోనూ వ్యత్యాసం కొట్టవచ్చినట్లు కనిపిస్తూ ఉండేది.

శ్రీ పేండ్సే 1916 ఆగస్ట్ 17వ తేదీనాడు పూనాలో జన్మించారు. 1927జూన్‌లో విద్యాభ్యాసానికై నూతన మరాఠీ విద్యాలయంలో చేరినారు. 1929లో స్వామీ శ్రద్ధానంద హత్యను గూర్చివిన్న పిమ్మట కదలిన హృదయంతో సమాజ సేవకై ప్రతిజ్ఞచేయటం జరిగింది. 1931 జనవరి 3నాడు తిలక్‌మార్గంలో ''బాలచర శిక్షణ శిబిరాన్ని'' నిర్వహించారు. 1936లో జరిగిన ఫైజ్‌పూర్ కాంగ్రేస్ సమావేశంలో పరమపూజనీయ డాక్టర్ హెడ్గేవార్జీ దర్శనం చేసుకొన్నారు. దరిమిలా నిష్ఠావంతులైన స్వయంసేవకుగా రూపొందటం జరిగింది. 1947లో మచిలీపట్టణంలో సంఘప్రచారక్‌గా ప్రవేశించారు. క్రమంగా ఆజిల్లాలో మచిలీపట్టణంతో కూడిన తూర్పుకృష్ణా జిల్లా ప్రచారకుగా సంఘ వికాసానికి కృషిచేసినారు. వారు ఆంధ్రలో ప్రవేశించిన ఒక సంవత్సరానికే సంఘం మీద నిషేధం విధింపబడింది. ఆసమయంలో రాజమండ్రి సెంట్రల్‌జైల్లో ఐదారు నెలలకు పైగా శిక్షననుభవించారు. సంఘంపై నిషేధం ఎత్తివేసిన పిమ్మట ఆంధ్రలో ప్రచారకుగా విరమించుకొని పూనా వెళ్ళిపోయారు. 1950 నుండి పూనాలోని శనివార్, నారాయణ మండలాలకు సంఘ ప్రముఖ్‌గా బాధ్యత నిర్వహించారు. 1951 మార్చిలో ''హరిసింహనలువ'' అనే గ్రంథం రచించి ప్రచురించినారు. ''కాల'' అనే దినపత్రికలో పనిచేశారు. 1952లో మహారాష్ట్రలో సంభవించిన క్షామ నివారణచర్యలు చేపట్టారు. తన కార్యక్షేత్రంలో స్వయంసేవకుల కొఱకు ''శ్రమకార్య శిబిరం'' నిర్వహించారు. తాము వ్రాసిన కొన్ని కథలను ఒక సంపుటిగా ప్రచురించారు. ''రాష్ట్ర ద్రష్ట వివేకానంద'' అన్న గ్రంథాన్ని ప్రచురించారు. 1953-54లో బి.టి. ట్రైనింగు, 1954-55లో ఎమ్.ఎడ్ ట్రైనింగ్‌చేశారు. 1956లో పూనానగరంలో వ్యాపించిన ''ఇన్ఫ్లూఫ్లూయెంజా'' నివారణకు చర్యలు చేపట్టారు. 1958లో దైనందిన సంఘశాఖా కార్యం నుండి విరమించుకొనటం జరిగింది. 1962 జులై 15వ తేదీనాడు ''జ్ఞాన ప్రబోధినీ'' అను సంస్థను స్థాపించారు. 1983 ఆగస్టు 19వ తేదీనాడు మరణించేవఱకు, తన సర్వశక్తుల్నీ ధారబోసి ఆసంస్థను ఒక గొప్ప సాంస్కృతిక కేంద్రంగా రూపొందించారు. పూనాలో అదొక సుప్రసిద్ధమైన సంస్థ. ొక మహాభవనం, మహారాష్ట్రలో పలుప్రాంతాల్లోశాఖలు - ఇలా మూడు పువ్వులూ

ఆరు కాయలుగా వర్ధిల్లుతున్న సంస్థ అది. అందులో పనిచేసే వారు అధిక సంఖ్యాకులు స్వయంసేవకులే. శ్రీ పేంఢ్సేజీ నిత్యశాఖా కార్యనుండి విముక్తత పొందినా చివరి వఱకు స్వయంసేవకుగానే జీవించారు. ప్రచారకుగానే మరణించారు. తాను మచిలీపట్టణంలో ప్రచారకుగా ఉన్నప్పుడు దివిసీమతో ఏర్పడిన అనుబంధాన్ని పురస్కరించుకొని, 1977లో తుఫాను దెబ్బకు గురియైన ఆసీమలో తన జ్ఞానప్రబోధినీ సంస్థద్వారా ఎన్నో సహాయ చర్యలు చేపట్టటం జరిగింది. వారు అవివాహితులు. జీవితాంతం ప్రచారకులు.

శ్రీ పేంఢ్సేజీకి డాక్టర్జీ గురూజీలపై ఎనలేని భక్తి. శ్రీ గురూజీని గూర్చి వారు వ్రాసిన భావపూర్ణములైన మూడునాల్గు శ్లోకాలు లభిస్తున్నవి. అవి యివి :

''ఏకాత్మ భారతం రాష్ట్రం ఆసేతు ధవలాచలమ్
సాక్షాత్కృత్య స్వయంలోకాన్ భవాన్ ప్రత్యాయయత్యదః॥

ఆసక్తోఽపి విరక్తోఽపి భవాన్ చింతాకులస్సదా
పౌరుషం సంఘ వృత్తిశ్చ యూనా మావిర్భవేత్కథమ్॥

ఏషదేశః స్వసంస్కృత్యా ప్రాచీనతమయాకథమ్
భూత్వా ప్రబుద్ధ చైతన్యః గరిమాణం భజేదితి॥

నక్తం దివ మియంచింతా మనోదహతి తావకమ్
ప్రణతిః కోటిశస్తేఽస్తు, హేమాధవ మహోధృతే॥

''రాష్ట్ర సమర్పిత ఏక్ అదమ్య ఉత్కటచైతన్య

(డా॥ వి. వి. పేంఢ్సే'' అను వారి జీవిత చరిత్ర నుండి)

జీవితాంతం వారు సంఘం ద్వారానే సమాజసేవ చేస్తే బాగుండేది. అయితే, సంఘ సిద్ధాంతానికి అవిరోధంగా సమాజసేవచేస్తూ ప్రచారక్‌గానే దివంగతులైన వారు ధన్యజీవులే

# శ్రీ త్ర్యంబక్ బాలాజీ దేశ్‌కర్



శ్రీ త్ర్యంబక్ బాలాజీ దేశ్‌కర్ ఉర్ఫ్ దాదాజీ దేశ్‌కర్ ఆంధ్రప్రాంతంలో పనిచేసిన పాత ప్రచారకుల్లో ఒకరు. వారు ఒకప్పుడు చాందాగా ప్రసిద్ధి చెందిన నేటి చంద్రపూర్ వాస్తవ్యులు. మనయదృష్టము కొలది ఇప్పటికీ సజీవులే. వారు 1926 ఆగస్టు 22వ తేదీన మధ్యాహ్నం 2 గం॥లకు జన్మించారు. ఆరోజు రక్షాబంధన్ పండుగ. తండ్రిపేరు బాలాజీ గోపాల్ దేశ్‌కర్. తల్లిపేరు ఇందిరాబాయీ బాలాజీ దేశ్‌కర్. పిటీషన్ రైటరుగా తండ్రి ఉద్యోగం. మొత్తం ఎనిమిది మంది సోదరులు, ఐదుగురు సోదరీమణులు, వెరసి పదముగ్గురు. మొదట మొదట ఇంట్లో అంతగా సంఘవాతావరణం లేకుండెను. కాని శ్రీ దేశ్‌కర్ ప్రచారక్‌గా వెళ్ళినప్పటి నుండి మంచి సంఘ వాతావరణం నెలకొన్నది. చదువు బి.ఏ., యల్.యల్.బి. వఱకు చేశారు. 1942జులై నెలలో వారు స్వయంసేవకులైనారు. అంతకు పూర్వం ''చెడుగుడు'' ఆడుకోవడం కోసం వెళుతూ ఉండేవారు.

శ్రీ బాలాసాహబ్‌జీ దేవరస్ ప్రేరణతో వారు స్వయంసేవకులైనారు. అప్పుడు వారు నాగపూర్ కార్యవాహగా ఉండిరి. ఒకరోజు మోహితే సాయంశాఖలో ఒక గణ స్వయంసేవకులు ''కబడ్డీ'' ఆడుకుంటూ ఉంటే అది చూసి శ్రీ దేశ్‌కర్ తానుకూడా కబడ్డీ ఆడుతున్నట్లు చేతులూ కాళ్ళూ ఊపుతూ ఉత్సాహంగా నుంచున్నారు. అది చూసిన శ్రీ బాలాసాహబ్‌జీ శ్రీ దేశ్‌కర్‌ని పిలిచి గణలో చేరి ఆడుకొమ్మన్నారు. అంతే అప్పటి నుండి స్వయంసేవకులైనారు.

పరమ పూజనీయ శ్రీ గురూజీ యొక్క, శ్రీ బాలాసాహబ్‌జీయొక్క ప్రేరణతో వారు ప్రచారకులైనారు. 1947 జులై 1వతేదీనాడు తాము ప్రచారకులుగా ఆంధ్రకు పయనమై ఆమరునాడే, 2వ తారీఖునాడు విజయవాడకు చేరుకొన్నారు. అప్పుడు వారి వయస్సు 21 సంవత్సరాలు. వారు మొత్తం మూడు సంవత్సరాల నాలుగునెలలు ప్రచారకుగా ఉన్నారు. వారు ఆంధ్రలో ప్రవేశించిన నాటికి శ్రీ బాపూరావ్‌జీ మోఘే ఆంధ్రప్రాంత ప్రచారకులుగానుండిరి. శ్రీ గోపాల్‌రావ్‌జీ ఠాకూర్, శ్రీ తాత్యారావ్‌దేశ్‌ముఖ్,

శ్రీ రాజాభావూ దేశపాండే, శ్రీబోసు వేంకటేశ్వరరావు ప్రభృతులు ప్రాంతంలో అక్కడ, ఇక్కడ పనిచేస్తూ ఉండేవారు.

తెలుగు భాష నేర్చుకొనే విషయంలో ఇతరులకు తనకు, కొంచెం భేదముంది. శ్రీ దేశికర్ స్థానికులతో మాట్లాడుతూ నేర్చుకొన్నారు. తక్కిన వారు పుస్తకాలు చదివి నేర్చుకున్నారు. తాను కాస్త చిన్న వాణ్ణి. అందువల్ల నేర్చుకునేటప్పుడు కొంచెం ఆటలు పట్టిస్తూ ఉండేవారు. తాను బి.ఏ.లో ఉత్తీర్ణతను పొందినప్పటికినీ మాట్లాడటం అలవాటు చేసుకొనకపోవటంవల్ల ఇంగ్లీషు బాగా వచ్చినది కాదు. అయితే విజయవాడకు వెళ్ళిన తరువాత కాలేజీ విద్యార్థుల, లెక్చరర్ల సమక్షంలో మాట్లాడవలసిన పరిస్థితి దాపురించినప్పుడు వారు వణికిపోయారు. వారు నాగపూర్ నుండి వచ్చిన వారు కావటంవల్ల ఒక ప్రత్యేక గౌరవం ఉండబట్టి సరిపోయింది. లేకపోతే విజయవాడ వదిలిపెట్టి పారిపోతే బాగుంటుందనిపించింది. రమారమి 70, 80మంది విద్యార్థులు, అధ్యాపకులు చేరిన సమావేశమది. కాస్త గుండెలు చిక్కబట్టుకొని ఎలాగైతేనేం నలభై నిమిషాల బౌద్ధిక ఇవ్వగలిగారు. అది మొదలుకొని కొండంత ధైర్యమొచ్చి క్రమంగ్రా నిలద్రొక్కుకొనగలిగారు. పిమ్మట కొన్నాళ్ళకు పశ్చిమ గోదావరి జిల్లా ప్రచారకులుగా నియుక్తులైనారు. వారు అక్కడికి వెళ్ళినప్పటికి, ఏలూరు, నరసాపురం, భీమవరం మొదలగుచోట్ల శాఖలుండినయి. కాలక్రమంలో వారి కృషితో తాడేపల్లి గూడం, కొవ్వూరు, కోపాలి మొదలగుచోట్ల కూడ శాఖలు నెలకొన్నవి. ప్రతిరోజూ ఏదో ఒక శాఖకు వెళ్ళటం, శాఖ అయిపోయిన పిమ్మట ఆబస్తీలలో తిరిగి స్వయంసేవకుల ఇళ్ళకువెళ్ళి వాళ్ళను కలుసుకొనటం, వాళ్ళయింట్లోనే ఫలహారంగాని, భోజనంగాని చేసి యే మూడింటికో కార్యాలయానికి వచ్చి కాస్త విశ్రాంతి తీసుకోవటం - ఇదీ దినచర్య. ఆ సమయంలో శ్రీకాంచన పరంకుశరావు ఏలూరు పట్టణ కార్యవాహ్‌గా ఉన్నారు. బి. సూర్యనారాయణ జిల్లా కార్యవాహగా ఉన్నారు. కాని వారు ఒకవైపు బాధ్యతను నిర్వహిస్తూనే మరోవైపు సంఘం మీద వైర భావం ప్రదర్శిస్తూ ఉండేవారు. కాని శ్రీ దేశ్‌కర్జీ యొక్క చాకచక్యంవల్ల కొంతకాలానికి సంఘకార్యంలో నిమగ్నుడై పనిచేస్తూ ఉండేవారు. ఏలూరు శాఖల సంఖ్య పన్నెండుకు చేరుకొన్నది.

శ్రీ దాదాజీ ప్రచారక్‌గా రాకపూర్వం ప్రథమవర్ష ఓ.టి.సి. మాత్రమే చేశారు. 1948లో సంఘంపై తొలి నిషేధం విధింపబడింది. వారు ఫిబ్రవరి 4వ తారీఖునాడు అరెస్టు కాబడి ఆరునెలలు రాజమండ్రి జైలులో ఉన్నారు. ఆపిమ్మట ఆగస్టు 20వతేదీనాడు నల్గురు పోలీసులు వెంటరాగా నాగపూర్ పంపబడ్డారు. కొన్నాళ్ళు ప్రచ్ఛన్నంగా తిరుగుతూ ''కాశ్మీర్ నుండి వచ్చిన కొబ్బరికాయల వ్యాపారిగా'' వేషం దాల్చి మళ్ళీ తన కార్యక్షేత్రం ఏలూరుకు

వచ్చేశారు. (15నవంబర్ 1948 నాడు) నిషేధం తొలగింపబడిన పిమ్మట ద్వితీయ, తృతీయ వర్షలు సంఘశిక్షావర్గలు పూర్తి చేశారు. నిషేధసమయంలో జరిగిన సత్యాగ్రహానికి పశ్చిమగోదావరినుండి వందల మంది స్వయంసేవకులు రాజమండ్రివెళ్ళారు. వారు అండర్‌గ్రౌండులో ఉన్నప్పుడు కూడా అంత సంఖ్య వెళ్లటం వారికే ఆశ్చర్యానందాన్ని కలిగించింది. నిషేధసమయంలో తాను పెద్దగా కష్టాల్ని యీదిందిలేదు. శ్రీ బాపూరావ్‌జీ మోఘే సత్యాగ్రహానికి వెళ్ళమని దేశ్‌కర్జీని ఆదేశించారు. దేశ్‌కర్జీ పొలంలో దాగుకొనవలసి వచ్చింది. పోలీసులు పట్టుకొని మళ్ళీ నాగపూర్‌కి పంపించారు.

శ్రీదాదాజీ చాలా మామూలుగా నిరాడంబరంగా ఉండేవారు. మామూలు ధోవతి, కుర్తా ధరించేవారు. స్వయంసేవకుల్ని తాను ఎల్లప్పుడూ ఉత్సాహపరుస్తూ ఉండేవారు. ఆమూస్వయంగా ఆటపాటల్లో పాల్గొంటూ ఉండేవారు. స్వయంసేవకుల ఇళ్ళల్లో కూడ వీరికి బాగా గౌరవ, చనువు ఉండేవి. ఏలూరులో పేదమాల పల్లెలుండేవి. వాళ్ళల్లో వాళ్ళకు రెండు తెగలున్నవి. శ్రీ దాదాదేశ్‌కర్ ఆభేదాన్ని పాటించకుండా అందరియుళ్ళూ తిరిగుతూ భోజన భాజనాదులు చేస్తూ ఉండేవారు. ఆయింటి ఆడపడుచులు వారిని యెంతో సోదరప్రేమతో ఆత్మీయంగా చూస్తూ ఉండేవాళ్ళు. 1948 జనవరి 2వతేదీనాడు వారు అకోలా బెజవాడల నుండి వచ్చేటప్పుడు కమ్యూనిష్టులు తనపై దాడిచేశారు. అప్పుడక్కడి హరిజనులు లాఠీలతో వాళ్ళను యెదుర్కొని తన్ను కాపాడగలిగారు!

మూడు సంవత్సరాల తన కార్యకాలంలో శ్రీ దాదాజీ యెప్పుడూ గోధుమ రొట్టె తినే అవకాశానికి నోచుకోలేదు. అయినా తాను కష్టపడినట్లు భావించలేదు. ఏలూరులో ఒకసారి కమ్యూనిష్టులు, మరొకసారి క్రైస్తవులు తన మీద దాడిచేసినప్పుడు ఏలూరు మునిసిపల్ ఛైర్మన్, కాంగ్రెస్‌వాడు తనను కాపాడటం జరిగింది. శ్రీ దేశ్‌కర్జీ ప్రచారక్‌గా మానేసి వెళ్ళిన తరువాత న్యాయవాద వృత్తినవలంబించి జీవికను సాగిస్తున్నారు. 1961 వఱకు చంద్రపూర్ పట్టణానికి సంఘకార్యవాహగా పనిచేసిరి. పిమ్మట జనసంఘం ద్వారా రాజకీయ రంగ ప్రవేశం చేశారు. ప్రతి రోజు తప్పకుండా శాఖకు హాజరౌతారు.

వారికి ముగ్గురుకొడుకులు. ముగ్గురు కూతుళ్ళున్ను. అందరూ వివాహితులే. అందరూ సంఘ సంపర్కంలో ఉన్నవారే. చంద్రపూర్‌లోదాదాజీ పేరుగాని, ఇల్లుగానీ, తెలియని వాళ్ళు ఉండరు. బస్సు లేదా రైలుదిగి దాదాజీ యింటికి తీసికొని వెళ్ళమని చెబితే రిక్షావాడుగాని, ఆటోవాడుగాని భద్రంగా చేర్చగలడు. తాను స్వయంగా అటువంటిపేరు ప్రఖ్యాతుల్ని పొంది, సంఘానికి తెచ్చి పెట్టిన ఘనులు శ్రీదాదాజీ దేశ్‌కర్జీ, వారు సపరివారంగా, సర్వోత్కర్షలతో వర్ధిల్లుదురుగాక!

# శ్రీ కమలాకర్ వేంకటేశ్ ఫైజ్‌పూర్‌కర్



మహారాష్ట్ర యందలి బుల్దానా జిల్లాలోని ఖామ్‌గావ్ వాస్తవ్యులు శ్రీ కమలాకర్ వేంకటేశ ఫైజ్‌పూర్ కర్జీ. 1947లో పట్టభద్రులైన తరువాత, ప్రచారక్‌గా వెళ్ళటానికి నిశ్చయించుకొని, నాగపూర్ వెళ్ళి అక్కడి మహల్ సంఘ కార్యాలయంలో శ్రీ బాలాసాహబ్ దేవరస్‌ని దర్శించి తమ కోరికను వెల్లడించారు. వారు ఆశీర్వదించి ఆంధ్రకు వెళ్ళవలసిందని నిర్దేశించారు. నాల్గైదు రోజుల తరువాత వారు విజయవాడకు వెళ్ళి అక్కడి సంఘ కార్యాలయంలో శ్రీ బాపూరావ్‌జీ మోఘేని కలుసుకొన్నారు. వారి సూచన మేఱకు రాజమండ్రి వెళ్ళి శ్రీ దేశ్‌ముఖ్‌జీని కలిశారు. వారు శ్రీ ఫైజ్ పూర్‌కర్‌ని కాకినాడకు పంపించారు. అక్కడ ప్రచారక్‌గా వారు ఒక సంవత్సరంపైగా పనిచేసి, 1948 నవంబర్‌లో తండ్రిగారు మరణించగా విధిలేక తిరిగి స్వగ్రామానికి వెళ్ళిపోయినారు. కాని అప్పటినుండి యీనాటి వఱకు అవచ్ఛిన్నంగా సంఘపనిచేస్తూ జీవితానికి సాఫల్యం సమకూర్చుకొంటున్న మహనీయులు వారు.

శ్రీ ఫైజ్ పూర్‌కర్ కాకినాడ వెళ్ళిన సమయానికి అక్కడ నాలుగుశాఖలు మాత్రమే ఉండినవి. వారి నిరంతరకృషితో ఒక్క సంవత్సరంలో అవి ఇరవై రెండు శాఖలైనవి. భాషా సమస్య కాస్త యిబ్బందిగా ఉండేది. తనకు తెలుగురాదు. వారికి హిందీరాదు. పైగా తనకు ఇంగ్లీషు గూడా అంత బాగా రాదు. మొత్తం మీద ఇంగ్లీషే ''మీడియం'' భాష అయింది అక్కడ. ఆ సంవత్సరంలో అప్పటి సర్‌కార్యవాహ శ్రీ భయ్యాజీ దాణీ కాకినాడకు విచ్చేయటం జరిగింది. ఐదువందల మంది స్వయం సేవకులతో మంచి కార్యక్రమం నిర్వహింపబడింది. అది కాకినాడ సంఘ చరిత్రలో చిరస్మరణీయం. అప్పుడు ఆంధ్రప్రదేశ్‌లో ప్రతిచోటా యిలాగే సంఘకార్యం విజృంభిస్తున్న సమయం. నడుమును విరగగొట్టినట్లు సంఘంమీద 1948 జనవరి 30నాటి గాంధీజీ హత్యానేరం సంఘం మీద మోపబడి నిషేధం విధింపబడింది. అనేక సంఘకార్యకర్తలతోపాటు శ్రీ ఫైజ్ పూర్‌కర్ గూడా వెల్లూరు జైల్లో నిర్బంధింపబడినారు. నాల్గునెలల కారాగార వాసం తరువాత విడుదలై

ప్రభుత్వం వారిచేత స్వగ్రామం ఖామ్‌గావ్ పంపబడినారు. అక్కడకొన్నాళ్ళుండి తిరిగి త కార్యక్షేత్రం కాకినాడకు వెళ్ళాలనుకొంటున్నతరుణంలో 1948 నవంబరులో వా [illegible] గతించారు. వారు 1932 నుండి కొనసాగిస్తున్న మెడికల్ షాపొకటుంది వారి షాపు నడిపిస్తేగాని కుటుంబ జీవనం గడవదు. అందువల్ల ఇంటిపట్టుననే ఉండవలసివచ్చింది.

శ్రీ పైజ్‌పూర్‌కర్ 1924 ఆగస్టు 22న యవత్‌మాల్‌లో జన్మించారు. అది మేనమామగారి ఊరు. తండ్రిపేరు వేంకటేశ గోవింద పైజ్‌పూర్‌కర్. ఆయుర్వేద ఔషధాలయ యజమాని. తల్లిగారు శ్రీమతి సావిత్రీ వేంకటేశ్ పైజ్‌పూర్‌కర్. వీరు ముగ్గురు సోదరులు. ఇద్దరు సోదరీమణులు. మొత్తం ఐదుగురు. జబల్‌పూర్‌లో సిటీకాలేజీలో చదివి బి.ఏ. పాసైనారు. 1932నుండి స్వయంసేవకులు. 1938, 39, 40 సంవత్సరాలలో వరుసగా మూడు ఓ.టి.సిలు పూర్తి చేశారు. ఖామ్ గావ్‌లో నగర కార్యవాహగా ఉండిరి. అక్కడి కార్యాలయ ప్రముఖ్ శ్రీ ప్రహ్లాద గంగాధర జోషిగారి ప్రేరణతో ప్రచారకుగా వెలువడినారు. 1947 సెప్టెంబర్‌లో ఆంధ్రలో ప్రవేశించారు.

శ్రీ పైజ్‌పూర్‌కర్‌జీ సతీమణి సంఘ పరివారం నుండి వచ్చిన ఉత్తమ యిల్లాలు. సంఘకార్యం విషయంలో ఆమె భర్తకు సహకరిస్తూ ఉండటం విశేషం. ప్రభాత్ శాఖకు సమయమైనది. ఎవరో వస్తే పైజ్‌పూర్‌కర్‌జీ మాట్లాడుతున్నారు. వారి సతీమణి ''శాఖకు సమయమైనది. త్వరగా వెళ్ళండి'' అని చెప్పగా ఆయన వెంటనే బయలుదేరి వెళ్ళటం చూచి తీరవలసినదే గాని వ్రాయనలవిగాదు. ఈ ఆదర్శ దంపతులకు ముగ్గురు కూతుళ్ళు. అమ్మాయిలందరూ మంచివాళ్ళని ఆ దంపతులు ఆనందపడుతూ ఉంటారు. శ్రీ పైజ్‌పూర్‌కర్‌గారికి జిల్లా స్థాయిలో గూడా అనేక సేవాసంస్థలతో సంబంధమున్నది. ఈ సంస్థలన్నీ సంఘ ఆదర్శాల ప్రకారం నడుపబడుతున్నట్టివే. సంఘమే వారికి ప్రాణం. వారు సంఘానికి అక్కడ మూల స్తంభం. ఆకుటుంబం సర్వోత్కర్షలతో వర్ధిల్లుగాక.

# శ్రీ గో. శ్రీ. బన్‌హట్టి



మాన్యశ్రీ గో. శ్రీ. బన్‌హట్టీజీ నాగపూర్‌కి చెందినవారు. 1949 జులైనుండి 1950 మార్చి వఱకు భీమవరంలో ప్రచారక్‌గా పనిచేసిరి. వారక్కడనున్నది కేవలం తొమ్మిది నెలలుమాత్రమే. కాబట్టి విస్తారక్ అనవచ్చును. భీమవరంలో ఒక పెద్ద కాలేజీ ఉన్నది. అందువల్ల విద్యార్థుల్ని ఆకర్షిస్తూ రెండు సాయం శాఖలు చక్కగా నడిచేవి. ఒక ప్రభాత్ శాఖగూడ ఉండేది. శ్రీ బన్‌హట్టీజీ శ్రీ గుండు కృష్ణమూర్తి అనువారి యింటిలో ఒక గదిలో ఉంటూ ఉండేవారు. సాధారణంగా స్వయంగా వండుకొని తింటూ ఉండేవారు. అప్పుడప్పుడు హోటల్‌కివెళ్ళి భోజనం చేయటం కూడ కద్దు. భీమవరంలో ఒక వకీలుగారి పుత్రుడు శ్రీ రామమోహన్‌రావ్ అనే స్వయంసేవకు ఉండేవారు. ఆతని ఒక్కపేరే తనకు జ్ఞాపకం ఉన్నది. ఆరామమోహన్‌గారు దరిమిలా నాల్గైగేళ్ళ తరువాత వారణాసిలో శ్రీ బన్‌హట్టీజీని కలవటం జరిగింది. శ్రీ బన్‌హట్టీ ఆంధ్రలో ఉన్నప్పుడు శ్రీ బాపూరావ్‌జీ మోఘే ప్రాంత ప్రచారకులు. భీమవరం కృష్ణాజిల్లాలో చేర్చబడి శ్రీ గోపాల్‌రావ్ ఠాకూర్జీ పర్యవేక్షణలో ఉండేది. శ్రీ నారాయణ్‌రావ్ భాట్వాడేకర్‌జీ తెనాలిలో ప్రచారక్‌గా ఉండిరి.

వారు ఇక్కడుండగా తెలుగు భాషను బాగా నేర్చుకొన్నారు. లిపిగూడ వ్రాయగలిగేవారు. ఇప్పుడుగూడ తెలుగుచక్కగా మాట్లాడగలరు. కన్నడం గూడ కొంత వచ్చు. వారు చాలా కాలం ప్రచారక్‌గా ఉండాలనే అనుకొనివచ్చారు. కాని ఆరోగ్యం దెబ్బతినటంవల్ల వెనక్కుతిరిగి వెళ్ళిపోవలసి వచ్చింది. భారతదేశంలోని భాషలన్నింటికీ ఒకే లిపి ఏర్పాటుచేసుకోగలిగితే జాతీయ యేకాత్మక భావన బలపడుతుందని వారి నిశ్చితాభిప్రాయం. ప్రచారక్‌గామానేసిన తరువాత వారు ఈ విషయంలో కొన్ని వ్యాసాలు వగైరాలు వ్రాసి కొంత కృషి చేయటం జరిగింది.

శ్రీ.గో.శ్రీ. బన్‌హట్టీ 1929 ఫిబ్రవరి 12వ తేదీనాడు నాగపూర్‌లో జన్మించారు. తండ్రిపేరు శ్రీనివాస బన్‌హట్టీ. తల్లిపేరు శ్రీమతి పద్మావతి. ఆమె 1971లోను, తండ్రి

1975లోను మరణించారు. తండ్రి నాగపూర్‌లోని ఒక డిగ్రీ కళాశాలలో మరాఠీ లెక్చరర్‌గా ఉండేవారు. వారు ప్రఖ్యాతిగన్న రచయితలు. సమీక్షకులు. ఇంట్లో అనుకూలమైన సంఘ వాతావరణం లేదు. ఆయన అన్నగారైన శ్రీ మాధవ్‌బన్‌హట్టీగారి ప్రేరణతో ప్రచారక్‌గా రావటం జరిగింది. ప్రచారక్‌గా రావటానికిపూర్వమే వారు బి.ఏలో ఉత్తీర్ణులైనారు. తిరిగి వెళ్ళినపిమ్మట ఎం.ఏ. సంస్కృతం (బంగారు పతక గ్రహీత) ఎం.ఏ ఇంగ్లీషు, అందులో పి.హెచ్.డి., ఎం.ఏ పాలీ భాష ఇలా ఉన్నత స్థాయి డిగ్రీలు సాధించారు.

వారు 1954లో వివాహితులైనారు. 1989వరకు కాలేజీ లెక్చరర్‌గా పనిచేసి ఉద్యోగ విరమణ చేసినారు. శ్రీమతిగారిపేరు శాలిని. వారు గూడా లెక్చరర్‌గా పనిచేసినవారే. ఆమె మంచి సంగీతజ్ఞురాలు. గాయకురాలు. శ్రీబన్‌హట్టీగారు మరాఠీలోను, ఇంగ్లీషులోను ఎన్నో రచనలు చేశారు. వ్యంగ్యాత్మక రచనలు, కథలు, మంచి విషయ ప్రధానమైన గంభీర రచనలు చేశారు. ''స్వామీ వివేకానందుని జీవితము, వేదాంతము'' ఫ్రమ్ ప్రాలిక్టు ఫిలాసఫీ'' అన్న పేరుతో సోమర్‌సెట్‌మామ్ నాటకాలమీద విమర్శ, సార్వజనిక స్వచ్ఛత, సమస్యలు - పరిష్కారమార్గములు, రామ్‌భరోసే, నరసమ్రాట్, మహామాత మొదలైనవి వివిధ సాహిత్య ప్రక్రియల రచనలు వెలయించారు. రోటరీక్లబ్ అధ్యక్షులుగా పనిచేసినారు. ప్రస్తుతం ''సురాజ్య సంఘటనా'' అన్న పేరుతో ఒక సామాజిక సేవా సంస్థను నెలకొల్పి అధ్యక్షులుగా ఉన్నారు. అమెరికా, ఇంగ్లాండు మొదలగు ఎన్నో విదేశాలు పర్యటించారు. ముగ్గురు కొడుకులు - ఒకరు జర్మని మరొకరు ఇంగ్లాండు, ఇంకొకరు పూనాలోను పెద్ద ఉద్యోగాలు నిర్వహిస్తూ ఆనందంగా కాలక్షేపం చేస్తున్నారు. శ్రీ గో.శ్రీ.బన్‌హట్టీజీ అప్పుడూ ఇప్పుడూ సంఘ సిద్ధాంతాన్ని ఆరాధిస్తూ సాహితీ సమాజసేవలో నిమగ్నమవటం ముదావహం. వారికి ఇవే మన శుభాకాంక్షలు!

# శ్రీ మోరేశ్వర్ చౌధురీ

వీరు మూర్తజాపూర్‌కి చెందినవారు. 1941 సం॥లో విశాఖ పట్టణంలో శాఖలు పెట్టటానికి విస్తారక్‌గా వచ్చిన వ్యక్తి. శ్రీయాద్వడ్కర్జీ వీరిని పిలిపించటం జరిగింది. ఆయన స్థానికులతోను, యూనివర్శిటీవిద్యార్థులతోను కొద్దిపాటి పరిచయ స్నేహాలను ఏర్పఱచుకొని ఒక మోస్తరు వాతావరణాన్ని సృష్టింపగలిగాడే తప్ప అక్కడ శాఖ పెట్టలేకపోయాడు. రెండు మూడు నెలలు మాత్రమే ఉండి తిరిగి స్వగ్రామం వెళ్ళిపోయారు.

# శ్రీ బబన్ సానే

శ్రీ నాగనాథ్ కాళేగారితోపాటు విస్తారక్‌గా పనిచేయటానికి వచ్చిన మరొక మహనీయుడు వీరు. 1944లో మచిలీపట్టణంలో కొద్దినెలలు మాత్రమే పనిచేసినవారు. పిమ్మట కొంతకాలానికి మహరాష్ట్ర ప్రభుత్వోగిగా చేరి క్రమక్రమంగా పదోన్నతి పొంది చివరికి ''ఫిషరీస్'' డిపార్ట్‌మెంటు డైరక్టరుగా ఉద్యోగవిరమణ చేసినవారు ప్రస్తుతం బొంబాయిలో స్థిరనివాసం ఏర్పాటుచేసికొని సుఖజీవనం చేస్తున్నారు.

# వసంత్ పురాణిక్

వీరు వార్ధానుండి వాల్టేరు వెళ్ళి ఆంధ్రయూనివర్శిటిలో బి.యస్.సి. చదువుతూ ఉండేవారు. యూనివర్శిటీ శాఖకు ఇన్‌ఛార్జిగా ఉంటూ చాలా గట్టిగా పనిచేశారు. 1948లో సంఘం నిషేధింపబడినప్పుడు డిటెన్యూగా బంధింపబడి విశాఖపట్టణం జైలులో నాలుగునెలలు పైచిలుకుకాలం ఉండిరి. పరీక్షలు దగ్గఱకు వస్తున్న కొద్దీ ఆదుర్దా యెక్కువగావటం సహజమే. హెబియస్ కార్పస్ పిటిషను కోర్టులో వేసినతరువాత వారు బంధవిముక్తులై పరీక్షలకు హాజరైనారు. లేకపోతే వాళ్ళ నాన్నకు, అమ్మకు చాలా కష్టంగలిగి ఉండేది. చదువుకొనటానికి అతణ్ణి ప్రేరేపించి ప్రోత్సహించి వాల్టేర్ తీసుకొని వెళ్ళినవారు శ్రీ వినాయక్ శంకర్ ఆత్రే. ఆతడు ఎన్నో తిట్లు తినవలసివచ్చేది. మొత్తం మీద శ్రీవసంత్ పురాణిక్‌గారు విద్యార్థి ప్రచారకుగా బాగా రాణించినట్లు చెప్పవచ్చు.

## శ్రీ వామన్‌రావ్ దేశ్‌ముఖ్

వీరు 1947లో అప్పాపేండ్సేతోపాటు వచ్చి మచిలీపట్టణం పరిసరాల్లోనే కొద్దినెలలు మాత్రమే విస్తారకుగా పనిచేసి తిరిగి తమ స్వస్థానమైన పూనా చేరుకొనిరి.

## శ్రీ కాకోడ్కర్

మహారాష్ట్రలోని కొల్హాపూర్ ప్రాంతం నుండి 1947లో విస్తారకుగా వచ్చి 5,6 నెలలు మాత్రమే నెల్లూరు జిల్లా గూడూరులో పనిచేశారు. ప్రస్తుతం వీరి స్థితిగతుల్నిగూర్చి పొత్తిగా తెలియటంలేదు.

వివిధ ప్రాంతాలలో సంఘకార్యాన్ని విస్తరింపజేయటానికి 1941-47 మధ్య ఎన్నో పథకాలు రూపొందింపబడినట్లు చరిత్ర. ఎక్కువకాలం ప్రచారక్‌గా వచ్చిన వారితోబాటు ఎంతకాలం వీలైతే అంతకాలం పనిచేయటానికివచ్చిన వారిని విస్తారక్ పేరుతో పంపటం జరిగింది. ముఖ్యంగా పరీక్షలు అయిపోగానే విద్యార్థులకు రెండు మూడు నెలలు సెలవురావటం పరిపాటి. ఆ సందర్భంలో ఉత్సాహవంతులైన యువకుల్ని, స్వయంసేవకుల్ని యిలా సంఘకార్యంకోసం వినియోగించటం జరిగింది. ఎవరి అదృష్టం వారిదిగా పనిచేసిన ఆ కార్యకర్తలు ధన్యజీవులనటంలో సందేహంలేదు.

## శ్రీ మాధవ్‌గజానన్ రాంగ్‌ణేకర్



శ్రీ మాధవగజానన్ రాంగ్‌ణేకర్ మిక్కిలి చలాకీయైన కార్యకర్త, ప్రచారక్. నిలుచున్నచోట నిలుచోకుండా లేడిపిల్లవలె అటూ యిటూ ఉత్సాహంగా పరుగెత్తినట్లు నడుస్తూ ఉంటే పరిచయంలేని చూపరులకు సైతం ఉత్సాహం ఉబుకుతూ ఉండేది. సన్నని జీరతో కూడిన కమ్మని కంఠస్వరం వింటే మహా ఆకర్షణీయంగా ఉండేది. ఆయన చాలా అందమైన వాడు అని చెప్పటానికి వీలుకాకపోవచ్చు కాని, యేదో ఒక సమ్మోహనాస్త్రం వంటి ఆకర్షణ వ్యక్తుల్ని

హఠాత్తుగా దగ్గఱకు లాగికొంటూ ఉండేది. ఇది అధిక సంఖ్యాక స్వయంసేవకుల అనుభవం, అనుభూతి. వారు శారీరక శిక్షణ ఇవ్వటంలోచాలాదిట్ట. ''వ్యాయామ క్రీడాదర్శిని'' అనే చిన్ని శారీరక్ గ్రంథాన్ని రూపొందించారు. వీరి తెలుగులేఖిన తొలి శారీరక గ్రంథం అది. తనచుట్టూ ఉన్న వ్యక్తుల్లో కౌశల్యాన్ని పెంచటమనేది వారి ధ్యేయం.

శ్రీ మాధవరాంగణేకర్‌జీ 1921 నవంబరు 30 వతేదీనాడు జన్మించారు. తండ్రి గజానన్‌రావ్ రాంగణేకర్ గారు. 'పీ అండ్ ఓ' అను పేరుగల ఒకానొక విదేశీ కంపెనీయొక్క ముంబాయి శాఖ ఆఫీసులో ఉద్యోగం చేస్తూ ఉండేవారు. కుటుంబం చాలా పెద్దది; కాని నేటి కాలాన్ననుసరించి అన్ని సౌకర్యాలతో ఆనందంగా సాగిపోతున్న కుటుంబం. వీరి సోదరులు నలుగురు. సోదరీమణులు ఐదుగురు. అందరిలోకి శ్రీ మాధవ్‌జీ చిన్నవారు.

కుటుంబం మధ్యతరగతికి చెందినది. ఏదో చదువుకొనటం, కాస్తమంచి ఉద్యోగం సంపాదించుకొనటం, సుఖ సాంసారిక జీవనం సాగించటం వంటి మామూలు స్థాయిలో ఆలోచించే కుటుంబం మాత్రమే. దేశానికి స్వాతంత్ర్యం సంపాదించటం కాంగ్రెసు ద్వారానే సాధ్యమౌతుంది అని అందరూ ఆలోచిస్తున్నట్లే ఆ యింట్లో కూడా ఆలోచిస్తూ ఉండేవారు. తండ్రిగారి తరం వరకు ఈ చర్చలు సాగించటమేకాని కార్యరంగంలో దిగిన వైనం కానరాదు. అయితే వారి సోదరీమణులిద్దరు మహాత్ముని జాతీయోద్యమంలో పాల్గొనటం జరిగింది. జులూస్‌లో వెళ్ళటం, పికెటింగు చేయటం వంటివి క్రియారూపంగా చేస్తూ ఉండేవారు.

వారి సోదరుల్లో ఒకరు మంచి రచయిత. నాటకరచనలు చేస్తూ రంగస్థలంమీద ప్రదర్శింపజేస్తూ ఉండేవారు. మరాఠీ నాటక ప్రయోగాలకు దర్శకత్వం వహిస్తూ ప్రఖ్యాతి వహించారు. ఒకానొక పత్రికకు సంపాదకులూగా ఉండేవారు.

శ్రీ రాంగణేకర్‌జీకి బాల్యంలోనే, 14 సంవత్సరాల వయస్సులో సంఘ పరిచయమేర్పడింది. 1935 నుండి యిప్పటివరకు సంఘంతో సంబంధం అవిచ్ఛిన్నంగా సాగుతున్నది. వారిమీద శ్రీ గోపాల్‌రావ్‌జీ యెరకుంటవార్ అనే ప్రచారకునియొక్క ప్రభావం బాగా ఉన్నది.

ప్రాథమిక స్థాయినుండి ఎం.ఏ వరకు వారి చదువు సంధ్యలు బొంబాయిలోనే జరిగినవి. ఎం.ఏ పూర్తిచేసిన పిమ్మట ప్రచారక్‌గా పనిచేయటానికి వారు ఆంధ్రకు రావటం జరిగింది. బొంబాయినుండి ప్రచారక్‌గా వస్తున్న వ్యక్తి యే సూటుబూటులోనో

ఉంటాడనుకున్న విజయవాడ స్వయంసేవకులు మామూలు పైజామా లాల్చీలో ఉన్న రాంగణేకర్‌జీని చూసి విస్తుపోవడం జరిగింది. వారు విజయవాడలో పనిచేసినంతకాలం ఎక్కువగా కాలేజీ విద్యార్థులపైనే దృష్టి కేంద్రీకరించటం జరిగింది. ఆమేఱకు ఒక చక్కని విద్యార్థి కార్యకర్తల బృందాన్ని తయారుచేయగలిగారు. విజయవాడలో రమారమి రెండేళ్ళు పనిచేసిన తరువాత విశాఖపట్టణం వెళ్ళటం జరిగింది. అక్కడ ఒక సంవత్సరంలోపు పనిచేసిన తరువాత ఆరోగ్యం దెబ్బతిని తిరిగి యింటికి వెళ్ళి పోవలసి వచ్చింది. 1950-1953 వరకు పూర్తిగా మూడు సంవత్సరాలు వారు ఇక్కడ ప్రచారక్‌గా పనిచేసినట్లు లెక్క. ఆ రెండు పట్టణాలకు సంబంధించిన ఆనాటి స్మృతులు ఇప్పటికీ వారిని వెంటాడుతూనే ఉన్నట్లు వారు చెప్పడం జరిగింది. విజయవాడలో శ్రీ గొట్టుముక్కల సోమరాజుగారు, విశాఖపట్టణంలో శ్రీ పిళ్ళా రామారావు గారి వంటి మహనీయులతో సంబంధమేర్పడడం తన అదృష్టమంటారు శ్రీ రాంగణేకర్‌జీ. విశాఖపట్టణంలో ఉన్నప్పుడు వారికి జబ్బుచేసింది. ఆ సమయంలో శ్రీ పిళ్ళా రామారావుగారి తల్లిగారు శ్రీ రాంగణేకర్‌జీని తన బిడ్డగా భావించి జాగ్రత్తగా కనిపెట్టుకొని ఉన్న ఘట్టం తలచుకొని వారు ఆర్ద్రీభూతచేతస్కులవటం కద్దు. ఆంధ్రను విశేషించి విశాఖపట్టణం విడిచిపెట్టి వెళ్ళిపోయేటప్పుడు వారెంతో దిగులుపడడం జరిగింది.

ప్రచారక్‌గా విరమించుకొని బొంబాయికి తిరిగివెళ్ళిన తరువాత వారు వివాహం చేసుకొన్నారు. బ్రతుకుతెఱువు ప్రారంభించారు. కొన్నాళ్ళ తరువాత మాననీయ శ్రీ మోరోపంతు పింగళే. మా.శ్రీ ఆబాజీ, మా.శ్రీ ప్రహ్లాద అభ్యంకర్‌జీ ప్రభృతులతో సంప్రదించిన మీదట జీవిక కోసం ఏదైనా వృత్తినవలంబించి సంఘకార్యం ప్రధానంగా పనిచేయటానికి ఔరంగాబాదులో స్థిరపడటం జరిగింది.

ఔరంగాబాదులో వారొక స్వంత వృత్తి వ్యవస్థను ఏర్పాటు చేసుకొన్నారు. దానికి వారి శ్రీమతిగారితోడ్పాటు బాగా లభించింది. టైపు, షార్టుహాండ్‌ను నేర్పుతూ ఒక ఇన్స్టిట్యూట్‌ను నెలకొల్పుకొన్నారు. దాన్ని వారి శ్రీమతిగారు నిర్వహిస్తూ ఉంటే శ్రీరాంగ్‌ణేకర్‌గారు సంఘకార్య నిమిత్తం మరాట్వాడా అంతా పర్యటిస్తూ ఉండేవారు. సంఘ దృష్ట్యా మరాత్వాడా ఒక విభాగ్, ఆ విభాగ్‌లోని విశ్వవిద్యాలయ విద్యార్థి యంసేవక్ ప్రముఖ్‌గా, జిల్లా బౌద్ధిక్ ప్రముఖ్‌గా - ఇలా వివిధ స్థాయిల్లో అనేక

బాధ్యతల్ని నిర్వహిస్తూ ఉండేవారు. ఏ బాధ్యత ఇచ్చినా నేర్పుపాటించి నిర్వహించటం వారి ప్రత్యేకత.

సంఘంపై మొదటి నిషేదసమయంలో చురుకుగా పనిచేస్తూ పట్టుబడి జైలుకువెళ్ళారు. ఎమర్జెన్సీ సమయంలోవచ్చిపడిన నిషేధ సమయంలో ''మిసా'' క్రింద అరెష్టు చేయబడ్డారు. ఇదంతాగలిపి 19 నెలలు. ఈసమయంలో వారి సతీమణి అటు ఇన్స్టిట్యూట్‌ను అటు ఇంటినీ, చక్కబెట్టుకొంటూగొంతో నిబ్బరంగా మెలగటం ప్రశంసనీయం.

సంఘకార్యంలో తనవంతు సేవను ఎంత చెల్లించగలిగిందీ చెప్పటం కష్టమనీ, కాని సంఘంయొక్క ఆశయాదర్శాలు తనని పూర్తిగా ప్రభావితం చేశాయనీ అంటారు శ్రీరాంగ్‌ణేకర్‌జీ. సంఘ సంపర్కంలోకి రాకపోయి ఉంటే ఎందరెందరో మహనీయులైన సంఘ నాయకులతో పరిచయ భాగ్యానికి నోచుకొని ఉండేవాణ్ణి కాదనిగూడా చెబుతూ ఉంటారు. గొట్టుముక్కల సోమరాజు పిళ్ళారామారావు వంటి మిత్రులు, పరమపూజనీయ శ్రీ గురూజీ, మాననీయ శ్రీ డా॥ఆబాజీథత్తే, మాననీయ శ్రీ మోరోపంతుపింగళే, మా. శ్రీ బాపూరావ్‌జీ మోఘేవంటి మహనీయుల పరిచయం, దర్శనం తన అదృష్టంగా భావించే మహనీయులు శ్రీ రాంగ్‌ణేకర్‌జీ. వారి శ్రీమతిగారిపేరు సౌభాగ్యవతి కుముదిని. ఆమెగారు మరాట్వాడా పట్టభద్రుల నియోజక వర్గంనుండి బి.జె.పి. అభ్యర్థిగా నిలబడి యం.యల్.ఏ.గా ఎన్నికై ఆ బాధ్యతను ఎంతో నేర్పుగా నెఱవేర్చటం జరిగింది.

''14 సం॥ల వయస్సు నుండి ఇప్పటికీ నేను స్వయంసేవకుణ్ణి. తుదిశ్వాసవిడిచే వఱకు స్వయంసేవకుగానే ఉంటాను. నేను స్వయంసేవకుని - అని సగర్వంగా ప్రకటిస్తాను.''

అని వారు ప్రతిజ్ఞాపూర్వకంగా ప్రకటించటం మిక్కిలి స్ఫూర్తిదాయకం. వయోధర్మం తనపని తాను చేసుకొంటున్నా ప్రకృతి సహజంగా వారికి లభించిన ఆచురుకుదనం, వివేకం వారి వ్యక్తిత్వగరిమకు స్ఫోరకాలు. వారు బంధుమిత్ర పరివార సమేతంగా నిత్యకళ్యాణం పచ్చతోరణంగా వెలుగొందుదురుగాక!

# శ్రీ నారాయణ్ గణేశ్ భాట్వాడేకర్



అది 1949 జులై చివరివారంలో ఏదో ఒకరోజు. ఆంధ్రప్రాంతంలో ప్రచారక్‌గా పనిచేయటానికి నాజూకైన రూపం, కంఠస్వరం, సున్నిత స్వభావం గల యువకుడు నాగపూర్ స్టేషన్‌లో గ్రాండ్ ట్రంక్ ఎక్స్‌ప్రెస్‌లో ఎక్కి కూర్చున్నారు. అతనికి వీడ్కోలు ఇవ్వటానికి వచ్చిన ఒక మహనీయుడు అప్పటిదాకా అతనితో మాట్లాడుతూ బండి కదలంగానే అతడు సమర్పించిన నమస్కారాన్ని అందుకొంటూ చేయి ఊపుతూ కనుచూపు మేఅకు ఆర్ద్ర నయనాలతో చూస్తూ నిదానంగా స్టేషన్ బయటకు వచ్చి వెళ్ళిపోయారు. బండికూత బెడుతూ ప్లాట్‌ఫారందాటి గ్రాండ్‌గా వెళ్ళిపోతున్నది. ఆయువకుడెవరో కాదు, శ్రీ నారాయణ్‌రావ్ భాట్వాడేకర్. ఆ మహనీయులెవ్వరోకాదు. అప్పటికి మాననీయ శ్రీ బాలాసాహబ్ దేవరస్. వారికి కార్యకర్తలపై ఎంత ఆత్మీయత!

మరుసటిరోజు ఉదయం ఆగ్రాండ్ ట్రంక్ ఎక్స్‌ప్రెస్ విజయవాడ స్టేషన్‌లో ఆగింది. అది చాలా పెద్ద స్టేషన్! తెలిసిన వాళ్ళకే తికమక! క్రొత్త వాళ్ళవిషయంలో చెప్పేదేముంది! తన కోసం ఎవరో వస్తారన్న సూచనయివ్వబడింది. కాని భయం! వస్తారో, రారో! ఇంతలోకే ఇద్దరు సంఘటోపీ ధారులైన స్వయంసేవకుల దర్శనమైనది. తనవైపే గుర్తిస్తూ వస్తున్నారు. పరస్పర నమస్సులు, స్మితపూర్వభాషణలు అయిపోయినవి. ఆ పెద్ద స్టేషన్‌దాటుకొంటూ బైటికి వచ్చి ముగ్గురూ జట్కాయెక్కి సంఘకార్యాలయంవైపు సాగిపోయారు. ఆయిద్దరు మహనీయులెవ్వరోగాదు. మాన్యులు శ్రీగొట్టుముక్కల సోమరాజుగారు, మాన్యులు శ్రీ భండారు సదాశివరావు గారున్ను. అసలు ఆయిద్దర్నీ చూడంగానే వీరెవ్వరో సామాన్యులుకాదు, అనుకొన్న శ్రీభట్వాడేకర్‌జీకి అసలువాళ్ళెవరో తెలిసిన తరువాత ఆశ్చర్యపోయి అంతటి వాళ్ళు తనకోసం స్టేషన్‌కి రావటమేమిటి? అనుకొని తనలోతాను ప్రీరమ్యత్వం పొందిన వ్యక్తి శ్రీ భట్వాడేకర్.

అది మొదలుకొని 1959 వఱకు గట్టిగా పదేళ్ళు ఆంధ్రలో పనిచేసి, కొంచెం ఆరోగ్యం దెబ్బతింటున్నదని తెలిసికొని, ఇకవెళ్ళిపోతే మంచిదని భావించి వెంటనే ప్రచారక్ జీవితానికి స్వస్తి చెప్పి నాగపూర్‌కి వెళ్ళిపోయారు. కాని అప్పటి నుండి యిప్పటి వఱకు కర్మఠుడైన కార్యకర్తగా కాకపోయినా చుఱుకైన స్వయంసేవకుఁగా నిలిచిన ఆదర్శప్రాయులువారు.

శ్రీ భట్వాడేకర్‌జీ మొదటి రెండు నెలలు ప్రాంతప్రచారక్ శ్రీ బాపూరావ్‌జీ మోఘే సూచనపై విజయవాడలోనే పనిచేశారు. పిమ్మట ఒక సంవత్సరం తెనాలిలో పనిచేశారు. ఆతరువాత ఐదు సంవత్సరాలు ఒంగోలులో ఉన్నారు. దరిమిలా రెండేళ్ళు గుంటూరు మంగళగిరి పట్టణాలు చూస్తూ మంగళగిరిలో ఉండేవారు. సుమారు రెండేళ్ళు నిజామాబాదులో పనిచేసి మెల్లగా స్వగ్రామం నాగపూర్ చేరుకొన్నారు. అయితే యీ అన్ని పట్టణాల్లో కంటె ఒంగోలులో ఉన్న ఆ ఐదుసంవత్సరాలు సంఘపనిచక్కగా చేయగలిగారు. తక్కినచోట్ల తన కంటె పెద్ద అధికారులనీడ ఉండేది. ఒంగోలులో స్వతంత్రంగా వ్యవహరించే అవకాశం లభించినందువల్ల చాలా సంతృప్తిగా కార్యభారం నిర్వహింపగలిగారు. ఇది వారే స్వయంగా చెప్పినవిషయం.

ఒంగోలులో శాఖల సంఖ్య పెరిగింది. శాఖల్లో స్వయంసేవకుల సంఖ్య పెరిగింది. ఓ.టి.సి.కి వెళ్ళే స్వయంసేవకుల సంఖ్య ప్రతిసంవత్సరం పెరగటమేగాని తరగటంలేదు. కార్యకర్తలసంఖ్య పెరిగింది. విస్తారకులు బయలుదేరి ఒంగోలు చుట్టుప్రక్కల దైనందిన శాఖలు, సాప్తాహిక్ శాఖలు పెరిగినవి. ఒకరిద్దరు ప్రచారకులుగూడ వెలువడి శ్రీ భట్వాడేకర్‌గారి స్తిమితమైన కార్యకర్తృత్వశక్తికి ప్రతీకలుగా నిలిచారు. అప్పటికే వెలువడిన పరివారక్షేత్రాలపనిగూడ వ్యవస్థితంగా ఉండేది. మొత్తం పట్టణంలో మంచి సంఘ వాతావరణం నెలకొన్నది. ప్రాణమిచ్చే కార్యకర్తలు తోడైనారు. భోజనం వండుకొనటం, అప్పుడప్పుడు హోటల్‌కు వెళ్ళడం, మరీ పనివత్తిడి ఉన్నప్పుడు స్వయంసేవకుల యిళ్ళల్లో తినటం - ఇలా యే ఇబ్బంది పడకుండా హాయిగా గడిచిపోయింది. వారికి చపాతీలు తినటం అలవాటు. కాని ఆంధ్రప్రాంత్‌లో వరి అన్నమేగాని, గోధుమ రొట్టెలు తినే పద్ధతిలేదు. అది వారికి కొంచెం ఇబ్బందిగానే ఉండేది. ఒంగోలులో ప్రతిరోజుగాకపోయినా, అప్పుడప్పుడు రొట్టెలుచేసే హోటల్ ఒకటుండేది. అక్కడికి వెళ్ళిగాని, కార్యాలయానికి తెప్పించుకొనిగానీ తినేవారు. తక్కిన పట్టణాల్లో ఉన్నప్పుడుగూడ ఇదేవిధంగా ఉండేది. సమస్యలేదు. తెనాలిలో ఉండగా శ్రీ కోటంరాజు దత్తాత్రేయులు, శ్రీ కంభంపాటి

వేంకటనారాయణ, శ్రీ కోటలక్ష్మీనారాయణ శాస్త్రిగారల యిళ్ళల్లో భోజనం జరిగిపోతూ ఉండేది. కొన్నిదశాబ్దాలపాటు శ్రీకంభంపాటి వేంకటనారాయణగారి యింట్లో ఒక భాగమే కార్యాలయం, ఎందరెందరు మహనీయ కార్యకర్తలు, ప్రచారకులు నివసించి వెళ్ళినారో ఆయింట్లో, అక్కడే భట్వాడేకర్‌జీ గూడా ఉండే వారు. తెనాలిలో ఉన్నప్పుడు వారికి అత్యంత ఆత్మీయులుగా మెలిగిన వ్యక్తుల్లో శ్రీశనగపురపు అశ్వత్థనారాయణ. శ్రీ ఓగేటి అచ్యుతరామశాస్త్రి, ముఖ్యులు. ఈయిద్దరూ తెనాలి సంస్కృత కళాశాలలో చదువుతూ ఉండేవారు. ఈ ముగ్గురికీ సంస్కృత భాష మాధ్యమ భాష. చక్కగా సంస్కృతంలో మాట్లాడుకుంటూ ఉండేవారు. వారికి తెలుగు పల్లెటూళ్ళల్లో ''అట్లతదియ'' పండుగ ఎలా జరుగుతుందో చూడాలనిపించింది. శ్రీ ఓగేటి అచ్యుతరామశాస్త్రి వెంట ప్రక్క ప్రక్కనే ఉన్న పితామహస్థానమైన ''యాజలికి'' మాతామహస్థానమైన ''మాచవరం'' గ్రామానికి వెళ్ళి కన్నుల పండువుగా తిలకించటం జరిగింది. ఒంగోలులోవారికి ఇప్పటికీ జ్ఞాపకమున్నపేర్లు చావలికృష్ణమూర్తి, లక్ష్మణ్‌రావ్, డా॥ శేషగిరిరావ్, రామయ్య, శ్రీచుండూరు వెంకటాద్రి ప్రభృతులు. ఇప్పటికీ వారి మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు జరుగుతూనే ఉంటాయి.

శ్రీ నారాయణ్‌రావ్‌జీ తెలుగుచాలా బాగా నేర్చుకొన్నారు. వ్యవహారంలో మాట్లాడు కోవటమేగాక, బౌద్ధికులు కూడా యిస్తూ ఉండేవారు. వారికి సంస్కృతం బాగా వచ్చు. తెలుగులో సంస్కృత శబ్దజాలం ఎక్కువ అని ఆయన అభిప్రాయం. అందువల్ల వారికి తెలుగుచాలా త్వరగా పట్టుబడింది. వచ్చిన క్రొత్తల్లో అప్పుడప్పుడే తెలుగు నేర్చుకొనేరోజుల్లో కొన్ని పదాల అర్థాలు తారుమారుగా అవటంవల్ల జరిగిన వింత ఒకటున్నది. ఒకరోజు కార్యాలయంలో వండుకొని భోజనం చేయబోతున్నారు. పెరుగును చిలికి మజ్జిగ చేద్దామనుకొని అక్కడున్న ముగ్గురు నలుగురు స్వయంసేవకుల్లో ఒకరితో ''రఈకా'' తెచ్చిపెట్టమని అడిగారు. ఆ స్వయంసేవకులు విస్తుపోయారు. వారి ఉద్దేశ్యం ''కవ్వం'' తెచ్చిపెట్టమని. నారాయణరావు ఉచ్చరించిన విధానాన్నిబట్టి వాళ్ళకు ఆమాట స్త్రీలు ధరించే ''రవిక'', ''రైక''గా వినిపించింది. ఆయన ఆ మాటను పలుమార్లు ఉచ్చరించటం, వాళ్ళకి మరింత హెచ్చుతున్న ఆశ్చర్యం! ''ఈ బ్రహ్మచారికి ఆడవాళ్ళ ''రయిక'' ''రవిక'' ''అవసరమేమిటో'' అన్నాట్ట ఒక స్వయంసేవకు. విషయం అందరికీ అర్థమైన పిమ్మట భళ్ళున నవ్వుకున్నారట! (మరాఠీ భాషలో ''రయిక'' అంటే కవ్వం) అప్పటి నుండీ చాలా జాగ్రత్తగా అర్థాలు తెలుసుకుంటూ తెలుగు నేర్చుకొన్నారు. వారు ''దివికేగిన మన దేశభక్తుల'' ''మా ప్రాణాలకు నవప్రాణం'' వంటి తెలుగు సంఘగీతాలు

చాలా మధురంగా పాడేవారు. అప్పటి ఆంధ్రప్రదేశ్ సంఘచాలక్ శ్రీ పి. లింగయ్య చౌదరిగారికి వారి తెలుగు పాటలంటే, అసలు వారి సంఘ పాటలంటేచాలా యిష్టం. స్వాతంత్ర్య వీరసావర్కారు మరాఠీలో రచించిన ''సహేసోనేరే - పానే'' అను పుస్తకాన్ని వారు ఒక తెలుగు స్వయంసేవకు సహకారంతో తెలుగులోకి అనువదించటం జరిగింది. అది ''జాగృతి ప్రకాశన్'' సంస్థవారు ప్రచురించటం జరిగింది! ఇట్లావారు తెలుగుజీవనంలో పెనవేసుకొని పోయినారు.



ఆంధ్రలో పనిచేసిన మహారాష్ట్ర ప్రచారకుల్లో సంఘగీతాలు కమ్మగా పాడగలిగిన వారు ఇద్దరే ఉన్నారు. ఒకరు ఆత్రేజీ, రెండవవారు శ్రీ భట్వాడేకర్‌జీ, ఈరెండవ వారి కంఠస్వరం స్త్రీ కంఠస్వరంవలె ఉండి వీణానాదాన్ని తలపింపజేస్తుంది. వారి ''వందేమాతరం'' వినితీరవలసిందేగాని చెప్పనలవిగాదు. పరమ పూజనీయ శ్రీ గురూజీ కార్యక్రమాల్లో ఎన్నియో సార్లు వారి కమ్మని గాత్రం నుండి జాలువారిన తెలుగు హిందీ గీతాలు శ్రవణ సుఖంగా వినే అవకాశమూ అదృష్టంకూడా లభించింది. ఆత్రేజీ వ్రాసిన ''పవిత్ర జాహ్నవి'' అన్న పాటను వారెంత శ్రావ్యంగా ఆలపించారో పూర్వోక్తం. శారీరక కార్యక్రమాల్లో వారి అభిరుచి అంతంత మాత్రమే! అయితే శారీరక శిక్షణలో గట్టివాళ్ళను శిక్షకులుగా ఎంపికచేసి శాఖాకార్యక్రమాలను పకడ్బందీగా నడిపిస్తూ ఉండేవారు.



విజయవాడలో రెండునెలలు ఉన్న తరువాత శ్రీ భట్వాడేకర్ తెనాలి ప్రచారక్‌గా నియమితులైనట్లు పూర్వోక్తం. విజయవాడనుండి ఒకనాటి రాత్రి రైలుబండిలో వారు తెనాలికి ప్రయాణమైనారు. వారివెంట తెనాలికి చెందిన ఒక స్వయంసేవకు గూడా ఉన్నాడు. ఆతడు విజయవాడ కార్యాలయంలో ఉంటూ చదువుకొంటున్నాడు. రైలుబండి చాలా ఆలస్యంగా దాదాపు రాత్రి 12 గం॥తరువాత చేరింది. ఆరోజుల్లో కమ్యూనిష్టుల మీద పోలీసు నిఘా ఉన్నది. ప్రతి రైలుబండినుండి దిగిన వాళ్ళమీద అనుమానం కొద్దీ చెకింగ్ కూడా ఉండేది. తెనాలి స్టేషన్ దిగి వీళ్ళిద్దరూ బయటకు రాగానే పోలీసులు పట్టేశారు. ఆపోలీసులకు హిందీరాదు. ఈ నారాయణ్‌రావుజీకి తెలుగురాదు. తెలుగొచ్చిన ఆరెండవ వాడు భయపడి నోటమాట పెగలకుండా అయిపోయినాడు. అంతే సరాసరి యిద్దర్నీ తీసుకొని పోయి పోలీస్‌స్టేషన్‌లో కస్టడీలో పెట్టేశారు. ఆశ్చర్యం! ఆపోలీస్‌స్టేషన్ సంఘకార్యాలయానికి సరిగ్గా 50 గజాల దూరంలోనే ఉంది! ఏం లాభం! కొద్దిసేపటికి తెల్లవారింది. ఆరెండవ స్వయంసేవక్‌కి ఎదురుగా సంఘకార్యాలయం చూసేటప్పటికి కాస్తధైర్యమొచ్చింది. పోలీసుల అనుమతితో దారినపోతున్న ఎవరో ఒకవ్యక్తిని పిలిపించాడు.

అతని ద్వారా కార్యాలయానికి కబురువెళ్ళింది. అది కంభం పాటి వెంకటనారాయణగారి యిల్లే. వారు ఇంట్లోనే ఉన్నారు. ఆయన గుంటూరు జిల్లా కార్యావాహ్. మహామేధావి. వారు వెంటనే తెనాలి పట్టణ సంఘచాలకులు, వకీలు అయిన శ్రీ కోట లక్ష్మీనారాయణ శాస్త్రిగారి దగ్గఱకు వెళ్ళి పోలీసుస్టేషన్‌కి తీసుకొని వచ్చారు. శ్రీ శాస్త్రిగారు ఆయిద్దరూ సంఘ స్వయంసేవకులనిచెప్పి జామీను ఇచ్చి విడిపించారు.

ఒంగోలు తరువాత వారు సుమారురెండేళ్ళు గుంటూరులో ప్రచారక్‌గా ఉన్నారు. అది పెద్ద పట్టణం. గొప్ప విద్యాకేంద్రం. సంఘదృష్ట్యాగా కూడా చాలా ప్రముఖ స్థానమాక్రమించింది. అక్కడి స్వయంసేవకులతో వ్యవహరించటం తనకు చాలా కష్టమైనదంటారు. శ్రీ నారాయణ్‌రావ్‌జీ. శ్రీ గురూజీకి సమర్పించిన శ్రద్ధానిధి కార్యక్రమం గుంటూరులో జరిగింది. అప్పుడువారు గుంటూరు ప్రచారక్. ఘోష్‌లో వారికి ఆనక్, వంశీ యీరెండూ బాగా వచ్చు. అందువల్ల వారిని ప్రాంతఘోష్ ప్రముఖ్ చేయటం జరిగింది. వారితోనే ప్రాంతస్థాయి ఘోష్ ప్రారంభమైనది. ఘోష్ ప్రముఖ్‌గా, సంఘగీత్ ప్రముఖ్‌గా శ్రీ గురూజీతోపాటు వారి ఆంధ్ర పర్యటనలో రెండుసార్లు వారి వెంట ఉన్నారు వీరు.

గుంటూరు నుండి నిజామాబాద్ జిల్లా ప్రచారక్‌గా వెళ్ళారు. అక్కడ సుమారు ఒక సంవత్సరం ఉన్నారు. నిజామాబాద్ పట్టణంలో 4,5, శాఖలుండేవి. జిల్లాలో ఎక్కడా లేవు. ఆ జిల్లాలో సంఘ విస్తరణ కార్యం గుఱించి ఆలోచిస్తూ ఉండగా వారి తల్లిగారు గతించారు. వారు వెళ్ళిపోయారు.

శ్రీ నారాయణరావ్‌జీ గణేశ్ భాట్వాడేకర్ 1928 ఫిబ్రవరి 21వ తేదీనాడు విదర్భయందలి అమరావతీ జిల్లాలోని ''పరత్‌వాడ'' అనే గ్రామంలో జన్మించారు. సోదరులు 5గురు. సోదరీమణులు ఇద్దరు. వీరందరిలోను వీరు ఐదవవారు. 1938 నుండి సంఘ స్వయంసేవకు. వారి అన్నగారు శ్రీ కృష్ణారావ్‌జీ 1940లో నాగపూర్‌లో ఓ.టి.సి. చేశారు. శ్రీ నారాయణ్‌రావ్‌జీ 1945లో మెట్రిక్‌లో ఉత్తీర్ణులై నాగపూర్ చేరుకున్నారు. అక్కడే ''మిలిటరీ ఎక్కౌంట్సు'' డిపార్ట్‌మెంటులో నాలుగేళ్ళు ఉద్యోగం చేసి అదివదిలిపెట్టి రైల్వే ఉద్యోగంలో చేరారు. బొంబాయిలో ఉండగా గణేశ్ ఉత్సవాల్లో పాటలుపాడుతూ ఉంటే మహారాష్ట్ర ప్రాంత సంఘచాలక్ శ్రీకాశీనాథ్ లిమయేభలే మెచ్చుకొనేవారు. 1948లో సంఘంపై నిషేధం వచ్చింది. సరిగ్గా అప్పుడేవారి ఆరోగ్యం సరిగాలేనందువల్ల ఆ ఉద్యోగం మానేసి నాగపూర్ వాపస్‌వెళ్ళిపోయారు. సంఘంపై నిషేధం

తొలగింపబడిన తరువాత నాగపూర్‌లోని గోర్సన్‌శాఖకు వెళుతూ ఉండేవారు. ఆరోజుల్లో నాగపూర్ పట్టణ కార్యవాహక్‌గా శ్రీ బచ్ రాజ్‌జీ వ్యాస్ ఉండేవారు. తాను తన శాఖలో తరుణ గణశిక్షక్‌గా ఉండేవారు. అప్పుడే 1949లో ప్రథమ వర్ష సంఘ శిక్షావర్గ పూర్తి చేశారు. పిమ్మట ప్రచారక్‌గా వెళ్ళటానికి నిశ్చయించుకొని తన శాఖ ముఖ్యశిక్షకులైన శ్రీ అణ్ణాసాహెబ్ ఉధోజీ ద్వారా మాననీయ శ్రీబాలాసాహెబ్ దేవరస్‌ను కలుసుకొన్నారు. వారు ''ఏ ప్రాంతంలో పనిచేస్తావు?'' అని అడిగారు. ''ఎక్కడికి పంపితే అక్కడకు వెళ్ళి పనిచేస్తాను'' అని చెప్పారు. ఆంధ్రకు వెళ్ళమని ఆదేశించారు.

1959-60సం॥లో ప్రచారక్‌గా విరమించుకొన్న తరువాత వారు మద్రాసులోని తన మిత్రుడు అగర్వాల్ దగ్గర పనిచేస్తూ ఆరునెలల తరువాత బళ్ళారికి బదిలీయై పోయినారు. అక్కడుండగానే 1962 మార్చి 18నాడు నాగపూర్‌లో వివాహమైనది. దరిమిల బళ్ళారినుండి నాగపూర్ వెళ్ళిపోయారు. శ్రీ నారాయణ్‌రావ్‌జీకి ఒక కూతురు, ఒక కొడుకున్ను. ఇద్దరూ వివాహితులే. కూతురుమాధవి. కొడుకు గణేశ్. ప్రథమ వర్ష శిక్షితుడు. శ్రీమతి నారాయణరావ్‌జీపేరు విజయ. మహిళా సత్యాగ్రహ జట్టులో పాల్గొని రెండునెలలు కారాగార వాస శిక్ష అనుభవించటం జరిగింది. నాగపూర్‌లో సమర్థ నగరంలో ఒక చిన్నయిల్లు యేర్పాటు చేసుకొని సుఖజీవనం చేస్తున్నారు. వాళ్ళ బస్తీలో ఉన్నశాఖకు వెళుతూ ఉంటారు. మొన్నమొన్నటిదాకా ముఖ్యశిక్షక్, కార్యవాహ్, మండల్‌కార్యవాహ్ ఇత్యాదిగా వివిధ స్థాయిల్లో పనిచేశారు. చేస్తున్నారు. ఆ బస్తీలో ఆయన పేరు తెలియని వ్యక్తులు ఉండటానికి వీల్లేదు. అంత ప్రసిద్ధులు. ఆయా కంపెనీలల్లో, దుకాణాలలో, సొసైటీలల్లో లెక్కలు వ్రాస్తూ, వచ్చిన దానితో కాలం గడుపుతున్నారు. వారికి ప్రతి సంవత్సరం ఒంగోలు స్వయంసేవకులు బట్టలు పంపుతూ ఉంటారు. కొన్నాళ్ళ క్రిందట వారి శ్రీమతి గారు మరణించటం జరిగింది.

శ్రీ భట్వాడేకర్‌జీ చాలా సున్నిత హృదయులు. నాగపూర్‌లో వారిని చూడటానికి వెళ్ళినప్పుడు, నలభై యేళ్ళ తరువాత మళ్ళీ మొదటిసారి కలుసుకుంటున్న సందర్భంలో - గతమంతా ఒక్కసారి జ్ఞాపకమొచ్చి బావురుమంటూ ఆనంద విషాద మిశ్రితమైన విచిత్ర స్థితిలోకి కూరుకొనిపోయారు. కోపమంటే యేమిటో తెలియని శాంతమూర్తి, ప్రపంచాన్నంతా వడపోసినంత అనుభవమున్నా యేమీ తెలియని వానివలె వ్యవహరించు వ్యక్తి. అల్పసంతోషి. నిత్యమూ కలకల నవ్వుతూ కాన్పించే సాధుపురుషుడు - ఇలా యెంత చెప్పినా తరగని, తనివి తీరని మహనీయుడు. శతంజీవులై నిత్యకల్యాణం పచ్చతోరంగా వర్ధిల్లుదురుగాక!

# కర్ణాటక హైదరాబాద్ సంస్థానాల్లో సంఘకార్య ప్రారంభం

## శ్రీ యాదవరావ్‌జీ జోషి



మాననీయ శ్రీయాదవరావ్‌జీ జోషి కర్ణాటక ప్రాంతంలో సంఘకార్యాన్ని ప్రారంభించి విస్తరింపజేసిన మహనీయులు. శ్రీయుతులు జగన్నాథరావ్ జోషి, శేషాద్రి, సూర్యనారాయణ రావు, కృష్ణప్ప, మల్లికార్జునయ్య, బాబూరావ్ దేశాయ్ మొదలగు అగ్రశ్రేణికి చెందిన నాయకులను, కార్యకర్తలను నిర్మించి ఆ ప్రాంతంలో సంఘం యొక్క అదృష్టాన్ని పండించిన మహితాత్ముడు. 1938, 39 నుండి 1992లో దివంగతులై నంతవరకు- సుమారు 53 సంవత్సరాల సుదీర్ఘకాల ఖండంలో బెంగుళూరు కేంద్ర బిందువుగా ఒక్క కర్ణాటక ప్రాంతానికేగాదు; దక్షిణావనికి మాత్రమే కాదు; మొత్తం దేశానికే స్ఫూర్తికేంద్రంగా నిలిచిన అఖండ ప్రజ్ఞాధురీణులు. ప్రాంతప్రచారక్, దక్షిణాంచల ప్రచారక్, సహబౌద్ధిక్ ప్రముఖ్, బౌద్ధిక్ ప్రముఖ్, సహకార్యవాహక్ ఇత్యాది అనేక బాధ్యతల్ని అద్వితీయ సర్వతోముఖ ప్రజ్ఞాకంగా నిర్వహించిన ధీశాలి. దక్షిణ భారతంలో బెంగుళూరును సంఘసాహిత్యానికి ప్రముఖ స్థానంగా నిలిపి, సిద్ధాంతపరమైన సాహిత్య స్రోతస్సును ప్రవహింపజేసిన మార్గదర్శకుడు, తాత్త్వికుడు. ఎటువంటి కార్యశైలి సృజనాత్మక శక్తికి ప్రాణభూతమో అట్టి కార్యశైలికి ప్రతీకగా నిలిచిన తేజస్వి.

శ్రీయాదవరావ్‌జీ గొప్ప సంగీత ప్రియుడు, గాయకుడు, తత్కళాకోవిదుడు. వారికొక సంగీత గురువు ఉండేవారు. ఆయన ఒకానొక పుస్తకంలో ఇలా వ్రాసినట్లు తెలిసినవారు చెప్పటం జరిగింది : ''సంగీతంలో నాకు ఇద్దరు శిష్యులుండేవారు. ఇద్దరూ ఎంతోపైకి రావలసిన దిట్టలే. ఒకడు చాలా పైకివచ్చెను. రెండవవాడు ఆర్.యస్.యస్. సేనలోబడిపోయినాడు. ఆతనిపేరు యాదవరావ్ జోషి'' ఆపుస్తకాన్ని శ్రీయాదవ్‌రావ్‌జీ

చివరివఱకు తన వెంట ఉంచుకొని ఎంతో మురిసిపోతూ ఉండేవారనికూడ తెలిసిన వారు చెప్పినారు. అంతటి సంగీత ప్రియుడు దానికి బొత్తిగా స్వస్తిచెప్పి ఏకనిష్ఠ స్వయంసేవకుగా జీవితపుష్పాన్ని హిందూ సమాజ పురుషుని పాదాల చెంత సమర్పించిన వివేకశీలివారు.

డాక్టర్‌జీ జీవితంలోని మధుర స్మృతుల్ని సమీకరించిన ''స్మృతికణాలు'' పుస్తకంలో పలుమార్లు శ్రీయాదవరావ్‌జీ దర్శనం మనకు లభిస్తుంది. డాక్టర్‌జీకి సన్నిహితులుగా మెలిగిన భాగ్యశాలి. ప్రసన్న మూర్తి. మృదుల స్వభావుడు. గొప్ప వక్త. హైదరాబాదులో ''శ్రీజయరామ్‌జీ'' అనే ప్రఖ్యాతి వహించిన కార్యకర్త ఒకరున్నారు. వారు నాందేడ్‌లో ఒకసారి శ్రీ యాదవరావ్‌జీ బౌద్ధిక్ వినటం జరిగింది. ఆ క్షణం నుండి వారు స్వయంసేవకులైనారు. ఆరోజునుండి గొప్ప కార్యకర్త ఐనారు. ఇదొక చిన్న ఉదాహరణమాత్రమే. ఇలా యెన్ని వందల వేల మందిని వారు సృష్టించారో చెప్పతఱంగాదు! వారి జననాభిజనములను గూర్చిన వివరాలు స్పష్టంగా లభింపకపోవుట తీరనిలోటు.

శ్రీ యాదవ్‌రావ్‌జీ ప్రచారకుగా వెలువడిన తొలిదశలో బెల్గాం పట్టణం కేంద్రంగా సంఘవిస్తరణ కార్యాన్ని ప్రారంభించారు. దరిమిలా 1950 నాటికి బెంగుళూరు కేంద్రంగా తమ కార్యాన్ని విజృంభింపచేశారు. వారు బెల్గాంలో ఉన్నప్పుడే మొత్తం హైదరాబాదు సంస్థానం సంఘదృష్ట్యా ఒక విభాగ్‌గా కర్ణాటక ప్రాంతానికి అనుబంధంగా చేయబడింది. అప్పుడే బెల్గాంనుండి వారు శ్రీధర్ కామత్, శ్రీ అభ్యంకర్ శ్రీ బాలాసాహెబ్‌కాళే, వంటి కార్యకర్తల్ని, ప్రచారకుల్ని హైదరాబాద్‌లో సంఘకార్య ప్రారంభానికి, విస్తరణకు పంపటం జరిగింది.

హైదరాబాదు సంస్థానంలో 1938 ప్రాంతంలో హిందువులపై ముస్లింలు సాగించిన దౌర్జన్యకాండ ఫలితంగా హిందువుల్లో ఒక ప్రతిక్రియాత్మక ధోరణి దేశభక్తి రగులుకొనటం ప్రారంభించింది. ఆదౌర్జన్య కాండను ఎదుర్కొనటానికి ఆర్య సమాజం వారు నిర్వహించిన సత్యాగ్రహం ఒక భావాత్మకమైన దేశభక్తిని ప్రోదిచేసింది. ఇట్టి అనుకూల వాతావరణంలో సంఘకార్యం ప్రారంభించటానికి శ్రీ భయ్యాజీ దాణీవంటి సంఘ మహనీయులు ప్రయత్నించారు. ఏమైనా తొలి రోజుల్లో సంఘకార్యక్రమాలు సంఘం పేరుతోగాక ఎన్నో పేర్లతో పిలువబడుతున్న సంస్థల రూపంలో జరుగుతూ ఉండేవి. ఈ పరిస్థితుల్లో 1946 ఆగస్టులో సంఘం పేరుతోగాక పోయినా స్పష్టరూపంలో సంఘకార్యం

ప్రారంభమైనదని చెప్పవచ్చు. ఆక్రమ వికాస వివరాలు తరువాతి పుటల్లో పేర్కొన బడగలవు. 1953లో తెలంగాణా జిల్లాలు ఆంధ్రప్రాంతానికి అనుబంధంగా చేర్చేవఱకు హైదరాబాదు సంఘకార్యకలాపాలు శ్రీయాదవ్‌రావ్‌జీ జోషి ఆధ్వర్యంలో జరుగుతూ ఉండేవి.

## శ్రీధర్ విష్ణుపంత్ కామత్



హైదరాబాదు నగరంలో 1946 ఆగస్టులో మొట్టమొదటి సంఘశాఖ ప్రారంభమైనది. ప్రారంభించిన మహనీయులు శ్రీధర విష్ణుపంత్ కామత్‌గారు. ఆ వరుసలో ఔరంగాబాదులో గూడ తొలి సంఘశాఖను నెలకొల్పినవారు శ్రీ శ్రీధర్‌కామత్‌జీయే. తొలుత వారివ్యక్తిగత పరిచయాల్ని చేసుకొన్న పిమ్మట హైదరాబాదులో సంఘ విస్తరణ కార్యాన్ని గూర్చి తెలుసికొందముగాక.

శ్రీ శ్రీధర విష్ణుపంత్ కామత్‌గారు 1924 అక్టోబర్ 6వతేదీన, దసరాపండుగనాడు కర్ణాటక ప్రదేశ్‌లోని బెల్గాం పట్టణంలో జన్మించారు. బెల్గాంలోని లింగరాజ్ కాలేజీలో ఇంటర్ మీడియేట్, ధార్వాడ్‌లోని కర్ణాటక కాలేజీలో బి.యస్.సి. చదివి ఉత్తీర్ణులైనారు. 1946లో బి.యస్.సి. పూర్తిచేసిన తరువాత, అదే సంవత్సరం జూన్‌నెలలో హైదరాబాదుకు ప్రచారక్‌గా వచ్చి ఆగస్టునెలలో శాఖను ప్రారంభించటం జరిగింది. అప్పటికి వారి వయస్సు సుమారు 22 సంవత్సరాలు.

మాననీయ శ్రీ యాదవరావ్‌జీ జోషి ప్రేరణవల్ల శ్రీకామత్‌జీ ప్రచారకుగా రావటం జరిగింది. ఒకసారి బెల్గాంలో కాలేజీ విద్యార్థులకోసం ఒక సమావేశం ఏర్పాటు చేయబడింది. అందులో శ్రీయాదవరావ్‌జీ ముఖ్యఅతిథిగా పాల్గొన్నారు. తమ ప్రసంగంలో సంఘవిస్తరణకార్యాన్ని గూర్చి వివరించారు. హైదరాబాదులో సంఘకార్యాన్ని ప్రారంభించవలసిన ఆవశ్యకతను గూర్చి తెలియజేశారు. అందుకొఱకు ప్రచారకులుగా రావలసిందిగా వారికి పిలుపునిచ్చారు. హైదరాబాదులో సంఘకార్యాన్ని ప్రారంభించటం ఎంత కష్టమోగూడ వర్ణించి చెప్పారు. ఏపద్ధతిలో అక్కడ కార్యాన్ని ప్రారంభింపవచ్చునో

గూడ పలురకాల సూచనలు చేశారు. ఆమేఅకు హైదరాబాదు వెళ్ళటానికి నిశ్చయించుకొని ప్రచారకుగా బయలుదేరిన వ్యక్తి శ్రీ శ్రీధర్ కామత్‌జీ. జూన్‌లో బయలుదేఱివచ్చి ఆగస్టులో తొలిశాఖను నెలకొల్పారు. అప్పుడు హైదరాబాదు సుల్తాను బజారులో నివసిస్తున్న వకీలు శ్రీ తళ్‌పలీకర్ గారియింటిలో వారి మకాం. శాఖ సుల్తానుబజార్‌లో ప్రారంభింపబడినట్లు భావింపబడుతున్నది. అయితే, అది యిప్పుడు మనంచూస్తున్న శాఖా స్వరూపంలోగాక భిన్నరీతిలో ఉండేది.

అలనాటి నిజాం నవాబు జమానాలో హైదరాబాదు నగరంలో ప్రవేశించటం కొంత కష్టంగానే ఉండేది. కరోర్ గోలీచుంగీ బంగళాదగ్గఱ వచ్చే పోయే బాటసారుల్ని, నిలబెట్టి, ఆచూకీ తీసే పద్ధతులు కొన్ని వుండేవి. అందుకని, అలా ప్రవేశించే వాళ్ళు వేషం మార్చి కుర్తా, పైజామాధరింపవలసివచ్చేది. ఇది ప్రాథమికంగా తెలిసికొనవలసిన అప్పటి పరిస్థితి. అది రజాకారులు అప్పుడప్పుడే చెలరేగుతున్న సమయం. ప్రభుత్వగూఢచారులు రహస్యంగా జాడలు తీస్తున్నకాలం.

అక్కడొకచోట తెలుగుపద్మశాలీలు అధికంగా నివసిస్తూ ఉండేవాళ్ళు. వారు రాత్రి పూట గుళ్ళల్లోచేరి, భజనలు, కీర్తనలు, పాడుతూ కలుస్తూ ఉండేవాళ్ళు. అవి మహారాష్ట్ర, తెలుగు, హిందీ భాషల్లో సాగుతూ ఉండేవి. వాళ్ళతో కలిసి మెలిసి తిరుగుతూ, సంఘశాఖను నెలకొల్పారు. శ్రీ శ్రీధర కామత్‌గారు క్రమంగా హిందుత్వ భావధారనుగూర్చి ముచ్చటిస్తూ ఉండేవారు. ఇదీ స్థూలంగా ఆనాటి తొలి శాఖా స్వరూప స్వభావాలు.

సికిందరాబాదు కంటోన్మెంటు అక్కౌంటెంట్ కార్యాలయంలో విదర్భనుండి వచ్చిన పలువురు స్వయంసేవకులు పనిచేస్తూ ఉండేవారు. మహారాష్ట్రనుండి చదువుకోసమో, ఉద్యోగంకోసమో వచ్చిన స్వయంసేవకులుండేవారు. వీరందర్నీగుర్తుపట్టి, పరిచయం చేసుకొని, సంబంధాలు పెంచుకొని ఏదో ఒక రూపంలో చిన్నచిన్న కార్యక్రమాలు నిర్వహిస్తూ ఉండేవారు. వకీలు వృత్తిలో ఉండేవారితో సంబంధాలు పెట్టుకొని వారి క్లయింట్స్‌వలె వ్యవహరిస్తూ చిన్న చిన్న బృందాలుగా మసలుతూ ఉండేవాళ్ళు. సంఘస్వయం సేవకుల్లో ఎక్కువ మంది ఉపాధ్యాయులు కావటం వల్ల ట్యూషన్ చెప్పే నెపం మీద విద్యార్థుల్ని ఆకర్షిస్తూ సమావేశమౌతూ ఉండేవారు.

ఈ అన్ని విధాల బృందాలకు కలిపి యెప్పుడో ఒకసారి యెక్కడో సమావేశాలు

జరుగుతూ ఉండేవి. చిన్న చిన్న బౌద్ధికులు, ప్రార్థన చేస్తూ ఉండేవారు. అంతేగాని, బహిరంగంగా, నిత్యము, శాఖలు నడపటం తొలిదశలో కొంత ఇబ్బందిగానే ఉండేది.

1946 సం॥చివరిభాగంలో పరమ పూజనీయ శ్రీగురూజీ ఒక ధర్మగురువుగా హైదరాబాదు రావటం జరిగింది. ఆపేరు మీదనే వారి ఉపన్యాస కార్యక్రమం ఏర్పాటు చేయటంకోసం అప్పటి నిజాం సర్కారు నుండి అనుమతి తీసుకొనటం జరిగింది. శ్రీగురూజీ ఉదయం పూట విమానంలో సికిందరాబాద్ విమానాశ్రయంలో దిగి మధ్యాహ్నం రెండుగంటల సమయంలో సమావేశానికి విచ్చేశారు. స్వయంసేవకులు, ఇతర ప్రముఖుల సమక్షంలో వారి బౌద్ధిక్ జరిగింది. ఆంగ్లభాషలో ఇచ్చిన అద్భుతమైన ఉపన్యాసమది. ఆసాయంత్రమేవారు తిరిగి నాగపూర్‌వెళ్ళిపోయారు. ఆసమావేశానికి హాజరైన శ్రోతల సంఖ్య సుమారు నూట యాభైమంది.

శ్రీ శ్రీధరకామత్ వంశీగానంలోను, శంఖనాదంలోను మంచి నేర్పరి. చాలా కాలం బెల్గాంలో ఘోష్ ప్రముఖ్‌గా ఉండేవారు. సంఘపాటలు పాడటంలోను, కవితా పఠనంలోను, సిద్ధహస్తులు. ఇలా రహస్యంగా సంఘకార్యాన్ని ప్రారంభించి, విస్తరింపజేస్తూ 1947జనవరి ప్రాంతంలో ఒకసారి బెల్గాం వెళ్ళి శ్రీయాదవ్‌రావ్‌జీ జోషికి పరిస్థితుల్ని సాకల్యంగా వివరించి తనకుతోడుగా ఇంకనూ ఒకరిద్దరు ప్రచారకుల్ని పంపవలసిందిగా కోరినారు. ఆమేఱకు శ్రీయాదవరావ్‌జీ బెల్గాం నుండి శ్రీగజానన్ కేశవసాఠేని, సతారా నుండి శ్రీసద్భావుకులకర్ణిని ప్రచారకులుగా హైదరాబాదుకు పంపటం జరిగింది. శ్రీధర్‌కామత్‌జీతోపాటు ఈ ప్రచారకులందరు క్రొత్తగా హైదరాబాదుకు వచ్చిన రోజుల్లో గడ్డం పెంచుకొని ఎఱ్ఱటోపీ ధరిస్తూ ముస్లిం గూఢచారుల దృష్టినుండి తప్పించుకుంటూ తిరుగూతూ ఉండేవారు.

శ్రీ శ్రీధర్‌కామత్‌జీ 1946 జూన్ నుండి రెండు సంవత్సరాలు ప్రచారక్‌గా పనిచేసినారు. పిమ్మట సంఘం మీద 1948లో వచ్చిన నిషేధ సమయంలో కూడ కొంతకాలం చుఱుకుగా పనిచేశారు. నిషేధం ఎత్తివేసిన నాటికి ప్రచారక్‌గా విరమించుకొని జీవితంలో స్థిరపడే ప్రయత్నం ప్రారంభించారు. 1949లో వివాహం చేసుకొన్నారు. ఆవరుసలో బొంబాయి యూనివర్శిటీ నుండి ఎం.ఎస్.సి.లో ఉత్తీర్ణులైనారు. దరిమిల బెల్గాంలో ఒక సంవత్సరంపాటు స్కూల్ టీచరుగా పనిచేశారు. ముంబైలోని సిద్ధార్థ కాలేజీలో ఫిజిక్సు లెక్చరర్‌గా పనిచేసినారు. 1964నుండి ముంబైలోని గోరేగావ్ నందలి పాట్కర్ కాలేజీలో లెక్చరర్‌గా పనిచేసి, అక్కడే 1971 నుండి 1984వఱకు ప్రిన్సిపాల్‌గా

వ్యవహరించి ఉద్యోగ విరమణ చేసినారు. అనంతరం జూడ్స్ అపార్ట్‌మెంట్స్, గిరీమ్, మాపుసా - బార్డేశ్, గోవాలో స్థిరనివాసం ఏర్పాటుచేసికొని 1985 సెప్టెంబర్ 22వ తేదీనాడు సంధి వాతంతో హఠాన్మరణం చెందారు.

శ్రీ శ్రీధర్ కామత్‌జీ తండ్రి పేరు విష్ణుపంత్ వేంకటేశకామత్, తల్లిపేరు భాగీరథి. సతీమణి పేరు శ్రీమతి కాళిందీ శ్రీధర్ కామత్. వీరికి ఇద్దరు కొడుకులు. పెద్దవాని పేరు జనార్దన్‌కామత్, రెండవవాని పేరు?. ఇద్దరు కూతుళ్ళు. పెద్దకూతురుపేరు ఇంద్రాయణీ కుమార్ దివేకర్. చిన్నకూతురు పేరు స్వాతీరామ్‌ప్రసాద్‌జోషి. ఈమె గోవారాష్ట్ర భారతీయ జనతాయువమోర్చా మహిళావిభాగ్ ప్రధానకార్యదర్శిగా ప్రస్తుతం పనిచేస్తున్నారు. ఈకుటుంబసభ్యులందరూ స్వయంసేవకులే.

మాన్యులు శ్రీ శ్రీధరకామత్‌గారు చివరి వఱకు చుఱుకైన స్వయంసేవక్‌గానే జీవించారు. నియమం తప్పకుండా కనీసం అందుబాటులోనున్న సాప్తాహిక శాఖకైనా వెళుతూవుండేవారు. కన్నడ, మరాఠీ, హిందీ, ఇంగ్లీషు భాషల్లో దిట్ట. మంచి వక్త. తఱచు శాఖల్లో బౌద్ధికులు ఇస్తూ ఉండేవారు. శ్రీగురూజీ దివంగతులైనప్పుడు వారు ఎంతో దుఃఖించారు. ఒక సంవత్సరం పాటు శ్రీ గురూజీకి శ్రద్ధాంజలి సమర్పకంగా నియమబద్ధమైన సాధారణ జీవితం గడిపినారు. సంఘకార్యం - భగవద్గీతాధ్యయనం. ఈ రెండూ వారికి జీవితాంతం చాలా ఇష్టమైన క్రతువులు! సంఘ చరిత్రలో వారు చిరస్మరణీయులు.

## శ్రీ సద్భావూ కులకర్ణి

శ్రీధర కామత్‌జీకి సహాయకులుగా మహారాష్ట్రలోని సతారా నుండి వచ్చిన మరొక ప్రచారక్ శ్రీ సద్భావూకులకర్ణి. వీరు హైదరాబాదు నగరంలోనే పనిచేయటం జరిగింది. వారిని గూర్చి తక్కువ కాలం పనిచేసిన ప్రచారక్ అనటం కంటె ఎక్కువ కాలం పనిచేసిన విస్తారక్ అవటం మేలు. వీరిని గూర్చి మఱికొన్ని వివరములను సేకరింపవలసియున్నది.

# శ్రీ గజానన్ కేశవరావ్ సాఠే



వీరు బెల్గాం వాస్తవ్యులు. 1947 నుండి 49 వఱకు ప్రచారకుగా పనిచేసినారు. అయితే హైదరాబాదులో కొన్నిరోజులు మాత్రమే ఉండి మిగతా సమయమంతా ఔరంగాబాదులో పనిచేసిరి. ఔరంగాబాదులో శాఖ ప్రారంభించినవారు శ్రీధరకామత్‌జీయే. దరిమిలా దానిని మఱికొంత అభివృద్ధి పఱచిన వారు శ్రీగజానన్‌జీ. వీరు 1941, 42, 43లలో వరుసగా మూడు శిక్షావర్గలు పూర్తిచేశారు. 1938లో పూనానుండి శ్రీ బాలకృష్ణ గాడ్గిల్ అనువారు వచ్చి బెల్గాంలో సంఘకార్యాన్ని ప్రారంభించారు. అప్పటి నుండీ శ్రీధర్‌కామత్ శ్రీగజానన్‌జీలు అక్కడ స్వయంసేవకులైనారు. డాక్టర్జీని దర్శించిన అదృష్టవంతులువీరు. బెల్గాంలో కొన్నాళ్ళు ఘోష్ ప్రముఖ్‌గా పనిచేశారు. కేంద్ర ప్రభుత్వరోడ్డు రవాణా సంస్థలో డిప్యూటీ డైరెక్టరుగా పనిచేసి, ఉద్యోగ విరమణ చేసి బెల్గాంలోనే స్థిరపడినారు. ఇప్పటికీ ప్రభాత్ శాఖకు ప్రతిరోజూ వెళుతూ ఉంటారు.

# శ్రీవిష్ణుఫాటక్ (రఘువీర)

వీరు వస్తుతః గుల్బర్గాకు చెందిన వారు. గుల్బర్గా నిజాం స్టేట్‌లోని కర్ణాటక జిల్లా కావటంవల్ల రాజధానియైన హైదరాబాదు నగరంలో బాగా సంబంధం ఉన్నవారు. హైదరాబాదులో సంఘకార్యాభివృద్ధికి కృషిచేసినవ్యక్తి. తొలుత మామూలు కార్యకర్తగాను, మలుత ప్రచారక్‌గాకూడా పనిచేసిన మహనీయుడు. మంచి ప్రజ్ఞాశాలియైన కార్యకర్తగా పేరుగడించారు. శ్రీధరకామత్‌జీతో కలిసి పనిచేసిన అదృష్టవంతుడు, ప్రస్తుతం గుల్బర్గాలోనే నివసించుచున్నట్లు తెలియుచున్నది.

# శ్రీ పైఠణ్‌జీ

వీరు హైదరాబాదు నగరంలోనే తయారైన మంచి కార్యకర్త. శ్రీదత్తాజీఫాలేతరానికి చెందినవారు. తొలుత హైదరాబాదులోను పిమ్మట ఔరంగాబాదులోను విస్తారక్‌గా పనిచేసిన మహనీయుడు.

# శ్రీ ప్రహ్లాద్‌జీ అభ్యంకర్

మాననీయ శ్రీ. ప్రహ్లాద అభ్యంకర్‌గారు 1937లో ముంబైనగరంలో మొదట స్వయంసేవకులైనారు. 1942లో తృతీయ వర్ష సంఘ శిక్షా వర్గ పూర్తిచేసిన తరువాత, అదే సంవత్సరం చివరిభాగంలో ముంబైలోనే ప్రచారక్ బాధ్యతను చేపట్టినవారు. 1947 వఱకు ముంబై జిల్లా ప్రచారక్‌గా పనిచేశారు. పిమ్మట జీవితంలో స్థిరపడాలనుకొని చిన్న ఉద్యోగంలో ప్రవేశించారు. ఇంతలో సంఘకార్యం చేయటానికి హైదరాబాదుకు వెళ్ళవలసిందిగా అధికారులు ఆదేశించటంతో చేస్తున్న ఉద్యోగాన్ని విడిచిపెట్టి హైదరాబాదుకు రావలసి వచ్చింది. శ్రీ అభ్యంకర్‌గారిది ఒకప్పుడు హైదరాబాదు నగరమే. అందువల్ల సంతోషంగా మళ్లీ ఒక సంవత్సరం పాటు ప్రచారకుగా పనిచేయటానికి హైదరాబాదుకు విచ్చేశారు.

ఆ సమయంలో అక్కడ మా. శ్రీధర్ కామత్‌గారు ప్రచారక్‌గా ఉండినారు. ఆ రోజుల్లో హైదరాబాదు రాజ్యంలో సంఘం పేరుతో పనిచేయటం చాలా సాహసంతో కూడినపని. ఆపేరుమీద ఆడుకోవటానికి గూడ వీలుండేదిగాదు. మొత్తం హైదరాబాదు సంస్థానాన్ని సంఘదృష్ట్యా ''కామత్ విభాగ్'' అని స్వయంసేవకులు పిలుస్తూ ఉండేవారు.

ఆరోజుల్లో నిత్యము శాఖలకు వచ్చే విద్యార్థుల్లో శ్రీబాబాసాహెబ్‌తళ్ పుళీకర్, శ్రీపర్లేకర్ సోదరులు (శ్రీ శరత్‌పర్లేకర్‌జీ) శుక్లా సోధరులు మొదలైన వారు ముఖ్యులు. అప్పుడు కార్యాలయం జామ్‌బాగ్ నందలి సుందరభవనంలో హరిభావూదాళ్వాగారి యింటిలో ఉండేది. (ఈ సుందరభవనం ఇప్పటికీ చాలా దృఢంగా ఉండియెన్నో కుటుంబాల వారు కాపురముంటున్నారు. కొందరు స్వయంసేవకులుగూడా ఉన్నారు.) రజాకార్లదుండగాలు ముమ్మరంగా సాగుతున్న దుర్దినాలవి. ఎప్పుడు ఏం జరుగుతుందో అన్న భయం పట్టిపీడిస్తున్న భీతావహస్థితి.

మాననీయ శ్రీ యాదవరావ్‌జీ జోషి తఱచుగా హైదరాబాదువస్తూ ఉండేవారు. అప్పుడు హైదరాబాదు సంస్థానం మొత్తం సంఘదృష్ట్యా ఒక విభాగ్‌గా కర్ణాటక ప్రాంతంలోని అంతర్భాగంగా శ్రీయాదవరావ్‌జీ ఆధ్వర్యంలో ఉండేది. శ్రీ అభ్యంకర్జీ ఒక సంవత్సరం మాత్రమే పనిచేసి మళ్ళీ ముంబై వెళ్ళిపోయారు. అక్కడ జిల్లాకార్యవాహ్, ప్రాంతకార్యవాహ్, ప్రాంతసహసంఘచాలక్, ప్రాంత సంఘచాలక్ మొదలైన బాధ్యతల్ని నిర్వహించారు. అధికారులు ఏపనిని అప్పగిస్తే దానిని శిరసావహించి నిర్వహించటమే కర్తవ్యంగా భావించిన మహనీయులు వారు.

ప్రస్తుతం డెబ్బైయేడు సంవత్సరాల దరిదాపు వయస్సులోనున్నారు. మనస్సు ఉరకలు పెడుతున్నా వయస్సు సహకరించటం లేదు. అందువల్ల శంభాజీనగర్‌లో (ఔరంగాబాద్) ఒక ప్రభాత్ శాఖకు నియమిత రూపంలో వెళుతూ ఉంటారు. ఆస్థాయిలోనే వీలైనంతవఱకు చుఱుకుగా పనిచేస్తూ ఉన్నారు. ఎంత చేయగలిగితే అంత తప్పకుండా చేస్తూ ఆత్మసంతృప్తి, ఆనందం పొందుతు ప్రశాంత జీవితం గడుపుతున్నారు. వారు శతం జీవులై పూర్ణపురుషాయుష జీవితధన్యులగుదురుగాక!

## శ్రీ బాలాసాహబ్‌కాళే



శ్రీబాలాసాహెబ్ కాళేగా ప్రఖ్యాతి వహించిన శ్రీ బాల కృష్ణదామోదర్ కాళే 1924 జులై, ఆగస్టు నెలల్లో ప్రస్తుతం కర్ణాటక ప్రదేశ్‌లో అంతర్భాగంగా ఉన్న ''గదర్'' పట్టణంలో జన్మించారు. 1941-42 సం॥ ప్రథమ ద్వితీయ శిక్షావర్గలు పూనాలో పూర్తి చేశారు. 1943లో తృతీయ వర్ష మామూలుగా నాగపూర్‌లో చేశారు. 1943 నుండి ధార్వాడ్‌లో తాలుక శిక్షక్‌గాను, పిమ్మట కార్యవాహ్‌గాను ఉండేవారు. దరిమిల మాననీయ శ్రీయాదవరావ్‌జీ జోషీగారి ప్రేరణతో శ్రీధర్‌కామత్ శ్రీ ప్రహ్లాద అభ్యంకర్‌ల తరువాత హైదరాబాదు విభాగ్ ప్రచారక్‌గా వచ్చి సుమారు ఒక సంవత్సరం పైచిలుకు కాలం పనిచేశారు. 1948 సెప్టెంబర్‌లో హైదరాబాదు సంస్థానం మీద మిలటరీ చర్య జరిగిన తరువాత, సంఘం మీద మొదటి నిషేధం ఎత్తివేసిన సంధి సమయంలో వీరిక్కడ పనిచేయటం జరిగింది.

1950 తరువాత ప్రచారక్‌గా విరమించుకొని వివాహితులై జీవితంలో స్థిరపడి మంచి మంచి ఉద్యోగాలు చేసినారు. ధార్వాడ్‌లో కర్ణాటక ఎడ్యుకేషన్ బోర్డు సంబంధంగా డిప్యూటీ డైరెక్టరుగా ఉండినారు. గోఖలే ఇన్స్టిట్యూట్ ఆఫ్ పొలిటిక్స్ అండ్ ఎకనామిక్సులో రీసర్చిస్కాలర్‌గా పనిచేసి డాక్టరేట్ డిగ్రీ పొందారు. పాప్యులేషన్ శాస్త్రంలో (Demography) నిపుణులు. ప్రస్తుతం వారు అమెరికాలోని (Wisconsin)లో ఉన్నతస్థాయిలో Demographer గా పనిచేస్తున్నారు.

దాదాపు ఆరడుగుల యెత్తు, చామనచాయ, సన్నని శరీరంగల వ్యక్తి. సంఘపాటలు బాగా పాడుతూ ఉండేవారు. ''గర్జా జయజయకార్ క్రాంతిచా, గర్జా జయజయకార్। అన వజ్రాంచే ఛాతీవరతీ, ధ్యారేఘులూన ప్రహార్'' అన్న మకుటంగల వీరరస ప్రధానమైన పాటంటే వీరికి చాలా యిష్టం. చిన్నప్పుడు కాలేజీ ఉత్సవంలో పాడి ప్రథమ బహుమతి గెల్చుకొన్న పాటయిది. ఇప్పటికీ తాను సంఘ స్వయంసేవకునని చెబుతూ ఎంతో ఆనందగర్వంతో తొణికిసలాడుతూ ఉంటారు. ప్రస్తుతం శ్రీబాబాసాహెబ్ ఆప్టే స్మారకసమితి - ఇతిహాస సంకలన యోజనకు దక్షిణాంచల్ ప్రముఖ్‌గా పనిచేస్తున్న శ్రీ హరిభావూ వఝేగారు, పూనావాస్తవ్యులైన, నిష్ఠావంతులైన, సంఘస్వయంసేవకులు శ్రీవాసుదేవ దివేకర్జీ, శ్రీ ప్రభాకర్ నర్లేకర్జీ, శ్రీబాలాసాహబ్ కాళేజీ ఆప్తమిత్రులు. వీరందరూ ఒక ఫోటోలో దర్శనమిస్తున్నారు. ఆమధ్య శ్రీవాసుదేవ దివేకర్‌గారు అమెరికావెళ్ళి శ్రీకాళేని కలుసుకొన్న సందర్భంలో ఒక చిన్న మిత్ర సమావేశకార్యక్రమం జరిగింది. అప్పుడు సంఘకార్యాన్ని గూర్చిన ప్రసక్తివచ్చినప్పుడు శ్రీకాళేజీ గతస్మృతుల్ని నెమఱువేసుకొని ఎంతో మురిసిపోయినట్లు శ్రీ దివేకర్జీ చెప్పటం జరిగింది

శ్రీబాలాసాహెబ్‌కాళేగారికి సంబంధమున్న కుటుంబాలన్నింటిలోను సంఘ వాతావరణం నిండారినట్లు గోచరిస్తుంది. నెహ్రూమంత్రి వర్గంలో సభ్యుడుగానున్న శ్రీ డి.పి. కర్మార్కర్‌గారు వీరికి స్వయాన మేనమామ. శ్రీకాళేగారి తమ్ముడు శ్రీగోపాల్ కాళేగారు కూడా సంఘ స్వయంసేవకులే. వీరు ప్రస్తుతం కళ్యాణ్‌లో ఉంటున్నారు. శ్రీడి. పి. కర్మార్కర్‌గారి చెల్లెలు శ్రీకాశీనాథ లిమయేగారి సతీమణి. శ్రీ లిమయేజీ చిరకాలం మహారాష్ట్ర ప్రాంత సంఘచాలకులుగా పనిచేసిన మహనీయులు. ఇప్పుడు కీర్తిశేషులు. శ్రీబాలాసాహెబ్ కాళేగారు కన్నడ, మరాఠీ, హిందీ, ఇంగ్లీషు భాషల్లో దిట్ట. మంచి ఉపన్యాసకుడు. వీరు ఎం.ఏ. పట్టభద్రులు. ధార్వాడ్‌లో సుప్రసిద్ధ డాక్టరు, స్వయంసేవకూ అయిన డా॥ బర్వేగారి పుత్రిక వీరి సతీమణి. ఈ దంపతులకు ఇద్దరుకూతుళ్ళు.

హైదరాబాద్ సంఘచరిత్రలో శ్రీ శ్రీధరకామత్‌జీ తరువాత సముచిత స్థానాన్ని సంపాదించిన మహనీయుడు శ్రీ బాలకృష్ణదామోదర్ కాళేజీ. స్నేహపాత్రుడు, వినయశీలి, శాంతమూర్తి అయినవారికి ఇవే మన హార్దిక శుభాకాంక్షలు. శ్రీధర్ కామత్, బాలాసాహెబ్ కాళేలను గూర్చి యీ మాత్రం సమాచారాన్ని సంపాదింపగల్గుటకు తోడ్పడిన మాన్యులు శ్రీ హరిభావూవఝేగారికి, బెల్గాం వాస్తవ్యులు, అతిపురాతన

కార్యకర్త అయిన శ్రీపాండురంగ నిఖార్గేగారికి, బెల్గాం వాస్తవ్యులైన శ్రీగజానన్‌జీకి ధన్యవాదాలు సమర్పిస్తూ విరమించటమైనది.

## శ్రీదత్తాజీ భాలే



శ్రీ ప్రహ్లాద అభ్యంకర్‌గారి కార్యకాలంలో హైదరాబాదు స్వయంసేవకుగా రూపొందిన వ్యక్తి. శ్రీబాలాసాహెబ్‌కాళేజీకి జతగా పనిచేసిన మరొక ప్రచారక్. 1950 ప్రాంతంలో ఔరంగాబాద్ పట్టణ ప్రచారకుగాను, ఆవరుసలో ఔరంగాబాద్, పర్భిణీ, నాందేడ్ జిల్లాలతోకూడిన విభాగ్‌కు ప్రచారకుగాను పనిచేసిన వారు. చామనచాయగా, పొట్టిగా, కుదిమట్టముగా నుండి సాత్త్వికమైన కరికలభంగా కాన్పించినవారు. ఆకర్షణీయమైన మీసకట్టు, నక్షత్రములవలె పల్చగా పోసిన స్ఫోటకపు మచ్చలతో కూడిన ఆహ్లాదకరమైన ముఖబింబము, స్తిమితమైన నడక, మంద్రమధురస్వర భరిత ప్రసన్నవాక్ప్రసారముగల వ్యక్తి. సంఘకార్యం ద్వారా సమాజసేవలో ఇంకెంతో పండినపిమ్మట రాలిపోవలసినవ్యక్తి, కాని అకాల మరణానికి గురియై, శాశ్వతంగా అదృశ్యమైపోయిన మహనీయుడు. 1960వ దశకం మధ్యలో దివంగతులైన, వారికివే మన శ్రద్ధాంజలి.

## శ్రీరఘునాథ శ్రీకృష్ణసావ్‌రేకర్



వీరు 1931 అక్టోబర్ 7వ తేదీనాడు హైదరాబాదులో జన్మించారు. తండ్రిగారు హైదరాబాదులో ఆయుర్వేద వైద్యులుగా ఉండేవారు. శ్రీసావ్రేకర్ సోదరులు మొత్తం నలుగురు. ఇప్పుడు ముగ్గురు మాత్రమే ఉన్నారు. మహారాష్ట్రలోని కొల్హాపూర్‌లో మొట్టమొదటశాఖకు వెళ్ళటం ప్రారంభించారు శ్రీరఘునాథ శ్రీకృష్ణ సావ్రేకర్. వారు మెట్రిక్ వఱకు అక్కడే చదువుకున్నారు. 1950లో మళ్ళీ హైదరాబాదుకు చేరుకున్నారు. శ్రీరామ్‌భావూసాఠేజీ యొక్క ప్రేరణతో 1951లో

ప్రచారక్‌గా వచ్చి మూడు సంవత్సరాలు పర్భిణీలోను పిమ్మట 1955వఱకు నిజామాబాదులోనూ పనిచేశారు. సంఘదృష్ట్యా హైదరాబాదు సంస్థానం ఒక విభాగ్‌గా కర్ణాటక ప్రాంతానికి అనుబంధంగా ఉండేది. వీరు ప్రథమ వర్ష సంఘ శిక్షావర్గను 1952లో తుంకూరులో పూర్తిచేసినారు.

దరిమిలా 1953లో హైదరాబాదుతో సహా తెలంగాణా ప్రాంతం సంఘదృష్ట్యా ఆంధ్రతో కలిపి వేయబడింది. అప్పుడు 1953లోనే విజయవాడలో జరిగిన శిక్షావర్గలో ద్వితీయ వర్ష పూర్తిచేశారు. వారు నిజామాబాదులో పనిచేసినప్పుడు బోధన్, ఆర్మూర్, కామారెడ్డి మొదలైనచోట్ల గూడా సంఘకార్యవిస్తరణకు కృషిచేసినారు. భోజన వ్యవస్థ వారికి స్వయం సేవకుల ఇళ్ళల్లో ఏర్పాటు చేయబడింది. ఆరోజుల్లో మా. శ్రీ ఏకనాథజీ రానడే, మా. శ్రీ యాదవరావ్‌జీ జోషి, మా. శ్రీ బాలాసాహెబ్‌కాళేజీ నిజామాబాద్ విచ్చేయటం జరిగింది. మా. శ్రీ నానారావ్‌పాల్‌కర్జీ పరమపూజీయ శ్రీ డాక్టర్జీ జీవిత చరిత్ర వ్రాసేరోజుల్లో డాక్టర్జీ జన్మస్థానమైన నిజామాబాద్ జిల్లాలోని ''కందకుర్తి''ని గూర్చి విషయసేకరణనిమిత్తం శ్రీ సావ్రేకర్జీ సహాయంకోరటం జరిగింది. కాని తాము తగినంతగా సహకరించలేకపోయినట్లు వారు చెప్పినారు.

శ్రీ సావ్రేకర్జీ ప్రచారక్‌గా విరమించుకొన్న పిమ్మట హైదరాబాదులో స్థిర నివాసం ఏర్పరచుకున్నారు. అప్పుడు జరిగిన ఉద్యోగాన్వేషణలో వారికి శ్రీరామ్ భావూసాఠేజీ సహాయం లభించింది. ఇప్పుడు వారు పాల ఉత్పత్తి కేంద్ర స్థానోద్యోగిగా ఉన్నారు. వారు ఉద్యోగం చేస్తున్న క్షేత్రంలో సంఘం ఆశిస్తున్న ''పరివార'' కల్పనను వాస్తవ రూపంలో అమలు పఱచే ప్రయత్నం చేస్తున్నారు. కొంతవఱకు కృతకృత్యులవుతున్నవైనం కానవస్తున్నది. ఆకాలంలో సంఘకార్యవిస్తరణే ప్రధాన కార్యంగా ఉండేది. పరివారక్షేత్ర నిర్మాణ కల్పన తక్కువగా ఉండేది. ''గోరక్షా సమితి'' ద్వారా జరిగిన సంతకాల సేకరణోద్యమంలో నిజామాబాదుశాఖల వారు తమ వంతు బాధ్యతను దిగ్విజయంగా నెఱవేర్చటం జరిగింది.

శ్రీరఘునాథ శ్రీకృష్ణ సావ్రేకర్జీ 66 సంవత్సరాల వయస్సులో గూడా నిత్యోత్సాహిగా ఉంటూ యథాశక్తి సంఘకార్యాన్ని నిర్వర్తిస్తున్నందుకు అభినందనలు. వారు ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధులతో తులతూగూతూ మఱింత సంఘకార్యం చేయుదురుగాక.

## శ్రీ అశోక్ బోధన్కర్

వీరు నిజామాబాదు స్వయంసేవకులు. శ్రీసాప్రేకర్జీ యిక్కడ ప్రచారక్గా ఉన్నప్పుడు తయారైనవ్యక్తి. వారి ప్రేరణతోనే రెండు సంవత్సరాల పైచిలుకు కాలం నిజామాబాదులోనే కొంచెం అటూ యిటుగా శ్రీసాప్రేకర్జీ సమయంలోనే వారితోపాటు ప్రచారక్గా పనిచేసిన వ్యక్తి. వారు ప్రస్తుతం నాందేడులో స్థిరపడినట్లు తెలుస్తున్నది.

## శ్రీ రామకృష్ణవిశ్వనాథ బోండాలే



1956 నవంబర్ 1న ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత అందులో అంతర్భాగమైన ఆదిలాబాద్ జిల్లాకు ఒక స్వరూపం, అస్తిత్వం ఏర్పడినయి. అంతకుపూర్వం ఈజిల్లాలోని ఆసిఫాబాద్ వంటి తాలూకాలు కొన్ని మహారాష్ట్రలోని చంద్రపూర్ జిల్లాలో ఉండేవి. ఈనేపధ్యాన్ని దృష్టిలో పెట్టుకొని ఆదిలాబాద్జిల్లా సంఘచరిత్రను, తత్ద్వారా ఆంధ్రప్రదేశ్ సంఘ చరిత్రను అవగాహన చేసుకొనవలసిన అవసరం ఉన్నది. ఆదిలాబాద్ జిల్లాలో 1950 నుండి 1965 సంఘ విస్తరణ కార్యాన్ని నిర్వహించి సంఘదృష్ట్యా ఆజిల్లాను ఆంధ్రప్రదేశ్కి బదిలీ చేయటంలో ప్రముఖ పాత్ర వహించిన ప్రచారక్ శ్రీ రామకృష్ణ విశ్వనాథ బోండాలేజీ.

ఆదిలాబాద్ జిల్లాలోని ఆసిఫాబాద్లో 1950లోనే సంఘశాఖ ప్రారంభింపబడింది. 1956లో శ్రీ గురుజీ శ్రద్ధానిధి సమర్పణ సందర్భంగా నిధిని వసూలు చేయటానికి కొందఱు చంద్రపూర్ కార్యకర్తలు తమ ప్రక్కనే ఉన్న ఆదిలాబాద్జిల్లాలో పర్యటించటం జరిగింది. కొంతనిధిని వసూలు చేయటం జరిగింది. ఆపరిచయంతో 1957లో తొలుత కాగజ్నగర్లోను, పిమ్మట సిరిపూర్ టౌన్లోను శాఖలు ప్రారంభింపబడినవి. క్రమంగా అక్కడే ఉన్న తాండూరు, బెల్లంపల్లి, చెన్నూరు, మంచిర్యాల, ఆదిలాబాదు నగరాల్లో సంఘవిస్తరణకార్యం జరిగింది. ఇదంతా జరిపించిన వ్యక్తి ఆనాడు చంద్రపూర్ జిల్లాకు ప్రచారక్గా ఉండిన శ్రీ విశ్వనాథ్ బోండాలేజి.

ఇలా కలగాపులగంగా ఉన్న ఆదిలాబాద్జిల్లాలోని తెలుగు స్వయంసేవకులను భాషా

సౌలభ్యం కోసం ఆంధ్రలో జరిగే సంఘశిక్షావర్గకు పంపుతూ ఉండేవారు. ఇలా 1965 వరకు ఈ జిల్లా చరిత్ర నడిచింది. 1965లో కాగజ్‌నగర్‌లో జరిగిన ఒక పెద్ద కార్యక్రమానికి పరమపూజనీయ శ్రీగురూజీ విచ్చేశారు. ఆ సందర్భంలో అప్పటివరకు చంద్రపూర్ జిల్లాకు ప్రచారక్‌గా ఉన్న శ్రీబోండాలే స్వాధీనంలో ఉన్న ఆదిలాబాద్ జిల్లాను సంఘదృష్ట్యా శ్రీ గురూజీ ఆంధ్రకు బదిలీచేశారు. అదే ప్రాంతంలో కొన్ని భాగాలకు ప్రచారకుగా పనిచేస్తున్న శ్రీ యస్. యల్. యన్. ఆచార్యులుగారు దాన్ని స్వాధీనం చేసుకొని తాను జిల్లా ప్రచారకుగా వ్యవహరిస్తూ వచ్చారు. అప్పటి నుండియే ఆదిలాబాద్‌జిల్లా సంఘదృష్ట్యా పూర్తిగా ఆంధ్రప్రదేశ్‌లో అంతర్భాగమైనది.

శ్రీరామకృష్ణ విశ్వనాథబోండాలేజీ 1925 ఏప్రిల్ 22వ తేదీనాడు మహారాష్ట్రలోని సింధుదుర్గ జిల్లా యందలి దేవగడ్‌లో జన్మించారు. తండ్రిపేరు విశ్వనాథ బోండాలే తల్లిపేరు లక్ష్మీబాయి. దేవగఢ్, వార్ధా పట్టణాల్లో విద్యను అభ్యసించి 1947లో బి.కాం.లో ఉత్తీర్ణులైనారు. 1938 నుండి స్వయం సేవకు. 1947 ఏప్రిల్ నెలలో విదర్భలో తన ప్రచారక్ జీవితాన్ని ప్రారంభించారు. 1947-49 బ్రహ్మపురీ తహసీల్లో పనిచేసినారు. 1949-1967 చంద్రపూర్ జిల్లా ప్రచారక్. 1967-1982 వార్ధా విభాగ్ ప్రచారక్. 1982-1986 అకోలావిభాగ్. 1986-93 విదర్భ ప్రాంత సమన్వయ ప్రముఖ్. 1993-1996 భాండార్ ప్రముఖ్ (నాగపూర్) 1996 జూన్ నుండి పరమ పూజనీయ శ్రీగురూజీ చరిత్ర - సమగ్ర దర్శన్ పుస్తక రచనకు విషయసేకరణ కార్యంలో నిమగ్నత. ఎందరెందరో మహనీయ స్వయంసేవకుల ప్రోత్సాహంతో సంఘజీవితాన్ని రూపొందించుకున్నారు. వారు సంఘగీతాలు పాడటంలోదిట్ట. వారు పాటబాడే విధానంలో గొప్ప సంగీతం లేకపోయినా అర్థస్ఫూర్తిని కలిగిస్తూ నాదబ్రహ్మను పలికింపగల మహాగుణం ఉన్నది.

72 సం॥ వయస్సులో ప్రౌఢసుందరుడుగా దర్శనమిచ్చే శ్రీ రామకృష్ణ విశ్వనాథ బోండాలేజీ శతంజీవులై పూర్ణ పురుషాయుష జీవిత ధన్యులగుదురుగాక!

# శ్రీ గణపత్ ప్రహ్లాదరావ్ బ్రహ్మపూర్కర్



హైదరాబాదునగర సంఘ చరిత్రలో శ్రీ గణపత్ ప్రహ్లాదరావ్ బ్రహ్మపూర్కర్‌జీకి ఒక విశిష్టమైన ప్రత్యేక స్థానం ఉన్నది. అది యీనాటిదికాదు. ఒక సంవత్సరం అటూ ఇటూగా 1947-1997 వఱకు. ఈ యాభై సంవత్సరాల సుదీర్ఘమైన అఖండ కాలఖండంలో ఒక మణిస్తంభంలా వెలుగులు చిమ్ముతున్న వ్యక్తిత్వమది! నగరంలోని స్వయంసేవకు లందరికీ తలలోని నాల్క శ్రీ గణపతిరావ్‌జీ. వారికి తెలియని స్వయంసేవకుగాని, వారిని గూర్చి తెలియని స్వయంసేవకుగాని కానరాడు. ఎంతో ఓర్పు నేర్పు గలిగి, చల్లని చిఱునవ్వుతో, ప్రసన్నమధురమైన వాక్ప్రసారంతో, ఆత్మీయతను చూఱలిచ్చే మహనీయమైన మూర్తిమత్వం వారిది. ఉద్యోగం చేసే రోజుల్లోగూడ వారికి సంఘకార్యమే ప్రధానంగాను తక్కిన వన్నీ గౌణంగాను ఉండేవి. ఉద్యోగ విరమణ చేసిన తరువాత సంఘ కార్యందప్ప మరొక ధ్యాసలేదు. వారి జననాభిజన విద్యాభ్యాసాదికాల్ని గూర్చిన వివరాలివి:

శ్రీగణపత్‌రావ్‌జీ 1926 సెప్టెంబర్ 10వ తేదీ వినాయక చవితినాడు, మరాఠ్వాడా యందలి, పర్భిణీ జిల్లాలోని గంగాఖేడ్ గ్రామంలో జన్మించారు. ప్రాథమిక విద్యాభ్యాసం అక్కడే ఒక ప్రభుత్వ ప్రాథమిక పాఠశాలలో జరిగింది. మాధ్యమిక విద్య సికిందరాబాదునందలి మహబూబ్ కాలేజీ హైస్కూలులోను, ఉన్నత విద్య హైదరాబాదునందలి వివేకవర్ధినీ హైస్కూల్లోను జరిగిపోయినయి. ఇంటరు, విదర్భయందలి వాషింలోని రాజస్థాన్ ఆర్యన్ కాలేజీలో నడిచింది. డిగ్రీ విద్య హైదరాబాదులోని నిజాంకాలేజీలో పూర్తిచేశారు. ఎం.ఏ చదవటానికి ఉస్మానియా విశ్వవిద్యాలయంలో చేరటం జరిగింది. అంతలోనే ప్రచారక్‌గా వెళ్ళాలన్న అభిలాషతో చదువుకు స్వస్తి చెప్పి 1949-1954 మధ్య ఐదుసంవత్సరాలు ప్రచారక్‌గా హైదరాబాదులోనే పనిచేశారు. 1953లో వివాహమైనది. అంతకు పూర్వం నాలుగేళ్ళు, ఆపిమ్మట ఒక్క సంవత్సరం, మొత్తం ఐదేళ్ళు ప్రచారక్‌గా పనిచేసి దరిమిలా గృహస్థ జీవితం ప్రారంభించారు.

ఉద్యోగ విషయానికొస్తే 1944-45 మధ్యలో ఒక్క సంవత్సరం ఒకానొక కుగ్రామంలో ఉపాధ్యాయులుగా పనిచేసినారు. 1954లో యల్.ఐ.సిలో ఉద్యోగంలోచేరి చిరకాలం పనిచేసి ఆమధ్యలో పదవీ విరమణచేశారు.

శ్రీ గణపత్‌రావ్‌జీ హృదయంలో బాల్యంలోనే దేశభక్తి ఆవహించింది. అందువల్లనే 1944లోనే వారు ''హిందూరక్షాదల్'' అనే సంస్థలో సభ్యులుగా చేరారు. వీరసావర్కార్‌గారి సమక్షంలో ముంబాయిలో జరిగిన ఆ సంస్థయొక్క ప్రారంభోత్సవానికి హాజరైనారు. శ్రీ సావర్కార్‌గారితో వారి యింట్లోనే సమావేశమై ఆనాటి హైదరాబాదు సంస్థాన సమస్యను గూర్చి చర్చించారు. వారిజీవితంలో అదొక మొట్టమొదటి మేరపురాని మహాసంఘటనగా పేర్కొనవచ్చు. 1947-48, 48-49 సంవత్సరాల్లో నిజాం కాలేజీలో బి.ఏ. చదువుతున్న రోజుల్లో అక్కడి ''మరాఠీ సాహిత్య సంఘానికి'' అధ్యక్షులుగా ఎన్నికైనారు. హైదరాబాదు సంస్థానంపై జరిగిన పోలీసు చర్య అనంతరం ఆ సాహిత్య సంఘం యొక్క తొలి ఉత్సవ కార్యక్రమం మిక్కిలి ఆనంద కోలాహలంగా నిర్వహింపబడింది. దానికి స్టేట్ అడ్మినిస్ట్రేటర్ శ్రీ ప్రధాన్‌గారు ముఖ్య అతిథిగా పాల్గొనటం విశేషం!

సంఘ కార్యపద్ధతిలో క్రమంగా వికసించిన స్వయంసేవక్ శ్రీ గణపతిరావ్‌జీ గటనాయక్, ముఖ్యశిక్షక్, మండల్ కార్యవాహ్ ఇత్యాదిగా అన్ని సోపానాలను అధిగమించి, పిదిగి 1949-54 మధ్య ప్రచారకుగా సమర్థవంతంగా బాధ్యతలను నిర్వహించిన దిట్ట. కాలాంతరంలో హైదరాబాదు నగర కార్యవాహ్‌గా, వ్యవస్థా ప్రముఖ్‌గా, బౌద్ధిక్ ప్రముఖ్‌గా చివరికి ఆంధ్రప్రదేశ్ ప్రాంత సహాయ కార్యవాహ్‌గా అనేక బాధ్యతల్ని నిర్వహించి మంచి పరిపక్వతను సంతరించుకొన్న మహా కార్యకర్త. ఇద మిత్థంగా, ఒక్కొక్కప్పుడు ఏ బాధ్యతాలేకపోయినా, నిరంతర కార్యశీలిగా పేరు పొందిన మహనీయుడు. 1952లో ప్రచారకుగా ఉన్నప్పుడే తుంకూరులో జరిగిన ప్రథమ వర్ష శిక్షావర్గను పూర్తిచేశారు. 1945లో మొట్టమొదటిసారి సంఘ సంపర్కంలోకి వచ్చారు. మాననీయులు శ్రీ ప్రహ్లాద్ అభ్యంకర్‌జీ, శ్రీ శ్రీరామ్ శ్రీపాదసాఠేజీ వంటి ఉద్దండులచేత మహా కార్యకర్తగా తీర్చిదిద్దబడిన భాగ్యశీలి.

శ్రీ గణపతిరావ్‌గారి సతీమణి పేరు శ్రీమతి శారదా బ్రహ్మపూర్కార్, ఆమె హైదరాబాదులోనే ఒక హైస్కూల్లో అధ్యాపకురాలుగా చిరకాలంపనిచేసి ఉద్యోగవిరమణ చేశారు. 1953లో వివాహం జరిగిన దరిమిలా సంఘకార్యంలో శ్రీగణపతిరావుజీని నీడవలె అనుసరిస్తూ సహకరించటమేగాదు, తానుగూడ ఉత్తమ సేవికాసమితి కార్యకర్త్రిగా

రూపొందిన ఉత్తమ యిల్లాలు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సేవికా సమితి అధ్యక్షురాలుగా చిరకాలం పనిచేసి యెందరెందరో సేవికలకు మార్గదర్శకత్వం వహించిన మహామహిళ. 1975, 76 సం॥రాల్లో ఎమర్జెన్సీలో సత్యాగ్రహం చేసి జైలుశిక్షను అనుభవించిన దృఢచిత్త. శ్రీగణపతిరావుగారివలె ఆమెకూడా హైదరాబాదునగరంలోని రాష్ట్ర సేవికాసమితి సభ్యురాండ్రకేగాక, తదితర మహిళామణులకుకూడా తలలోని నాల్క అని చెప్పినచో అతిశయోక్తి గాదు.

ఈ ఆదర్శదంపతులిర్వురకు ఇద్దరు కొడుకులు, ఒక కుమార్తెగలరు. వీరందరూకూడ తల్లి దండ్రుల బాటలో సంఘస్వయంసేవకులే అగుట మిక్కిలి ముదావహం. శ్రీగణపతిప్రహ్లాదరావ్ బ్రహ్మపూర్కర్‌గారు సకుటుంబంగా ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధులతో తులతూగుతూ సంఘకార్యంద్వారా సమాజ సేవలో తరిస్తూ పూర్ణ పురుషాయుష జీవిత ధన్యులౌదురుగాకయని మంగళాశాసనం చేయటమైనది.

## శ్రీవసంతరావ్ దేశ్‌ముఖ్

వీరు హైదరాబాదు వాస్తవ్యులు. ఆమధ్య కొన్నాళ్ళ క్రితం దివంగతులైనారు. విశాఖపట్టణం వైపున 1954 ప్రాంతంలో ఒక్క సంవత్సరం విస్తారక్ (ప్రచారక్)గా పనిచేశారు. 1949 నుండి 1953 వఱకు శ్రీ గణపతిరావ్ బ్రహ్మ పూర్కర్ హైదరాబాద్ ప్రచారకుగా పనిచేయటం జరిగింది. వారిని హైదరాబాదునుండి విశాఖపట్టణం బదిలీ చేయాలి అని ఉన్నత సంఘాధికారులు యోచిస్తున్న సమయంలో 1953లోనే శ్రీ గణపతిరావ్‌జీ వివాహమైనది. ఆపిమ్మట తాను ఒక్క సంవత్సరమే ప్రచారకుగా కొనసాగి తరువాత విరమిస్తానని వారు అధికారులకు చెప్పటం జరిగింది. అయితే వారిని విశాఖ పట్టణం మార్చటం అనవసరమని భావించిన అధికారులు హైదరాబాదులో, శ్రీగణపతిరావు గారి స్థానంలో నియమింపదలచిన శ్రీవసంతరావ్ దేశ్‌ముఖ్‌నే విశాఖపట్టణం వైపుకు పంపించటం జరిగింది. దరిమిలా హైదరాబాదులో శ్రీ గణపతిరావ్‌జీ, విశాఖలో శ్రీ వసంతరావ్‌జీ - ఈ యిద్దరూ ప్రచారకులుగా విరమించటం జరిగింది. శ్రీగణపతిరావ్‌జీ చెప్పిన యీ ఉదంతాన్ని యిక్కడ ఉల్లేఖించటం జరిగింది.

# శ్రీ శ్యామ్ పరాండే



శ్రీ శ్యాం పరాండే నాగపూర్ వాస్తవ్యులు. 1977లో దివిసీమలో సంభవించిన తుఫాను బాధితుల సహాయార్థం చేపట్టిన సేవా కార్యక్రమాల్ని నిర్వహించటంకోసం ప్రత్యేకంగా నాగపూర్ నుండి పిలిపించిన ప్రచారక్. దివి సీమలో దీనదయాళ్‌పురం నిర్మాణంలోను, తదితర పునరావాస కార్యక్రమాల్లోనూ ప్రధాన భూమికను నిర్వహించిన అనంతరం సంఘ కార్యం కోసం మళ్ళీ హైదరాబాదుకు పిలిపించ బడిన ప్రచారక్. 1980-85 మధ్యకాలంలో హైదరాబాదులోని పంజగుట్ట, అమీర్‌పేట, సనత్‌నగర్, బేగంపేట మొదలగు బస్తీలతో కూడిన ప్రాంతానికి ప్రచారకుగా పనిచేసిన వ్యక్తి. దరిమిలా సేవాభారతికి వారిని తరలించటం జరిగింది. పశ్చిమాంధ్ర సేవాభారతి ప్రచారక్‌గా పనిచేసిన పిమ్మట ప్రస్తుతం ఢిల్లీలోని ''విశ్వసంస్థాన్'' అనే వ్యవస్థలో ప్రముఖ వ్యక్తిగా పనిచేస్తున్నారు. 1977-1997 ఈ మధ్యగల ఇరవైయేళ్ళ కాలఖండంలో పేరెన్నికగన్న ప్రచారకుగా పనిచేసిన వ్యక్తి. ఎవరితో ఎంతసేపు మాట్లాడాలి, ఎక్కడ ఎంతసేపు ఉండాలి వంటి విషయాలలో లెక్క ప్రకారం వ్యవహరిస్తూ తన పనితానుగా, తనదిగా చేసుకుంటూ పోయే మంచి క్రమశిక్షణగల ప్రచారక్.

# శ్రీరామ్ శ్రీపాద సాఠే



ఆంధ్రప్రదేశ్ రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘ చరిత్ర నందనవన సీమలో ఋతురాజు వసంత ఋతువువలె ప్రవేశించిన మహా మహితాత్ముడు మాననీయ శ్రీ శ్రీరామ్ శ్రీపాద సాఠేజీ. వారొక కర్మయోగి, సంఘటనా శాస్త్రవేత్త, నిరంతర సమాజ పరమేశ్వరా రాధకులు, ఇరవైరెండు సంవత్సరాల వయస్సులో 1942లో ఇల్లువెడలి ప్రచారకుగావచ్చి అప్పటినుండి యిప్పటి వఱకు, యాభై అయిదేళ్ళ సుదీర్ఘకాల ఖండంలో వెలుగులు వెదజల్లుతున్న అఖండనందాదీపం వారు అని వర్ణిస్తే అతిశయోక్తికాజాలదు. ఆతేజోమూర్తి ఓజోమూర్తి జీవిత చరిత్రలోని కొన్ని ప్రాథమిక విషయాలను గూర్చి యిప్పుడీ వ్యాసంలో ప్రస్తావించటం జరుతున్నది.

శ్రీ శ్రీరామ్‌సాఠేజీ క్రీ.శ. 1920 సెప్టెంబరు 30వ తేదీనాడు జన్మించారు. వారి స్వగ్రామం మహారాష్ట్రయందలి, సతారాజిల్లాలోని వాయీ క్షేత్రం. అక్కడ ఇప్పటికీ పిత్రార్జితంగా వచ్చిన పాతయిల్లు ఒకటున్నది. ఇటీవల వారి తమ్ముడు దాన్నికూలగొట్టి ఆధునిక పద్ధతిలో ఒక మంచి యిల్లు నిర్మించటం జరిగింది. 1997 మే 9వ తేదీనాడు ఆనూతన గృహప్రవేశం జరిగింది. కాని ఆగృహప్రవేశకార్యక్రమానికి సాఠేజీ వెళ్ళకపోవటం గమనించాల్సిన విషయం! వారి తండ్రిగారి పేరు శ్రీపాద హరిసాఠే. తల్లిగారిపేరు సరస్వతి. తండ్రిగారు మిలటరీలో డాక్టరు. తల్లిగారు ఉత్తమగృహిణి. సాఠేజీతో కలుపుకొని వీరుమొత్తం సోదరులు నల్గురు. సోదరీమణులు నల్గురు. వెఱసి ఎనిమిది మంది. వీరందరిలోను వరుసక్రమంలో శ్రీ సాఠేజీ రెండవవారు. తండ్రిగారు మిలటరీ ఉద్యోగంలో ఉండటంవల్ల తఱచూగా ఇక్కడికీ అక్కడికీ బదిలీ అవుతూ ఉండేవారు. అది కారణంగా వారి తల్లిగారికి అనేక భాషలు రావటమేగాక, పలురకాల వంటకాలు చేయటంగూడ తెలుసు. తండ్రిగారి వ్యావహారిక భాష అధికంగా హిందీకావటంవల్ల, ఇంటిల్లిపాదీ అందరూ హిందీలోనే మాట్లాడటంకద్దు. శ్రీసాఠేజీ పుట్టిన కొన్నాళ్ళకు ఆకుటుంబం బదిలీయై పోతున్న తండ్రిగారి వెంట కొన్నాళ్ళు సింధుప్రాంతంలోని

కరాచీలోను మరికొన్నాళ్ళు మరొక చోట, ఇలా ఉంటూ వచ్చింది. శ్రీ సాఠేజీ ఆరేళ్ళవయస్సులో ఉన్నప్పుడు, పిల్లల చదువుల దృష్ట్యా వారి తండ్రిగారి దృష్టి మళ్ళీ వాయీ మీదకు మళ్ళింది. అందువల్ల వారు అక్కడొక పెద్దయిల్లు ప్రత్యేకించి కొనటం జరిగింది.

శ్రీసాఠేజీ తండ్రిగారి తమ్ముడు వాయీలోనే స్థిరంగా ఉంటూ ఉండేవారు. వారికి రాబడి తక్కువ. అందువల్ల సాఠేజీ తండ్రిగారి ఆదాయంతోనే వారియిల్లు, వీరియిల్లూ - రెండూ గడుస్తూ ఉండేవి. శ్రీసాఠేజీ బాబాయిగారు ''వాయీ'' మున్సిపాలిటీలో సెక్రెటరీస్థాయి ఉద్యోగం చేస్తూ ఉండేవారు. వీరికిపెద్ద సంతతి కూడా ఉన్నది. శ్రీసాఠేజీ మఱియు వారి చెల్లెలు ఆయింట్లోనే వాళ్ళతోపాటే ఉండేవారు. తల్లిగారు మాత్రం తండ్రిగారితోబాటే ఉంటూ ఉండేవారు. ఇంట్లో క్రమశిక్షణ చాలా కఠినంగా ఉండేది. ప్రొద్దున్నే సమయానికి నిద్రలేవటం, చదువుకొనటం, స్తోత్రపాఠాదికం నెఱవేర్చటం, మళ్ళీ సాయంత్రం చదువు, స్తోత్రము, ఇత్యాదిగా సమయసారిణి అమల్లో ఉండేది. చదువు సంధ్యలతోపాటు భోజనాదుల విషయంలో కూడా కొన్ని నియమాలుండేవి. ఏది పెడితే అది తినటం, ఇది కావాలి, అదికావాలి అని అడగకుండా ఉండటం బాగా అలవాటుగా ఉండేది. లభించింది ఉత్తమంగా భావించి సంతృప్తిగా ఉండేవారు. ఈ విధంగా వారి ప్రాథమిక విద్యాభ్యాసం వాయీలోనే ఒక మున్సిపల్ స్కూల్‌ల్లో జరిగింది. ఆ ఊళ్ళోనే ఒక హైస్కూలు ఉండేది. అందులో హైస్కూలు చదువుపూర్తి అయింది. ఇంగ్లీషు, సైన్సు- ఈరెండూ ఇంగ్లీషు మాధ్యమంలో ఉండగా, తక్కిన విషయాలు మరాఠీ మీడియంలో ఉండేవి. ఈవిధంగా వాయీలో హైస్కూలు విద్యను ముగించుకొని, ఉన్నత విద్యాభ్యాసం కోసం వారు 1937లో ముంబై చేరుకొనటం జరిగింది.

ముంబయిలో వారి అన్నగారు ఉద్యోగం చేస్తూ ఉండేవారు. కొన్నాళ్ళు వారిద్గఱే ఉన్నారు కాని అది కాలేజీకి దూరం కావటంవల్ల కొన్నాళ్ళు వారి వరుసకి అన్నగారియింట్లో ఉన్నారు. మఱికొన్నాళ్ళు కాలేజీకి దగ్గఱగా చిన్నగది తీసుకొని ఉన్నారు. ఇట్లా తంటాలుపడి 1942లో బి.యస్.సి పూర్తిచేశారు. వెంటనే అదే సంవత్సరం ప్రచారక్‌గా వచ్చేశారు. 1940, 41, 42 సం॥రాల్లో వరుసగా ప్రథమ, ద్వితీయ, తృతీయ వర్ష సంఘ శిక్షావర్గ - మొదటి రెండు పూనాలోను మూడవది నాగపూర్‌లోను పూర్తి చేశారు. ఆరోజుల్లో సంఘ శిక్షావర్గ 40 రోజులుండేది. వాయీలో సంఘశాఖ తాము ఐదవతరగతి చదివేరోజుల్లో ప్రారంభింపబడింది. ప్రారంభించిన వారు శ్రీ వాసుదేవరావ్‌గాడ్గిల్. శాఖరాకముందే ఆ

ఊళ్ళో కాస్త లాఠీ వగైరా నేర్చుకోవటం ఉండేది. అప్పటికి స్వాతంత్ర్యోద్యమ వాతావరణంగూడ ఉండేది. వారికి ''కబడ్డీ'' మొదలైన ఆటలంటే భలేయిష్టం. బాగా ఆడ్తారు అని పదిమంది అనుకుంటూ ఉండేవాళ్ళు. వాసుదేవరావ్ గాడ్గిల్ శాఖకు రమ్మని పిలిచినప్పుడు లాఠీ నేర్చుకొనటానికి వస్తానని చెప్పి 1935లో శాఖకు వెళ్ళటం ప్రారంభించారు. కాని వారి తండ్రిగారు సంఘానికి వెళ్ళే విషయంలో ఎప్పుడూ తనకు అనుమతి ఇవ్వలేదు. దీనికి కారణముంది. తనకంటె ఐదేళ్ళు పెద్దవాడైన తన అన్నగారు మెట్రిక్ చదువుతూ ఉండేదశలో కాంగ్రెస్ సాగిస్తున్న స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొంటూ ఉండేవారు. ఆయనతోపాటు సాఠేగారు కూడ పాల్గొనటం ప్రారంభించారు. ప్రభాతభేరీలు జరుగుతూ ఉండేవి. పాటలు గూడా పాడుతూ ఉండేవారు. ''నహీ రఖనా, నహీరఖనా, సర్కారు'' ఇత్యాది. 1930లో జరిగిన సత్యాగ్రహంలో వారి అన్నగారు పాల్గొనదలచారు. అది సతారాలో జరుగుచున్నది. అక్కడికి వెళ్ళాలి. పది పది హేను మందితో కలిసి వెళ్ళటం జరిగింది. అయితే శ్రీ సాఠేగారి పినతండ్రిగారు సతారా వెళ్ళి ఆయనను వెనక్కిలాక్కొని వచ్చారు. సత్యాగ్రహం చేయవద్దు. మిగతా విధంగా పాల్గొనవచ్చు. లేకపోతే తన ఉద్యోగం పోతుందన్న భయముండేది. వాయీ నుండి సంఘశిక్షావర్గకి ఇద్దరు వ్యక్తులు వెళ్ళటం జరిగింది. వారితోపాటు సాఠేజీగూడా వెళ్ళాలనుకొన్నారు. కాని తండ్రిగారు పడనివ్వలేదు. పెద్దవాడు కాంగ్రెస్ సత్యాగ్రహంలోకి వెళ్ళాడు. వీడు సంఘం వైపు వెళుతున్నాడు. నా ఉద్యోగం పోతుంది కుటుంబ నిర్వహణ కష్టమైపోతుంది ఇదీ తండ్రిగారి భయం!

వాయీలో సంఘశాఖలో సంఖ్యబాగా ఉండేది. అదొక ఉత్తమశాఖ క్రిందలెక్క. కాలేజీలో కార్యక్రమాలు జరుగుతూ ఉండేవి. శాఖకు వెళ్ళాలా వద్దా యిలా చర్చలు జరుగుతూ ఉండేవి విద్యార్థులమధ్య. కొందరు విద్యార్థులు ''మేం'' కాంగ్రెస్ వాళ్ళం అంటూ ఉండేవారు. అందువల్ల వాళ్ళకి సంఘానికి వెళ్ళటమంటే యిష్టముండేదిగాదు. ఆరోజుల్లో వాయీలో ఒకే ఒక ''ఫోటో గ్రాఫర్'' ఉండేవాడు. కాలేజీలో జరిగిన కార్యక్రమంలో వలంటీర్లందరూ కలిసి ఒక ఫోటో తీయించుకోవాలనుకొన్నారు. అయితే అది శాఖకు వెళ్ళే సమయంలో ఏర్పాటుచేయటం జరిగింది. శాఖా సమయంలో ఫోటో తీసే కార్యక్రమం ఉంటే మేమురాము అని చెప్పటం జరిగింది వారికి. కాని ఆకార్యక్రమం శాఖాసమయంలోనే ఏర్పాటుచేయబడింది. ఆరోజుల్లో ఫోటో తీయించుకోవాలనే ఉబలాటం ఎంత యెక్కువగా ఉండేదంటే, విద్యార్థులు పంక్తిలో నిలబడ్డప్పుడు వెనుక వరుసలో నిలుచున్నవాళ్ళు, ముందువరుసలో నిలుచున్న వాళ్ళ కాళ్ళసందుగుండా తమ

చెప్పులుతొడుక్కున్నకాలు పడాలనే ఉబలాటంతోకాలు ముందు పెట్టేవాళ్ళు. అంత ఉబలాటం ఉన్నరోజుల్లో గూడ శాఖా సమయంలో ఫోటోప్రోగ్రాం పెడితే మేమురాము అని కచ్చితంగా చెప్పటం జరిగింది. ఎక్కువమంది విద్యార్థులు స్వయంసేవకులు కావటంవల్ల ఫోటో కార్యక్రమం వాయిదాపడింది. ఇదీ ఆనాటి స్వయంసేవకుల క్రమశిక్షణ.

కళాశాలలో అప్పుడప్పుడు నాటకాల ప్రదర్శనలుగూడా జరుగుతూ ఉండేవి. శ్రీసాఠేగారికి ఒకసారి కృష్ణపాత్ర వేసే అవకాశం లభించింది. వారు చాలా బాగా నిర్వహించారు. అందరూ భలే ప్రశంసించారు. కాని సాఠేగారు - అది కృష్ణపాత్ర కావటంవల్ల రాణించింది. కృష్ణుడు పరాక్రమశాలి. నాటకకారుడు వ్రాసిన గద్యపద్యాలను చదివివేసిన మీదట ఆపాత్ర రాణించటం విశేషంకాదు అని శ్రీ సాఠేగారు ప్రశంసకులకు చెప్పటం జరిగింది. ఈవిధంగా వారికి నాటకరంగంలో ప్రవేశమేర్పడింది. వాయీలో కృష్ణానది ప్రవహిస్తున్నది. అది శ్రీసాఠేగారి యింటిగోడను ఆనుకొని ప్రవహిస్తున్నది. అక్కడికి 20మైళ్ళ దూరంలోనే మహాబలేశ్వరమున్నది. అక్కడే కృష్ణానది పుట్టి ప్రవహిస్తున్నది. అది పర్వతప్రాంత భూమికావటంవల్ల నదీతరంగాలు నిమ్నోన్నతంగా అందంగా ప్రవహిస్తూ ఉంటే అందులో ముఖ్యంగా వర్షాకాలంలో ఆ ప్రవాహంలో ఈదుకుంటూ భలేసరదాగా ఆడుకునేవాళ్ళు. ఈ క్రీడ పలురకాలుగా ఉండేది. నదిలో దూకటం, కొంతదూరం ప్రవాహంతోపాటుకొట్టుకొని పోతూ ఉండటం, ఒడ్డుకు చేరటం, మళ్ళీనదిలో దూకటం, ఇట్లా చంక్రమణాలు జరుగుతూ ఉండేవి. శ్రీసాఠేగార ఒకసారి సుడిగుండంలో చిక్కుకొని అతికష్టం మీద బ్రతికి బైటపడ్డారు. ఇలా అప్పుడప్పుడూ ప్రమాద భయం ఉన్నా యీ యీతల క్రీడలు జరుగుతూనే ఉండేవి. ఇవి వాయీ నివాసులకు అలవాటే.

వాయీకి దగ్గఱ ''భోర్'' అనే ఒక పుణ్యక్షేత్రముండేది. అది నృసింహక్షేత్రం. అక్కడ శ్రావణ మాసంలో ప్రతి సోమవారం యాత్ర జరుగుతూ ఉండేది. ఆచుట్టుప్రక్కల ఊళ్ళ నుండి జనం ఆ యాత్రకు వస్తూ ఉండేవాళ్ళు. సాఠేగారు చదువుకొనే రోజులకు ముందుగాని ఆతరువాత గాని స్వయంసేవకులకు అప్పుడప్పుడు ఏదో ఒక కార్యక్రమం ఏర్పాటు అవుతూ ఉండేది. మహాబలేశ్వర్ నుండి వాయీ వఱకు కృష్ణానది లోతుచాలా తక్కువ. కాని వేగం మాత్రం ఎక్కువ. ''భోర్'' అనే క్షేత్రం దగ్గఱ మాత్రం లోతు ఎక్కువగా ఉండేది. అక్కడి నృసింహస్వామి మందిరం గోడమీదకు ఎక్కి నదిలో దూకటం, బైటికి వచ్చి మళ్ళీ యెక్కి మళ్ళీ దూకటం ఇట్లా చెర్లాటలు జరుగుతూ ఉండేవి. ఆమందిరనిర్మాణంలో ఒక కట్టడానిని మరొకకట్టడానికి మధ్యనాలుగడుగుల

అంతరం ఉండేది. ఇవతలి నుంచి కాలుజాపి అవతల దానిమీద పెట్టి అటు చేరుకొని మళ్ళీనదిలో దూకటం. అదొక సరదాగా సాగిపోతూ ఉండేది. శ్రీసాఠేజీ పినతండ్రిగారు వీరి ఆగడాలు చూసి ''అబ్బాయి! చూడు! నీవు యింటికి వచ్చేటప్పుడు నీకాళ్ళతోనే నీవు నడుచుకుంటూ రావాలిగాని మరొకరి సహాయంతోకాదు, సుమా! జాగ్రత్త! అని హెచ్చరికలు చేస్తూ ఉండేవారు. అయినా లెక్కచేయకుండా యీ ఆగడాల్లో పాల్గొంటూ ఉండేవాళ్ళు. ఒకసారి యీగోడ మీద నుండి ఆగోడమీదకు లంఘించేటప్పుడు ప్రమాదవశాత్తు ఆరెండింటి మధ్య సందులో పడిపోవటం జరిగింది. అది సుమారు ముప్పై అడుగుల ఎత్తు నుండి పడినవైనం. అప్పుడు సాఠేగారనుకొన్నారు తనకు చావు దాపురించిందని. అదృష్టవశాత్తు పెద్దగా దెబ్బలు తగల్లేదు. కాని నడిచి యింటికి వెళ్ళజాలని విధంగా దెబ్బలు తాకినయి. ఇంటికి ఎట్లా చేరాలి! అన్నది సమస్య. ఆదారిన ఒక రెండెడ్లబండి తటస్థపడింది. అతికష్టంమీద దాంట్లో ఎక్కి ఇల్లుచేరుకొనటం జరిగినది. అప్పటికి సుఖాంతమైనది కథ!

వాయీ మంచి పుణ్యక్షేత్రం. వేద పండితులకు నిలయం. అది చాలా పెద్ద జిల్లా వ్యాయామశాలలు అవీ ఉండేవి. ప్రతి ఆదివారం అక్కడ విశేష ప్రక్రియలు నేర్పటం, నేర్చుకొనటం జరిగేది. శ్రీ సాఠేజీ సాధ్యమైనంత వఱకు ప్రతి దాంట్లోను పాల్గొని మంచి నేర్పఱి తనాన్ని సంతరించుకొన్నారు. వాయీలో కుస్తీల పోటీలుగూడా బాగా జరుగుతూ ఉండేవి. లంగోటాలు బిగించి ఉత్సాహంగా జబ్బలు చఱుస్తూ అందరూ పాల్గొంటూ ఉండేవారు. అక్కడొకచోట పొలంలో చదునుచేసిన మైదానపు పరిధిలో కుస్తీలు జరుగుతూ ఉండేవి. గెలుపు ఓటములు మామూలే. అయితే ఒకసారి ఓడినవారు అంతటితో పోక మళ్ళీ పాల్గొని అవతలి వాణ్ణి ఓడగొట్టేదాకా పట్టుదలలు సాగుతూ ఉండేవి. ఈసంవత్సరంగాకపోతే వచ్చే సంవత్సరం. ఇలా భావాత్మకమైన స్పర్ధతో ఉత్సాహంగా గడిచిపోయిన రోజులవి.

''వాయీ''లో మంచి ఆరోగ్యకరమైన వాతావరణముండేది. కొండనేల, మంచిగాలి, మంచి నీరు, ఇలా చక్కని ఆరోగ్యకరమైనతావది. నియమితరూపంలో శాఖకు వెళ్ళడం, పనిచేయటం, చక్కగా చదువుకొనటం, ఇదీ దినచర్య. ఆస్కూల్లో సంస్కృతం బోధించే ఉపాధ్యాయునికి ఇద్దరు విద్యార్థులంటే చాలా అభిమానం. అప్పుడొక సంస్థవారు సంస్కృతం చదివే విద్యార్థులకు స్కాలర్ షిప్పులు ప్రకటించారు. అది శ్రీసాఠేజీకి, మరొక విద్యార్థికి ఇప్పించాలని ఆసంస్కృత ఉపాధ్యాయునికోరిక. సంఘకార్యంలో నిమగ్నులైన సాఠేజీ తానుగా ఆవిషయాన్ని అంతగా పట్టించుకొనలేదు. కాని ఆ

ఉపాధ్యాయుడుచాలా ప్రయత్నించారు. అది రాలేదు. ఉపాధ్యాయుడు నిరుత్సాహపడ్డారు. సంఘకార్యంలో ఆనందిస్తున్న సాఠేజీకి అదొక తృణప్రాయమైనదని చెప్పవచ్చు. మెట్రిక్ పరీక్షలో ఉత్తీర్ణులైన తరువాత ఇంటర్ ఎక్కడ చదవాలి అన్నదొక ప్రశ్న! ముంబైలో చదవటానికి నిశ్చయమైనది. సాఠేజీ ముంబై చేరుకొని క్రిష్టియన్ మిషనరీ వారి విల్సన్ కాలేజీలో చేరవలసి వచ్చింది.

విల్సన్ కాలేజీలో క్రిష్టియన్ విద్యార్థుల సంఖ్య అధికంగా ఉండటం సహజమేమఠీ. అక్కడొక హాస్టలుండేది. అందులోగూడ క్రిష్టియన్ విద్యార్థులదే పైచేయి. ఆరోజుల్లో ఇంటర్ రెండేళ్ళు, డిగ్రీ రెండేళ్ళు. ఇదీకాలేజీ చదువుల విధానం. విద్యార్థులందరూ పాంటు, బుష్‌షర్టు, పైజామా కుర్తాల్లో వస్తూవుంటే సాఠేజీ మాత్రం ధోవతి, కుర్తాలతో వెళుతూ ఉండేవారు! వారు కాలేజీకి దగ్గఱలో ఒక రూమ్ తీసుకొని, వండుకుంటూ చదువుకుంటూ ఉండేవారని పూర్వోక్తం. ఆకాలేజీకి దగ్గఱలోగాని, కనీసం ఒకమైలు లోపలగాని సంఘశాఖలు అందుబాటులో ఉండేవికావు. అందువల్ల వారు నియమితంగా శాఖకు వెళ్ళే అవకాశం లేకపోయింది. కాలేజీలో ప్రతిరోజు మొదటి కాలాంశంలో ఒక అర్ధగంటసేపు ''బైబిలు'' తరగతి ఉండేది. శ్రీసాఠేజీతోపాటు దివాకర్ లాల్ అనే మరొక స్వయంసేవక్ సహ విద్యార్థిగా ఉండేవారు. వారిద్దరూ మంచి స్నేహితులైనారు. ప్రతిరోజు బైబిల్ తరగతిని తప్పకుండా హాజరుకావాలని, బైబిల్‌లో పరీక్షలు పెట్టినప్పుడు ప్రథమ బహుమతి వీరిద్దర్లో యెవరో ఒకరు గెలుచుకోవాలని నిర్ణయించుకొనటం జరిగింది. దాని ప్రకారం మొదటి సంవత్సరం సాఠేజీకి రెండవ సంవత్సరం శ్రీ దివాకర్‌లాల్‌కి ప్రథమ బహుమతి వచ్చింది. బైబిలు బోధించే ఉపాధ్యాయుడు, కెమిస్ట్రీ బోధించే మరొక ఉపాధ్యాయుడు వీళ్ళిద్దరూ సాఠేజీ అన్నా, దివాకర్‌లాల్ అన్నా చాలా ప్రేమ భావంతో ఉండేవారు. బైబిల్‌లో ప్రథమ బహుమతి వచ్చినందువల్ల మాత్రమేగాక మొదటినుండి చివరి వఱకు వాళ్ళకు సహజంగానే వీళ్ళమీద అభిమానం ఉండేది. వీళ్ళిద్దరూ బైబిల్‌బోధించే అధ్యాపకుణ్ణి సమీపించి అప్పుడప్పుడు ఏవేవో ప్రశ్నలడిగి సమాధానాలు పొందుతూ ఉండేవారు. ఒకసారి బైబిల్ టీచర్ వీళ్ళిద్దర్నీ పిలిచి ప్రతిరోజు సాయంత్రం పూట ఏంజేస్తూ ఉంటారు? అని అడగటం జరిగింది. వీళ్ళిద్దరూ ''నిష్కర్షగా'' సంఘశాఖకు వెళుతూ ఉంటాము అని సమాధానం చెప్పటం జరిగింది. ఆ ఉపాధ్యాయుడు తన అభిప్రాయాన్ని బైటికి పొంగించకుండా అలాగా, అని మిన్నకుండిపోయాడు. అయినా మామూలుగా వీళ్ళ మీద సహజమైన అభిమానాన్నే ఆపిమ్మట కూడా ప్రదర్శిస్తూవచ్చాడు.

ఇంటర్ పూర్తి అయినతర్వాత బి.యస్.సి. చదవటానికి మాటుంగాలోని ''రుయా'' కాలేజీలో చేరటం జరిగింది. బి.యస్.సి. మొదటిసంవత్సరంలో తక్కిన సబ్జక్టులలో ప్రథమశ్రేణి మార్కులొచ్చినా ప్రాక్టికల్స్‌లో తక్కువ మార్కులు రావటంవల్ల పరీక్ష తప్పటం జరిగింది. అదొకవరంగా భావించి సంఘకార్యం ఇంకా బాగా చేయటం ప్రారంభించారు. దాదర్‌లో ఉన్న శివాజీ పార్కు శాఖకు నిత్యమూ హాజరవుతూ సంఘ పనిలో నిమగ్నులైనారు. 1942లో బి.యస్.సి.లో ఉత్తీర్ణులైనారు. ఇక చదువును గూర్చి పట్టించుకొనలేదు. సంఘపనిదప్ప మరొక ధ్యాసలేదు. ఇదీ పరిస్థితి. ఆనాటి శివాజీ పార్కు శాఖలో ధరిమిలా గొప్ప సంఘకార్యకర్తలైన వారు చాలా మంది ఉండేవారు. వారిలో దాదాసాహబ్ ఆప్టే అనువారొకరు. అప్పుడు వారు వకీలు, రచయిత, కవి. ప్రౌఢ స్వయంసేవకు. రెండవవారు ఇప్పుడు ఢిల్లీలో సుప్రసిద్ధ కార్యకర్తగా ఉన్న ''బాపూసాహబ్ లేలే'' అనువారు పరమపూజనీయ శ్రీ గురూజీకి చిరకాలం వ్యక్తిగత కార్యదర్శిగా పనిచేసిన డా॥ ధట్టేగారు మరొకరు. మహారాష్ట్ర వఱకే పరిమితంగా సుప్రసిద్ధులైన ఇంకెందరో మహనీయులు ఆరోజుల్లో ఆశివాజీ పార్కు శాఖనుండి బయలుదేరిన వారే. శ్రీసాఠేజీ, ఘటనాయక్, శిక్షక్, ముఖ్యశిక్షక్, కార్యవాహ. ఇలా క్రమ పరిణత సిద్ధకార్యకర్తగా తయారైనవ్యక్తి. వారు రెండున్నర సంవత్సరాలు ఆశాఖలో పనిచేశారు. ఒక్కొక్క గణలో 20మంది చొప్పున ఆఱు, యేడు గణాలు ఆశాఖలో ఉండేవి. క్రమ పద్ధతిలో శాఖాకార్యక్రమాలు జరుగుతూ ఉండేవి. శారీరక్, బౌద్ధిక్, చర్చ - ఇత్యాది శాఖా వాతావరణం భలే ఉత్సాహంగా ఉండేది. ఆరోజుల్లో ముంబైలో వ్యాయామ శాలలు ఎక్కువగా ఉండేవి. దాదాలు ఎక్కువగా ఉండేవారు. ఎప్పటికీ వాళ్ళది పై చేయిగా ఉండాలి అదీ వాళ్ళ దృష్టి. సంఘ శాఖలు బలంగా ఉండటం చూసి తమ ప్రభావం తగ్గిపోతుందన్న యీర్ష్యతో సంఘస్వయంసేవకులతో కయ్యానికి కాలుదువ్వుతూ ఉండేవారు. జగడాలు, కొట్లాటలూ ఔతూ ఉండేవి. వాళ్ళను స్వయంసేవకులు గట్టిగా ఎదుర్కొంటూ ఉండేవాళ్ళు. ఆవిధంగా స్వయంసేవకులు ఆరితేఱినారు.

అక్కడి శాఖలో ఘోష్ గణబాగా ఉండేది. ఘోష్‌లో పాల్గొనే వాళ్ళకి ఒక ప్రత్యేకమైన వేషం ఉంటుంది గదా! అందువల్ల వాళ్ళు తక్కిన స్వయంసేవకులకంటె తామొక ప్రత్యేక తరగతికి చెందిన వాళ్ళం అని అనుకుంటూ ఉండేవారు. ఇదంతా గమనిస్తున్న సాఠేజీ వాళ్ళల్లో ఉన్న ఆ అభిప్రాయాన్ని తొలగించటమేగాక ఘోష్ గణను పక్కాజేయటానికి నిర్ణయించుకొని తాము స్వయంగా ''వంశీ'' మొదలైన రెండుమూడు ప్రక్రియల్ని నేర్చుకొని ఆ గణకు మార్గదర్శకత్వం వహించినారు. సంఘశక్తి పెరుగుతున్నది. దాదాలతో

కొట్లాటలతోపాటు క్రమంగా స్నేహబంధాలుకూడా పెరుగుతూ ఉండేవి. ఇప్పుడు సేవావిభాగ్‌లో పనిచేస్తున్న శ్రీ భాస్కర్‌రావ్ కొళంబి అప్పుడు ఎం.ఏ. ఎల్.ఎల్.బి. చేస్తూ శివాజీపార్కు శాఖతోసహా కొన్ని శాఖలకు ప్రముఖ్‌గా ఉండేవారు. బొంబాయి కీలకస్థానంలో ఉన్న పెద్ద నగరం కావటంవల్ల ఎందఱెందరో అధికారులు వచ్చి పోతూండేవారు. 1942లో బొంబాయి నుండి ఐదాగురు స్వయంసేవకులు ప్రచారక్‌గా వెళ్ళటానికి నిశ్చయించుకున్నారు. సంఘ అధికారుల అనుమతి కూడా లభించింది. ఈ పరిస్థితిలో 1942లోనే పరమపూజనీయ శ్రీ గురూజీ ముంబైరావటం జరిగింది. అప్పుడు సాఠేగారు వారిని ''ప్రచారకులుగా వచ్చేవారికి ఖర్చులు ఎవరు భరిస్తారు?'' అని అడిగారు. ఇది పదిమంది పెద్దలు ఉన్నప్పుడు అడిగిన ప్రశ్న. దానికి గురూజీ ''ప్రచారక్‌గా వచ్చే స్వయంసేవక్ ఇవన్నీ ఆలోచింపడు. వచ్చేస్తాడు అంతే. అతనివెంటే పొట్టనిండే ప్రక్రియ కూడా వస్తుంది'' అని సమాధానం చెప్పటం జరిగింది. ఇదొక ఉల్లాసంగా జరిగిన సంఘటన. ఆసంవత్సరం మహారాష్ట్రనుండి యెక్కువ మంది ప్రచారకులు వచ్చేయేర్పాటు జరిగింది. ముంబైనుండి శ్రీ సాఠేజీతో సహా ఐదుగురు రావటానికి నిర్ణయించుకొన్నారు. ప్రచారకుల ఖర్చు ఎవరు భరిస్తారో వాళ్ళకుగూడ సరియైన అవగాహన లేదు. శివాజీ పార్కు శాఖలో మంచి ఉద్యోగాలు చేస్తూ డబ్బు సంపాదించే కార్యకర్తలున్నారు. ''ప్రచారకుల పోషణ సంగతి మేం చూస్తాం. మీరు కార్యవిస్తరణకు యోజన తయారు చేసుకొనండి'' అని చెప్పటం జరిగింది. అప్పుడు అవగాహన అయింది ప్రచారకుల ఖర్చుల విషయం.

అది రెండవ ప్రపంచయుద్ధం జరుగుతున్న సమయం. సాఠేజీ తండ్రిగారు, అన్నగారు మిలిటరీలో ఉద్యోగం చేస్తున్నారు. సాఠేజీ బి.యస్.సి. పాసైనారు. వారి తండ్రిగారు సాఠేజీకి మిలటరీలో మంచి ఉద్యోగం కోసం ప్రయత్నిస్తున్నారు. కాని సాఠేజీ 1942లో తృతీయ వర్ష ఓ.టి.సి.కి వెళ్ళటం జరిగింది. వెంటనే ప్రచారక్‌గా వెళ్ళటానికి నిర్ణయం గూడా జరిగింది. సంఘ శిక్షావర్గ్ పూర్తికాగానే సాఠేజీ అప్పుడు జబల్‌పూర్‌లో పనిచేస్తున్న వారి తండ్రిగారిదగ్గఱకు వెళ్ళవలసి ఉన్నది. కాని సాఠేజీ అక్కడికి వెళ్ళకుండా ఒక ఉత్తరం వ్రాసి అందులో తాను ప్రచారక్‌గా వెళ్ళటానికి నిర్ణయించుకొన్నట్లు తెలియజేశారు. అది చదువుకొని వారి తండ్రి మిక్కిలి నిరాశచెందారు. సాఠేజీకి మంచి ఉద్యోగం ఇప్పించే ప్రయత్నం జరిగింది. అది వచ్చింది కూడ. కాని వారు ప్రచారక్‌గా వెళ్ళటంవల్ల నిరాశతోపాటు కోపం కూడావచ్చింది. రెండుమూడేండ్లు తండ్రిగారు సాఠేజీతో మాట్లాడలేదుగూడ. కాని సాఠేజీ మాత్రం అప్పుడప్పుడు ఉత్తరాలు వ్రాస్తూ తండ్రిగారిని కలిసిపోతూ ఉండేవారు!

శ్రీసాఠేజీతోపాటు మరికొందరు ప్రచారకులుగారావటం జరిగింది. వారిలో ఎవరిని యెక్కడ నియమించాలి అన్న ఆలోచన చేసిన తరువాత సాఠేజీని ముంబైలోని ''బైఖలా'' అన్న పేరుతో ఉన్న విభాగ్‌కి ప్రచారక్‌గా నియమించటం జరిగింది. అది మిల్లులు ఎక్కువగా ఉన్న ప్రాంతం. అయితే ''భాగ్ ప్రచారక్'' అనటానికి బదులుగా ''భాగ్ కార్యవాహ్'' అని పిలవటం జరిగింది. అందువల్ల సాంకేతికంగా వారికి ప్రణామ్ స్వీకరించే అధికారం లభించింది. ఆతరువాత కొద్ది రోజులకు పరమపూజనీయ శ్రీ గురూజీ ''భైఖలా'' భాగ్‌లోని ఒక శాఖకు విచ్చేయటం జరిగింది. అప్పుడు శ్రీసాఠేజీ శ్రీ గురూజీకి ప్రణామ్ చేశారు. శ్రీగురూజీ చిఱునవ్వుచిందిస్తూ ప్రణామ్ చేసి మౌనంగా ఉండిపోయారు. ఆపిమ్మట కార్యకర్తల బైఠక్ జరిగింది. శ్రీ గురూజీ విచ్చేశారు. అప్పుడు వారు సాఠేజీతో ''ఏమిటి! సంఘ ప్రచారక్ ప్రణామ్ తీసుకొనటం ఎప్పటినుండి ప్రారంభమైనది?'' అని అడిగారు. సాఠేజీకి ఇదంతా క్రొత్తగా అనిపించి కొంత బిత్తఱపోయి శ్రీ గురూజీతో ''నాకూ సరిగా అవగాహన కాలేదు. నేను ప్రచారక్‌గా వచ్చాను. కాని నన్ను కార్యవాహ్‌గా నియమించారు. కార్యవాహ్ ప్రణామ్ తీసుకొనటం పరిపాటి. అందువల్ల తీసుకొంటున్నాను'' అని సమాధానం చెప్పారు. అప్పుడు గురూజీ ప్రచారక్‌గా ఉన్న వ్యక్తికి ప్రణామ్ తీసుకొనే అధికారంలేదు. స్థానిక కార్యవాహ్‌కీ, సంఘచాలక్‌కీ మాత్రమే ఆ అధికారం ఉన్నది. ప్రచారక్ అందరి మధ్య ఒక సమన్వయకర్త మాత్రమేగాని ప్రణామ్ తీసుకొనే అధికారికాడు'' అని వివరించి చెప్పారు.అందరికీ యీ సంఘ పరిపాటిని గూర్చి అప్పుడర్థమైనది . బైఖలాభాగ్ పరిధిలో మిల్లులు ఎక్కువగా ఉండటం వల్ల ఉద్యోగం చేసే వారు భిన్నభిన్న సమయాల్లో వచ్చిపోతూ ఉండేవారు. అప్పటి వఱకు అక్కడ ప్రచారక్ అంటూ లేక పోవటంవల్ల వాళ్ళందరినీ మనవైపుకు మళ్ళించుకునే ప్రయత్నం అంతగా జరుగలేదు. ఇప్పుడు ఒక ప్రచారక్ అంటూ ఏర్పడటంవల్ల అందరూ కలిసి పనిచేయటంవల్ల మంచి వాతావరణం ఏర్పడి అభివృద్ధిపథంలో పయనం సాగింది.

ఇలా వ్యవస్థిత రూపంలో పనిజరుగుతూ ఉండటం చూసి పై అధికారులు సంతసించటం జరిగింది. సాఠేజీకిగాని వారి సహచరబృందానికిగాని మంచి ఉత్సాహం పుంజుకున్నదని చెప్పటం విశేషంగాదు. శ్రీసాఠేజీ ముంబైలో 1949వఱకు ప్రచారక్‌గా పనిచేయటం జరిగింది. దాదర్‌లో శివాజీశాఖలో పనిచేసినప్పుడు, బైఖలావిభాగ్‌లో పని చేసినప్పుడు, దరిమిలా ముంబైమొత్తానికి ప్రచారక్‌గా ఉన్నప్పుడు - ఈ అన్ని సమయాల్లోను ఉత్తరోత్తరబలీయంగా జరిగిన సంఘకార్యాభివృద్ధివల్ల సాఠేజీతో సహా ఆనాటి కార్యకర్తల బృందం పొందిన సంతృప్తి చిరస్మరణీయం. సాఠేజీ కార్యపద్ధతిని గూర్చి స్వయంసేవకులందరికీ సుపరిచితమే. ప్రతి విషయాన్ని చాలా సూక్ష్మంగా ఆలోచించి

నిర్ణయాలు తీసికొనటం వాటిని సరిగ్గా అమలు పరచటం. శాఖల సంఖ్య, శాఖల్లో స్వయంసేవకుల సంఖ్య, కార్యకర్తల సంఖ్య, సంఘ శిక్షార్థులసంఖ్య, ప్రచారకుల సంఖ్య, గురుదక్షిణలో ఏ సంవత్సరానికి ఆ సంవత్సరం ప్రగతి - ఇలా సర్వాంగీణమైన అభివృద్ధిని సాధించటంలో వారు దిట్ట. అందువల్లనే ముంబై వంటి పెద్ద నగరంలో గూడ వారు గొప్ప ప్రగతిని సాధింపగలిగారు. మొత్తం ముంబైకి వారు ప్రచారక్‌గా ఉన్నప్పుడు వారి అధీనంలో ఉన్న కార్యకర్తలందరూ ప్రతిరోజు మధ్యాహ్నం భోజన సమయంలో తప్పకుండా కలుసుకుంటూ ఉండేవారు. భోజనాలు గంటన్నర సేపు సాగేవి. నిన్నటి భోజన సమయం నుండి యీ రోజు భోజన సమయం వఱకు జరిగిన - సంఘకార్యానికి సంబంధించిన విషయాలన్నీ తీరిగ్గా కూలంకషంగా చర్చించుకునేవారు. దానివల్ల కార్యకర్తల మధ్య చక్కని సయోధ్య, సహకారం, ఆత్మీయతలు పెరిగి సంఘకార్యం మంచి బిగింపుగా జరిగేది. మిగతా కార్యకర్తలందరితోబాటు సాతేజీకి మరొక యిద్దరు ముగ్గురు ప్రచారకులు కుడియెడమ భుజాలుగా ఉండి పనిచేస్తూ ఉండేవారు.

1947లో స్వతంత్రం వచ్చేనాటికి దేశపరిస్థితులు ఒక విశేషమైన తీరులో నడుస్తూ ఉండేవి. 1942లో ''క్విట్ ఇండియా ఉద్యమం'' విజృంభణగా సాగింది. కాని త్వరలోనే ఆవేడి పొంగులు చల్లారిపోవటం ప్రారంభించింది. ఇది కాంగ్రెస్ వారిని అయోమయంలోకి నెట్టింది. మరొక వైపు సంఘపని పెరుగుతూనే ఉన్నది. ఈ పరిస్థితుల్లో కాంగ్రెసువారే సంఘ శాఖలకు రావటం మొదలుపెట్టారు. దాదర్‌లో ఒక కాంగ్రెసు నాయకుడుండేవాడు. ఆయన ఆ ప్రాంతపు కాంగ్రెసుకు కోశాధికారి. ఆయనతో సాతేజీకి పరిచయమేర్పడి స్నేహంగా వృద్ధిచెందింది. ఆయన, సాతేజీ ప్రభృతి ప్రచారకులు రాత్రింబవళ్ళు చచ్చేటట్లు పనిచేయటం చూసి ఆశ్చర్యచకితుడై ''మీకు సంఘం ఎంత జీతమిస్తుందని అడిగారు. సాతేజీ జీతమేమీలేదు, ప్రతినెలా అయ్యే ఖర్చు ఇస్తుంది అనిచెప్పారు. ఎంత ఖర్చవుతుందని తిరిగి ప్రశ్నించాడు. ఇంత అని యేమీ లేదు. ఒక నెల కొంచెం ఎక్కువ, ఒక నెల కొంచెం తక్కువ కావచ్చు. ఎంత అయితే అంత యిస్తుంది అని చెప్పారు సాతేజీ. ఆయన అంతటితో ఊరుకోక ప్రతినెల సరాసరి యెంత అవుతుంది అని మళ్ళీ అడిగాడు. ఆరోజుల్లో ఒక వ్యక్తి పోషణకు ఎక్కువలో ఎక్కువ పాతిక ముప్పైరూపాయలకంటె అవసరముండేదిగాదు. అందువల్ల అదే సంఖ్య చెప్పారు సాతేజీ. ఆయన ఆశ్చర్యపోయాడు. ఒక కాంగ్రెస్ కార్యకర్తకు 75 రూపాయల చొప్పున జీతముండేది. కాని వాళ్ళు చేసే పనిశూన్యం, కాని సంఘ ప్రచారకుల విషయం అలాకాదే! అదీ ఆయనగారి ఆశ్చర్యం. అది మొదలుకొని ఆయన శాఖకు రావటం మొదలుపెట్టారు. ఆవరుసలో ఎందరో కాంగ్రెసువారు సంఘంలో ప్రవేశించటం ప్రారంభమైనది.

ప్రతినెల ప్రచారకులకు ఖర్చుల నిమిత్తమిచ్చేడబ్బువిషయంలో ఒక ఉదంతం ఇలా ఉన్నది. సాఠేజీకి మొదటినెల ఖర్చులనిమిత్తం కొంత మొత్తం ఇవ్వటం జరిగింది. రెండవ నెల ప్రారంభంలో రొక్కం ఇవ్వవలసిందిగా సాఠేజీ అడిగారు. మొదటినెల యిచ్చిన మొత్తానికి లెక్కచెబితే రెండవనెల ఖర్చుల నిమిత్తం డబ్బు ఇవ్వటం జరుగుతుంది అని కార్యాలయంవారు చెప్పటం జరిగింది. దాని మీద సాఠేజీకి కోపమొచ్చి మామీద అంతనమ్మకం లేదా మీకు అని అడిగారు. నమ్మకం, అపనమ్మకం అన్న ప్రశ్న కాదక్కడ. లెక్క చెప్పాలి అంతే, అని అవతలి వాళ్ళన్నారు. సాఠేజీ లెక్కచెప్పలేదు సరిగదా! ఆరునెలల వఱకు మళ్ళీ డబ్బడగలేదు.సంఘకార్యాలయం వారు ఆశ్చర్యపోగా సాఠేజీ ఆలోచించటం మొదలుపెట్టారు. ఒక వ్యవస్థలో వర్తించేటప్పుడు జమా ఖర్చుల వివరం చెప్పం అవసరమన్న నిర్ణయానికి వచ్చారు. పరిస్థితులు సర్దుకొన్నవి. ఈ సందర్భంలో సాఠేజీ డాక్టర్జీ ఉదాహరణ ఒకటి పేర్కొన్నారు : డాక్టర్జీ ఎప్పటికప్పుడు పూర్తి వివరాలతో లెక్క వ్రాసియిస్తూ ఉండేవారు! దరిమిలా సాఠేజీ ప్రతినెలా లెక్క చెప్పి డబ్బు తీసుకుంటూ ఉండేవారు. లెక్క చెప్పటం సంఘ వ్యవస్థ దృష్ట్యా చాలా అవసరం అన్న కచ్చితమైన దృక్పథాన్ని ప్రతి కార్యకర్తకు సూచించటానికే యీ ఉదంతం ప్రస్తావింపబడింది.

1947లో మనకు స్వాతంత్ర్యం లభించింది. అంతకుపూర్వము, ఆపిమ్మట సంఘశక్తి విపరీతంగా పెరిగిపోతున్నది. దీన్ని యెట్లా దెబ్బదీయాలా, అన్న కుట్ర బుద్ధి కాంగ్రెసు నాయకుల బుఱ్ఱల్లో పనిచేస్తూనే ఉన్నది. ఇంతలో 1948 జనవరి 30నాడు గాంధీజీ హత్య జరిగింది. అంతే అదిసాకుగా తీసుకొని ఆ నేరం అన్యాయంగా సంఘంపై రుద్ది ప్రభుత్వం సంఘంపై నిషేధం విధించింది. నిజానికి గాడ్సేకి సంఘానికి సంబంధం ఏమీలేదు. ''వందేమాతరం'' అనే సాప్తాహిక్‌ను అతడు నడుపుతూ ఉండేవాడు. అందులో గాంధీజీ మీద తనకున్న అభిప్రాయాలన్నీ యేకరువుపెడుతూ ఉండేవాడు. గాంధీజీ మీద అతనికున్న అభిప్రాయాలు, హత్య చేయాలన్న నిర్ణయం ఆతని సొంతవి. అతడు గాంధీజీని హత్యచేసినప్పుడు ఆతణ్ణి గూర్చి బాగా తెలిసిన వ్యక్తి ఒకరు ఆ ప్రార్థనా సమావేశంలో ఉన్నాడు. ఆదృశ్యం చూసి ఆ వ్యక్తి ''ఓయీ! నాధూరామ్ ఈపని నువ్వు చేశావా! అని ఆశ్చర్యంతో ఆక్రోశించాడు! నాధూరామ్‌ని గూర్చి తెలిసిన ప్రతివారికీ, సంఘానికీ ఆతనికీ యేమీ సంబంధంలేదని తెలుసు. ప్రభుత్వానికి కూడ. అయినా తమ కుట్ర బుద్ధి కనుగుణంగా ప్రభుత్వం సంఘంపై ఈ నేరం మోపి నిషేధం పెట్టింది! ఇది సంఘానికి ఒక పెద్ద పరీక్ష! ఈ పరీక్ష నుండి సంఘం బైటికి వచ్చింది. దీనికోసం ఎంతో శ్రమపడవలసివచ్చింది మనకు. సత్యాగ్రహం చేయటానికి సంఘం నిర్ణయించినప్పుడు, సత్యాగ్రహానికి వెళ్ళే ప్రతి స్వయంసేవకుని వ్యక్తిగతంగా కలుసుకొని, ఇంటి పరిస్థితుల్ని

ఆకళింపు జేసుకొని చక్కని వ్యవస్థను ఏర్పాటు చేసిన తరువాత ఆతణ్ణి సత్యాగ్రహానికి పంపటం జరిగింది. ఇలా ప్రతి సత్యాగ్రహిని గూర్చిన యేర్పాటు చేసే బాధ్యత మొత్తం బొంబాయి నగరానికి సంబంధించి శ్రీ సాఠేజీయే నిర్వహించటం జరిగింది. ఒక్క బొంబాయి నగరంనుండి అప్పుడు సత్యాగ్రహంలో పాల్గొన్న స్వయంసేవకుల సంఖ్య పదిహేను వందలు. వీరుగాక మరొక ఎనిమిది వందల మంది స్వయంసేవకుల పట్టిక శ్రీ సాఠేజీ దగ్గఱ సిద్ధంగా ఉన్నది. సత్యాగ్రహాన్ని ఆపివేయవల్సిందిగా సంఘ అధికారులు ఆదేశించిన నాటి పరిస్థితియిది. 1949 జులై 12వ తేదీనాడు సంఘంపై నిషేధం తొలగింపబడింది. కాంగ్రెసు ప్రభుత్వం సంఘ స్వయంసేవకుల్ని శత్రువులుగా భావించి నందువల్ల నిషేధం తొలగింపబడిన పిమ్మట ఎందరెందరో ఉద్యోగాలు కోల్పోవటం జరిగింది. వీరందిరికీ మళ్ళీ యేదో ఒక ఉద్యోగాన్ని చూపించి వారికి దారి ఏర్పర్చాల్సిన బాధ్యత మళ్ళీ సాఠేజీ ప్రభృతుల భుజస్కంధాలమీద పడింది. వారందరిపేర్లను, డిగ్రీలను ఒకపట్టికగా రూపొందించి ఘెవరెవర్ని కలుసుకొంటే వారికి ఉద్యోగాలు ఇప్పించగలరో, ఇవ్వగలరో వారందర్నీ కలుసుకొనే ప్రయత్నం సాగింది. కనపడిన స్వయంసేవకులందరికీ యీ విషయాలు చెప్పి, వారిద్వారా అనేక విషయాలు సేకరించటం జరిగింది. కేవలం గుమాస్తాలుగా పనిచేసిన స్వయంసేవకులకు ఉద్యోగాలు సంపాదించటం కొంచెం కష్టమన్న సంగతి యీ వేట వల్ల అర్థమైనది. కొన్ని ప్రత్యేకమైన యోగ్యతలు, అర్హతలుగల స్వయంసేవకులకు మాత్రం మన ప్రయత్నాలు లేకుండానే వాటంతట అవే ఉద్యోగాలు రావటం జరిగింది. కొందర్కైతే, అసలు ఊహించటానికే వీలులేనంత మంచి ఉద్యోగాల లభించినయి.

సంఘంపై నిషేధం తొలగింపబడిన తరువాత, ఈ ప్రయత్నాలన్నీ అలా సాగుతూ ఉండగా కార్యకర్తలందరూ మళ్ళీ సంఘకార్యం వైపు శాఖా కార్యం వైపు దృష్టి సారించటం జరిగింది. సాఠేజీ మఱియు వారి సహకార్యకర్తలు కలిసి కొన్ని నిర్ణయాలు తీసుకొన్నారు. సంఘకార్యకర్తలుగాను, అధికారులుగాను పనిచేసి వృద్ధాప్యపు గడపలోకాలుపెడుతున్న వారినీ, క్రొత్తగా స్వయంసేవకులై తమ కర్తృత్వశక్తి చేత, నిష్ఠచేత సంఘకార్యాన్ని ముందుకు తీసుకొని పోగలరు అన్న అభిప్రాయాన్ని, నమ్మకాన్ని కలిగించేవారినీ కార్యరంగంలోకి దింపి వారి చేత పనిచేయించే యోజన ఒకదాన్ని రూపొందించుకొనటం జరిగింది. దాని ప్రకారం అట్టి వ్యక్తుల పట్టిక తయారుచేసి ఒకానొక క్రమపద్ధతిలో వారినందర్నీ కలిసి ''సంఘంపై నిషేధం తొలిగింది. సంఘకార్యాన్ని క్రొత్త ఊపుతో మళ్ళీ ప్రారంభించాలి. ఈ విషయంలో మీ అభిప్రాయం ఏమిటి? మీ సహకారం ఏవిధంగా లభిస్తుంది. అన్న మాటల పద్ధతిగా వారిని కదపటం జరిగింది. చాలా మందికి సంఘకార్యాన్ని గూర్చి చక్కని అవగాహన

కలిగింది. ఉత్సాహంతో ముందుకు వచ్చి సంఘపని చేయటం ప్రారంభించారు. ఈవిధంగా మంచి కార్యకర్తల బృందం ఏర్పడింది. అంతేగాదు, వారిలోనుండి దాదాపు ముప్పై, ముప్పైయ్యైదుమంది కార్యకర్తలు ప్రచారకులుగా కూడా రావటం జరిగింది. బొంబాయిలో విశేషమేమంటే ప్రతి సంవత్సరం ప్రచారకులు విరివిగా వస్తూనే ఉంటారు. ఇప్పుడు వచ్చిన ప్రచారకులు, ఇప్పటి వఱకు నిషేధం వల్ల ఆగిపోయి అది యెత్తివేసిన పిమ్మట కట్టలు త్రెంచుకొని ప్రవహించినట్లు వచ్చేశారు.

ఇలా ఉండగా ఒకనాడు అప్పటి మహారాష్ట్ర ప్రాంత ప్రచారక్ శ్రీ బాబారావ్‌ఖిడే గారు శ్రీసాతేజీని పిల్చి ''రామ్, నీవు ప్రచారక్‌గా బైటికి వెళ్ళగలవా?'' అని అడిగారు. దానికి సాతేజీ ''మీరు ఏమి ఆదేశిస్తే అది శిరసావహిస్తాను'' అని సమాధానం చెప్పారు. దరిమిలా వారిని హైదరాబాదుకు బదిలీ చేయటం జరిగింది. హైదరాబాదు సంస్థానంలో తెలుగు, మరాఠీ, కన్నడ భాషల జిల్లాలు భిన్న భిన్న సంఖ్యలో ఉన్నాయి. ఈ మూడింటిని విడగొట్టి ఆయా భాషా రాష్ట్రాలలో చేర్చే ఆలోచన అప్పటికే ప్రభుత్వానికున్నట్లు చర్చ జరుగుతూ ఉండేది. అందువల్ల హైదరాబాదు సంస్థానంలో ఉన్న ఈ మూడు ప్రాంతాలకు ముగ్గురు ప్రచారకుల్ని పంపేయోజన జరిగింది. అప్పటి వఱకు హైదరాబాదు సంస్థానమంతా ఒక భాగ్‌గా కర్ణాటక ప్రాంతానికి అనుబంధితమై శ్రీ యాదవరావ్‌జీ జోషి ఆధ్వర్యంలో ఉండేది. శ్రీ సాతేజీని మరాట్వాడాకు పంపవచ్చునన్న ఊహలు గూడ వ్యాపించినయి. కాని వారు హైదరాబాదు నగరానికి వస్తే బాగుంటుందని ఆకాంక్షించిన వారు చాలా మంది ఉండిరి. ఆ ఆకాంక్షకు అనుగుణంగా వారిని 1949 అక్టోబరు 2 వతేదీన హైదరాబాదు నగర ప్రచారకుగానే పంపటం జరిగింది. శ్రీయాదవరావ్‌జీ వ్రాసిన లేఖ ప్రకారం శ్రీసాతేజీ హైదరాబాదునగర ప్రచారకులుగా నియుక్తులై అక్టోబర్ 12 నుండి నగరంలో సంఘ పని ప్రారంభించారు.

హైదరాబాదు సంస్థానంలో ఆకాలంలో ఉస్మానియా యూనివర్శిటీ ఒక్కటే ఉండేది. ఎనిమిది తెలుగుజిల్లాలు, ఐదు మరాఠీ జిల్లాలు, మూడు కన్నడ జిల్లాలు ఉన్న యీ సంస్థానపు ఒకే ఒక యూనివర్శిటీలో ఎక్కువగా మరాఠీ విద్యార్థి స్వయంసేవకులు ఉండేవారు. వాస్తవానికి హైదరాబాదు నగరం చుట్టూ తెలుగు జిల్లాలు ఉండటంవల్ల తెలుగు వారు ఎక్కువగా ఉన్నప్పటికీ శాఖలవాతావరణం మరాఠీమయంగా ఉండేది. తెలుగు వాతావరణం తక్కువగా ఉండేది. ఇది గమనించిన సాతేజీ శాఖల్లో తెలుగు వాతావరణం వచ్చేటట్లుగా ప్రయత్నించాలని నిర్ణయం తీసుకున్నారు. 1951 ప్రారంభంలో హైదరాబాదునందలి వివేక వర్ధినీ కాలేజీలో పరమపూజనీయ శ్రీగురూజీ కార్యక్రమం

ఏర్పాటు చేయబడింది. ఆనాటిశాఖలో శారీరక్ కార్యక్రమాలకు ప్రాధాన్యం ఇవ్వాలన్న నిర్ణయం జరిగింది. ఆ సందర్భంలో శ్రీ గురూజీ స్వయంగా దండ ఎల్లా నేర్పాలి, సమత ఎట్లా చేయాలి వగైరా విషయాలను చూపించటం జరిగింది. సాఠేజీ 1953వఱకు హైదరాబాదులో ఉన్నారు. అప్పటికి నగరంలో ఇరవై ఐదు ఉపశాఖలు ఏర్పడినవి. మొత్తం నగరం ఐదు భాగ్‌లుగా విభజింపబడింది. నగరం చాలా పెద్దది. కార్య వృద్ధి జరగాలంటే బాగా తిరగాలి. అందుకోసం ప్రతి కార్యకర్తకు ఒక సైకిల్ ఉండాలి. అన్న నిర్ణయానికి రావటం జరిగింది. ముఖ్యులైన కార్యకర్తలందరూ సైకిల్ కొనుక్కొనటం జరిగింది. ఆరోజుల్లో ఇదొక పెద్ద విశేషంగా చెప్పాలి. శ్రీ సాఠేజీతో సహా కార్యకర్తలందరూ నగరంలోని యీ మూలనుండి ఆ మూలవఱకు, బొల్లారందాకా సైకిల్‌మీదనే తిరుగుతూ ఉండేవారు. ఆనాడు శ్రీ వెంకట్రావ్‌జీ దేశాయ్ అనే అడ్వకేటుగారు నగర కార్యవాహ్‌గా ఉండేవారు. అవి సంఘ కార్యకర్తలమీద ప్రభుత్వం వారి సి.ఐ.డి. నిఘాబాగా ఉన్నరోజులు. ఇలాంటివి యేవివచ్చినా స్వయంసేవకుల తరపున శ్రీ వెంకట్రావుజీ దేశాయి సమాధానం చెబుతూ ఉండేవారు. అదీ పరిస్థితి.

1953 సం॥ ప్రారంభంలో సంఘ దృష్ట్యా ఒక ముఖ్యమైన నిర్ణయం జరిగింది. దాని ప్రకారం మరాట్వాడా జిల్లాలు మహారాష్ట్రలోను, కన్నడ జిల్లాలు కర్ణాటక ప్రాంతంలోను, హైదరాబాదు నగరంతోసహా తెలంగాణా జిల్లాలు ఆంధ్రప్రాంతంలోను కలపటం జరిగింది. అప్పటికి సిటీలో ఏడెనిమిది మంది ప్రచారకులుగా తయారై వచ్చారు. వీరిలో ఒకరిద్దరు కన్నడ ప్రచారకులు. వారు కర్ణాటకకు వెళ్ళిపోయారు. నగుగురైదుగురు మరా( ప్రచారకులు. వీళ్ళు మరాట్వాడాకు వెళ్ళిపోయారు. తెలుగు ప్రచారకులు ఒకరిద్ద ఉండేవారు. వీరితోపాటు శ్రీ సాఠేజీ ఆంధ్రకు బదిలీ చేయబడినారు. 1953 మే నెల ఆంధ్రప్రాంత సంఘశిక్షావర్గ విజయవాడలో జరుగుతున్న సమయమది. అది చూడటాని ఓ. టి. సి చివరిరోజుల్లో సాఠేజీ విజయవాడకు వెళ్ళటం జరిగింది. గుంటూరు నగరాన్ని మినహాయించి మిగతా గుంటూరు జిల్లా అంతటికీ తెనాలి పట్టణం కేంద్రంగాజేసి తెనాలి జిల్లా పేరుతో ఏర్పాటుచేసి ఆ జిల్లాకు ప్రచారకుగా సాఠేజీని పంపటానికి ఆ ఓ.టి.సి.లో నిర్ణయం జరిగింది. అది మొదలుకొని సాఠేజీ తెనాలి జిల్లా ప్రచారకుగా తెనాలికి చేరుకొన్నారు.

శ్రీ సాఠేజీకి అంతకుముందు తెలియని విషయం అక్కడికి వచ్చిన తరువాత తెలి విషయం ఒకటున్నది. అప్పుడు ఆ జిల్లాలో పనిచేస్తున్న పలువురు ప్రచారకులు ( భేదాలు పెట్టుకొని సంఘం విడిచి పెట్టి వెళ్ళిపోయారు. వారు పోవటమేగాక ఆ జిల్లా

శాఖలన్నీ యెండిపోయేటట్లు చేయగలిగారు. ఈ పరిస్థితిలో జిల్లాలో మిగిలిన కొద్దిమంది కార్యకర్తలు చాలా నిరుత్సాహంగా ఉన్న సమయమది. అప్పుడు సాఠేజీ ఒక్కటే మాట చెప్పారు: వెళ్ళిపోయిన వాళ్ళ సంగతి వదిలెయ్యండి. సమాజంలో ఇంకా చాలా మంది ఉన్నారు. వాళ్ళను శాఖలవైపు ఆకర్షించే ప్రయత్నం చేద్దాం. కొత్త వాళ్ళతో పరిచయ సంబంధాలు పెంచుకొనండి. ఒక పట్టిక తయారు చేసి క్రమ పద్ధతిలో కలుస్తూ వెళ్ళండి. అంటూ ఇంకా ఎన్నో వివరాలతో ఒక అద్భుతమైన ప్రణాళికను సూచించారు. దానిప్రకారం పని జరిగింది. క్రొత్త వారితో శాఖలు కళకళలాడటం ప్రారంభమైనది. సంఘ శిక్షావర్గకు వెళ్ళే స్వయంసేవకుల సంఖ్య పెరిగింది. ప్రతి సంవత్సరం ప్రచారకుల సంఖ్య పెరిగింది. జిల్లాలో వసంతర్తు శోభవెల్లి విరిసింది.

శ్రీ సాఠేజీ తెనాలి జిల్లాలో రెండేళ్ళు, పిమ్మట గుంటూరు పట్టణంతో సహా గుంటూరు జిల్లాలో రెండేళ్ళు మొత్తం నాలుగేళ్ళు ఆ జిల్లాలో జిల్లా ప్రచారక్‌గా పనిచేశారు. తెలుగు బాగా నేర్చుకొన్నారు. వారి మొదటి పూర్తి తెలుగు బౌద్ధిక్ పల్నాటిసీమలోని గురజాలలో ఒక నిశాశాఖలో జరిగింది. అక్కడి కార్యవాహ్ శ్రీ కంభం పాటి నాగభూషణశాస్త్రిగారి కోరికపై వారు తమ మొదటి తెలుగు బౌద్ధిక్ ఇచ్చారు. గుంటూరు జిల్లాలో శ్రీ సాఠేజీ మరొక ప్రయోగం చేశారు. శాఖల్లో జరిగే శారీరక్ కార్యక్రమాల్లో ఆసనాలు వేయించటం ప్రారంభించారు. ఇవి సామూహిక ప్రదర్శనల్లోగూడా వేయించటం జరిగింది. దీనివల్ల ఆరోగ్యం కోసం తహతహలాడే ప్రౌఢ స్వయంసేవకుల సంఖ్య శాఖల్లో విపరీతంగా పెరగటం జరిగింది. ఒకసారి గుంటూరు సమీపంలో సంఘక్యాంపు జరిగింది. స్వయంసేవకులు రాత్రిపూట శిబిరానికి చేరుకొన్నారు. మరుసటిరోజు ఉదయం ప్రభాత్ శాఖ జరుగుతున్నది. స్వయంసేవకులందరూ సామూహిక శీర్షాసనంలో ఉన్నారు. ఇంతలోకి శిబిర సర్వాధికారి, పెద్ద పొగాకు వ్యాపారయజమానులు ఐన శ్రీ ఏకా ఆంజనేయులుగారు శాఖలో పాల్గొనటానికి కారులో వచ్చారు. వందల మంది స్వయంసేవకులు శీర్షాసనంలో ఉండటం చూసి ఆశ్చర్యంతో స్తంభించిపోయారు. ఏమిటిది? అని ఉండబట్టలేక అడిగారు. సాఠేజీ శీర్షాసనం అనిచెప్పి ఆసనాల విషయం, శాఖలో శారీరక కార్యక్రమాల విషయం వివరించారు. వారి ఆశ్చర్యానికి మేఱలులేవు. అది మొదలుకొని వారు సంఘంతో మమైక్యచెందారు. ఆప్రక్కనే వారి మామిడి తోట ఉన్నది. అదంతా ఒక అద్భుతమైన సుందరదృశ్యం! మొదటి ఒక సంవత్సరం తెనాలి కేంద్రంగా తర్వాతి మూడు సంవత్సరాలు గుంటూరు కేంద్రంగా మొత్తం గుంటూరు జిల్లా ప్రచారక్‌గా శ్రీసాఠేజీ నాల్గు సంవత్సరాలు పనిచేశారు. తర్వాత ''డిసింట్రీ'' తఱచుగా బాధించటంవల్ల ఆరోగ్యం దెబ్బతిన్నది. ఇక అక్కడ ఉండలేక విశ్రాంతి కోసం స్వగ్రామం

''వాయా''కి వెళ్ళిపోయారు. కొద్ది రోజుల తరువాత మళ్ళీ తిరిగి వచ్చారు. ఈసారి వారి ఆరోగ్యం దృష్ట్యా ఒక్క ఏలూరు పట్టణానికి ప్రచారక్‌గా నియమించటం జరిగింది.

ఏలూరులో పవర్‌పేట మధ్యలో ఒక స్వయంసేవక్ యొక్క ఇల్లే కార్యాలయం. అక్కడ ఉంటూ స్వయంగా వండుకొని తింటూ ఒక సంవత్సరం ఉన్నారు సాఠేజీ. ఏలూరు పట్టణమొక్కటే వారి కార్యక్షేత్రం. పాత కొత్త స్వయంసేవకుల్ని కలుసుకుంటూ సంఘవాతావరణాన్ని మళ్ళీ నిర్మిస్తూ ఒక గొప్ప కోలాహలాన్ని సృష్టించగలిగారువారు. వారు అక్కడ ఉన్నది ఒక్క సంవత్సరమే. మొదటి ఆరునెలల్లో శాఖలు పుంజుకొన్నాయ్. అక్కడ పేరయ్యకోనేరు అనే పేరుతో పెద్దమైదానమున్నది. అందులో ఏలూరు సంఘ చరిత్రలో ఎన్నో సంవత్సరాల తర్వాత చాలా పెద్ద సార్వజనికోత్సవం ప్రదర్శనతోపాటు జరిగింది. పిమ్మట ఆరునెలలు సంఘవాతావరణమే వాతావరణం. మరొకసారి శ్రీ ఏకనాథ్‌ర్యాడేగారి కార్యక్రమం జరిగింది. ఈవిధంగా ఏలూరులో గొప్ప చరిత్రను సృష్టించిన సాఠేజీని విశాఖపట్టణానికి బదిలీచేయటం జరిగింది.

విశాఖపట్టణంలో గూడ శ్రీ సాఠేజీ 1958 జూన్ జులైల నుండి 59 జూన్ జులైల వఱకు ఒక్క సంవత్సరం మాత్రమే పనిచేశారు. అది ఆంధ్రయూనివర్శిటీ కేంద్రం. ఆనర్సుకోర్సులు ఉండేవి. మేధావంతులైన విద్యార్థులు చదువుతూ ఉండేవారు. అక్కడి యూనివర్శిటీ హాస్టల్లో దాదాపు వెయ్యిమంది విద్యార్థులు ఉండేవారు. అయినా యూనివర్శిటీశాఖ చాలా బలహీనంగా ఉండేది. అక్కడ ''అఫీషియల్స్‌కాలనీ'' అనే ప్రాంతం ఒకటి ఉన్నది. అక్కడి వాళ్ళందరు పెద్ద పెద్ద ఉద్యోగస్థులు. వారి సంతతికూడా వివిధ కళాశాలల్లోను, యూనివర్శిటీలోను చదువుకుంటూ ఉండేవారు. అయినా అక్కడి శాఖ ''బలహీనంగా'' ఉంది. శ్రీ సాఠేజీ ఆ శాఖ విషయం ప్రత్యేకించి పట్టించుకొని బాగా ప్రయత్నం చేయటం జరిగింది. వారక్కడ ఉన్న మొదటి ఆరునెలల్లో ఆ ఒక్క శాఖ మొత్తం నాల్గు శాఖలుగా విస్తరిల్లింది. శారీరక్, బౌద్ధిక్ కార్యక్రమాలు భిన్నభిన్న పద్ధతుల్లో క్రొత్త కొత్త పోకడల్లో నిర్వహించటం వల్ల సంఘశక్తి బాగా వృద్ధిపొందింది. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో చిరకాలం నుండి పనిచేస్తున్న ఒక ప్రొఫెసరు, వారు గుంటూరులో ఆంధ్రయూనివర్శిటీ తరలింపబడినప్పుడు గుంటూరులోగూడ ఉద్యోగం చేసిన వ్యక్తి సాఠేజీ యొక్క కార్యకర్తృత్వశక్తికి ఆశ్చర్యచకితులైనారు. విశాఖపట్టణంలో చిరకాలంగా తానుచూస్తూ వచ్చిన సంఘచరిత్రను, గుంటూరులో ఉన్నప్పుడు చూసిన సంఘచరిత్రను పోల్చిచూసి తన అభిప్రాయాన్ని వ్యక్తం చేయటం జరిగింది. విశాఖపట్టణంలో ఆదినుండి సంఘశాఖలు బలహీనంగానే ఉండేవి. గుంటూరులో జోరుదారుగా ఉండేవి. సాఠేజీ చేసిన

కృషి, దానివల్ల విశాఖపట్టణంలో సంఘం పెరిగిన వైనం చూసిన తరువాత చక్కగా పనిజరిగితే విశాఖపట్టణం మరొక గుంటూరుకాగలదు అన్న అభిప్రాయాన్ని ఆయన నిక్కచ్చిగా వ్యక్తంచేయటం జరిగింది. కాని విశాఖపట్టణం దురదృష్టం. అక్కడినుండి సాతేజీని మళ్ళీ హైదరాబాదుకు మార్చటం జరిగింది. వారు 1959 చివరి దశలో మళ్ళీ హైదరాబాదుకు చేరుకొన్నారు.

1960-1972 వఱకు హైదరాబాదులో పనిచేసిన తరువాత తమ తల్లిదండ్రుల ఆరోగ్యం సరిగాలేనందువల్ల శ్రీసాతేజీ కొన్ని నెలలు సెలవుతీసుకొని తమ స్వగ్రామం ''వాయీ''కి వెళ్ళిపోయారు. 1973 జూన్‌లో శ్రీ గురూజీ దివంగతులైనారు. ఆతరువాత సెప్టెంబరులో శ్రీసాతేజీ మళ్ళీ కార్యరంగంలోకి రావటం జరిగింది. అయితే యీసారి వారి నియుక్తి హైదరాబాదులోగాక జబల్‌పూర్‌లో జరిగింది. వారు 1973 సెప్టెంబరు/అక్టోబరులలో జబల్‌పూర్ వెళ్ళిపోయారు. అక్కడ రెండేళ్ళు పనిజేసిన తరువాత 1975లో ఎమర్జెన్సీ వచ్చిపడింది. ఆసమయంలో వారు అక్కడే ఉన్నారు. పిమ్మట 1981 వఱకు జబల్‌పూర్‌లోనే ఉండినారు. మళ్ళీ అక్కడ ఆరోగ్యం చెడింది. మాననీయ శ్రీ మోరోపంత్ పింగళేగారి ఆదేశం మేఱకు 1983 వఱకు పూనాలో ఉంటూ ''ఇతిహాస సంకలన సమితి''పని చేయటం ప్రారంభించారు.

ఆరంగంలో వారు నిర్మించిన మొదటి పరిశోధనగ్రంథం ''మహాభారత్‌వార్' అన్నది. అది పూనా హైదరాబాదు రెండునగరాలనుండి ప్రచురింపబడింది. దరిమిలా ''ఆర్యన్ ప్రాబ్లమ్'' మీద బెంగుళూరులో జరిగిన చరిత్రాత్మకమైన, దేశ విదేశ విద్వాంసుల్ని ఆకర్షించిన గొప్ప గోష్ఠి (సెమినార్) సాతేజీ చేసిన కృషిలో మరొకమైలురాయి. వారు తమ రచనలుగా మొత్తం 20 గ్రంథాలు ప్రచురించారు. వాటిద్వారా మొత్తం దేశానికే మార్గదర్శకులైనారన్నచో అతిశయోక్తికాదు. గోవా మహారాష్ట్ర, ఆంధ్ర, కర్ణాటక, తమిళనాడు, పాండిచ్చేరి, కేరళరాష్ట్రాల క్షేత్రానికి వారు ఇతిహాస సంకలన సమితి ప్రముఖ్‌గా పనిచేసి గొప్ప చరిత్రను సృష్టించారు.

ప్రస్తుతం వారు పర్యటనలు, రచనలు చేయటం విరమించుకొని హైదరాబాదు, బర్కత్‌పురాలో క్రొత్తగా నిర్మింపబడిన పెద్ద సంఘకార్యాలయంలో ఒక గదిలో నివసిస్తూ వారి శిష్య ప్రశిష్యగణంగా చెప్పదగిన అనేక మంది కార్యకర్తలకు - వివిధ పరివారక్షేత్రాలకు చెందిన కార్యకర్తలకు మార్గదర్శకత్వం వహిస్తూ విశ్రాంతి పేరుతో నిరంతరం ఏదో ఒకటి చేస్తూనే ఉన్న చైతన్య మూర్తులు వారు. వారు శతంజీవులై మనందరియొక్క అదృష్టాన్ని మరింత పండింతురుగాక యని మంగళాశాసనం చేస్తూ సెలవుతీసుకొనటమైనది.

# రాష్ట్రకవి డా॥ ఓగేటి అచ్యుతరామశాస్త్రి

జననం : 2 ఆగస్టు, 1932

1942 ''క్విట్ ఇండియా'' ఉద్యమంలోను, 1947, 48లో నిజాం వ్యతిరేక పోరాటమప్పుడు సరిహద్దుక్యాంపుల్లోను పాల్గొని జైలుకు వెళ్ళారు.

తెలుగు - సంస్కృత - హిందీ - ఆంగ్ల భాషల్లో సమ్యక్ పరిచయం.

వక్త - కవి - రచయిత - పరిశోధకుడు - గ్రంథకర్త.

7-4-1970లో ''సంస్కృత థియేటర్'' అను సంస్కృత నాటక ప్రయోగ సంస్థస్థాపకులు, అధ్యక్షులు, నాటక ప్రయోక్తలు, దర్శకులు, నటులు, గాయకులు.

రంగస్థలం మీద ప్రదర్శించిన, ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రం నుండి ప్రసారం చేసిన అనేక సంస్కృతాంధ్ర మహానాటకాల్లో నాయక ఉపనాయక పాత్రధారులు.

హైదరాబాదులో 1974లో ప్రారంభింపబడిన తొలి సంస్కృత పత్రిక సంస్కృత భారతీ'' సంస్థాపక వ్యవస్థాపక సంపాదకులు.

హైదరాబాదులో కేశవనగర్‌కాలనీలో 1975 నుండి నెలకొనియున్న ఉన్నత పాఠశాలా స్థాపకులలో, దాని యభివృద్ధికి కారకులలో నొకరు. విద్యా ప్రచారకులుగా, సామాజిక కార్యకర్తగా మన్ననలు పొందినవారు.

1978లో రాష్ట్ర ప్రభుత్వం చేత ఉత్తమ ఉపాధ్యాయుడుగా గుర్తింపడి ''స్టేట్'' అవార్డును పొంది అప్పటి గవర్నరు గారిచే సన్మానింపబడినవారు.

సంస్కృత నాటక ప్రయోగోద్ధారక - నటరాజనందన - ఆశ్చర్యకుశల వక్త- మహోపాధ్యాయ - భాగ్యనగర భారతి - రాష్ట్రకవి - ఇత్యాది బిరుద లక్షణాభిధేయులు.

రిటైర్డు ఆంధ్రోపన్యాసకుడు మరియు ''మన వారసత్వము - సంస్కృతి'' ఉపన్యాసకుడు, విజయనగర్ కాలేజి ఆఫ్ కామర్సు, విజయనగర్ కాలనీ, హైద్రాబాదు.

# డా॥ ఓగేటి అచ్యుతరామశాస్త్రి సాహిత్యము

1. శంకరాచార్య - పద్యకృతి - 1958.
2. బందాబైరాగి - చారిత్రక నాటకం 1959. ద్వితీయ ముద్రణ : 1992, పుటలు 48, వెల రూ. 12/-
3. సంస్కృత నాటక ప్రయోగ రంగము - క్రీ.శ. 1874-1995 మధ్యకాలములో ఆంధ్రప్రదేశ్‌లో ప్రవర్తిల్లిన వంద సంవత్సరముల సంస్కృత నాటక ప్రదర్శనల చరిత్ర 1975. పుటలు 132. వెల : రూ. 10.00.
4. స్నేహబంధనమ్ - సంస్కృతములో వ్రాయబడిన సాంఘిక ఏకాంక రూపకము 1978. పుటలు 36. వెల : రూ. 2.00

5. హిమకిరీటిని - తెలుగులో స్వీయకవితా సంకలనము - 1978 పుటలు 48. వెల : రూ. 3.00. ద్వితీయ ముద్రణ 1988, వెల : రూ. 5.00.

6. భారతీయ చరిత్ర సత్యాన్వేషణ - ఇంగ్లీషు వారు వక్రగతిని పట్టించిన మన చరిత్రను సరిదిద్దుతూ సుప్రసిద్ధ చరిత్రకారులు హిందీలో వ్రాసిన వ్యాసములకు ఈ రచయిత చేసిన ఆంధ్రానువాదము, 1983. పుటలు 40. వెల : 2.50.

7. స్వామి వివేకానంద కవితావైభవం : శ్రీ వివేకానందులు వ్రాసిన 26 సంస్కృత శ్లోకములకు, 12 ఆంగ్ల కవిత ఖండికలకు అపూర్వమైన వ్యాఖ్యానము. 1983. పుటలు 48. వెల : రూ. 4.00.

8. హైదరాబాదు నగర తెలుగు భాషా సాహిత్య వికాస చరిత్ర : క్రీ.శ. 1518-1956 మధ్య దాదాపు 450 సంవత్సరముల కాలములో హైదరాబాదు నగరములో మాత్రమే క్రమ వికాసము చెందిన తెలుగు భాషాసాహిత్యముల చరిత్ర : 1985. పుటలు 150. వెల : రూ. 25.00.

9. ఓగేటి వ్యాసపీఠి - అపూర్వములైన 24 పరిశోధనా సాహిత్య వ్యాసముల సంపుటి : తిరుపతి వేంకటేశ్వరుడే తిక్కనగారి హరిహరనాథుడని నిరూపించుచు 8 శీర్షికల క్రింద విభజింపబడిన 108 పుటల వ్యాసము ఇందు మిక్కిలి ప్రధానమైనది. 1986. పుటలు 266. వెల : రూ. 40.00.

10. హైదరాబాదు నగర బిర్లామందిర వేంకటేశ్వర శతకము - వేంకటేశ్వరుని హరిహర స్వరూపుడని వర్ణించుటతోబాటు నగరమునకు చెందిన అనేక చరిత్రాంశములను సమన్వయించి నోట్సుతో సహా క్రొత్త పద్ధతిలో వ్రాయబడిన 116 తేటగీతుల శతకమిది - పుటలు 40. వెల : రూ. 5.00.

11. ఎఱ్ఱన అరణ్యపర్వ శేషము - 1984లో ఉస్మానియా విశ్వవిద్యాలయము నుండి డాక్టరేట్ పట్టమునందిన పి.హెచ్.డి. సిద్ధాంత గ్రంథము. పుటలు 240. ప్రచురణ 1989. వెల : 80.00.

12. అచ్యుత గీత - స్వీయ సంస్కృత గేయ సంపుటి.

13. Lady of the Lake - ఇంగ్లీషులో వ్రాయబడిన తెలుగు జానపద కథల సంపుటి. పుటలు : 64. ప్రచురణ : 1990. వెల : రూ. 20.00.

14. హిందూమతం - సంస్కృత గద్య గ్రంథము. పుటలు 24. ప్రచురణ 1990. వెల : రూ. 10.00.

15. శ్రీ బాసర సరస్వతీ క్షేత్రము - పద్య ప్రబంధము.

16. మహారాజా సర్ కిషన్ ప్రసాద్ బహాదుర్ ''శాద్'' జీవిత చరిత్ర, హిందీ భాషలో వ్రాయబడినది. ప్రచురణ : 1994. పుటలు : 134. వెల : రూ. 50.00.

17. హిమకిరీటిని - వ్యవస్థీకృత తృతీయ ముద్రణ.

18. భక్తిరసయోగము ఛత్రపతి శివాజీ, భక్త రామదాసమ్ - (నాటకము) శ్రీ శివభారతము (సాహిత్యోపన్యాసము)

19. ఆంధ్రకేసరి - పద్య ప్రబంధము.

20. ఓగేటి వ్యాసపీఠి. ద్వితీయ భాగము

21. వేకువ వెలుగులు - ప్రస్తుత పుస్తకము.